అగ్నిహోత్రము చల్లారుట, వరములఁబడయుట లోనగు వృత్తాంతమును సాంతముగ నివేదింప మిగుల సంతసించి శిష్యు నాలింగనముఁ జేసికొని, యిట్టి గురుభక్తిగల శిష్యునిఁబోలి నెందునుజూడనైతి సకలశుభంబులు గల్గుఁగాత యని యాశీర్వదించుచు సాంగములగు వేదములను సకల శాస్త్రరహస్యములనుఁ దెలిపి ధన్యుఁగావించె. కాఁబట్టి భూతిప్రజాపతి గలిగినందున భౌత్యుఁడను నామముతోఁ జతుర్దశమన్వంతరాధిపతియయ్యె.

## ౧౪ మన్వాదులు.

| | |
|---|---|
| ౧. స్వాయంభువమన్వంతరాది | కార్తికశుద్ధద్వాదశి |
| ౨. స్వారోచిషమన్వంతరాది | ఆశ్వయుజశుద్ధ నవమి |
| ౩. ఉత్తమమన్వంతరాది | చైత్రశుద్ధ తృతీయ |
| ౪. తామసమన్వంతరాది | భాద్రపదశుద్ధతృతీయ |
| ౫. రైవతమన్వంతరాది | పుష్యశుద్ధ ఏకాదశి |
| ౬. చాక్షుషమన్వంతరాది | ఆషాఢశుద్ధ దశమి |
| ౭. వైవస్వతమన్వంతరాది | మాఘశుద్ధ సప్తమి |
| ౮ సూర్యసావర్ణి మన్వంతరాది | శ్రావణకృష్ణ అష్టమి |
| ౯ దక్షసావర్ణిమన్వంతరాది | చైత్ర శుద్ధ పూర్ణిమ |
| ౧౦ బ్రహ్మసావర్ణిమన్వంతరాది | ఫాల్గుణశుద్ధ పూర్ణిమ |
| ౧౧. ధర్మసావర్ణిమన్వంతరాది | జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ |
| ౧౨ రుద్రసావర్ణిమన్వంతరాది | ఆషాఢశుద్ధ పూర్ణిమ |
| ౧౩ రౌచ్యమన్వంతరాది | ఆషాఢకృష్ణ అష్టమి |
| ౧౪. భౌత్యమన్వంతరాది | కార్తికశుద్ధపూర్ణిమ |

## యుగాదులు.

| | |
|---|---|
| ౧. కృతయుగాది | కార్తికశుద్ధ నవమి |
| ౨. త్రేతాయుగాది | వైశాఖశుద్ధ తృతీయ |
| ౩. ద్వాపరయుగాది | మాఘకృష్ణ త్రయోదశి |
| ౪. కలియుగాది | భాద్రపద కృష్ణ త్రయోదశి |

ప్రథమప్రకరణము సమాప్తము.

21148

పోవుచున్నాఁడను. నేను వచ్చునఱకు నాయాశ్రమమునందు అగ్నిహోత్రమునుఁ గాపాడుచుఁ జల్లాఱకుండ మిగుల జాగరూకుఁడవై చూచుచుండునదియని యాజ్ఞాపించి వెడలెను. అంత శాంతి గురునాజ్ఞ శిరసావహించి వనమునకుఁబోయి సమిత్పుష్ప ఫలాదులఁగైకొని వచ్చునంతలో నగ్నిహోత్రము చల్లాఱె. అంత శాంతుఁడైన యగ్నిహోత్రునిఁజూచి, శాంతి మిగుల దుఃఖించినవాఁడై గురువుకోపించును. లేక శపించును నేనేమిసేయుదును గతియేమి? అగ్నిస్థానమున మఱియొకయగ్నిని దెచ్చి పెట్టుదునేని సర్వజ్ఞుఁడగు గురువు దెలిసికొని మిగుల కోపపడును. ఒకతప్పునకు రెండు తప్పులగును. దుష్కరమగు విషమస్థితి సంభవించినది. దేవతలే ఆయన పేరన్న భీతిల్లుచుండ నాబోఁటివాని సంగతి యింకేమని చింతించుచు నుపాయాంతరముతోఁచక సర్వజగదాధారకుఁడును యజ్ఞస్వరూపియును, భక్తవరదుఁడు నగు నగ్నిహోత్రుని శరణుజొచ్చి కృతాంజలియై, పలువిధముల స్తోత్రముగావింప. అగ్నిహోత్రుఁడు ప్రత్యక్షమై శాంతింజూచి, నీస్తోత్రమునకు సంతుష్టుండనైతి వలసినవరము వేఁడుమన, భగవానుఁడా! నీదర్శన భాగ్యములభించె ధన్యుండనైతి, నాగురువు భ్రాతృయజ్ఞమునకు బోవుచు నగ్నిహోత్రమును గాపాడుమని చెప్పెను. నేను వచ్చిచూచునంతలో జల్లాఱెను. కాఁబట్టి దయయుంచి పూర్వమువలెనే తమ స్వరూపము నచ్చట నుండునట్లనుగ్రహింపుము మఱియు అనపత్యుఁడగు నాగురువునకు మహాబలపరాక్రమ తేజసంపన్నుఁడగు పుత్రుఁ డుదయించునట్లనుగ్రహింపుము. మఱియు, ఆయనమనస్సు మృదువై యెల్లప్రాణులయెడ మైత్రిగా నుండునట్లును కుమారతుల్యుఁడును శిష్యుఁడనగు నాయెడ మిగుల వాత్సల్యము గలుగునట్లు ననుగ్రహింపుమని ప్రార్థించెను. వరదుండగు నగ్నిహోత్రుండు శాంతినిఁజూచి నీకొఱకై యేమియుఁ గోరక, గురువునిమిత్తమే రెండువరములఁ గోరినందున, నీభక్తికి మిగుల సంతసించి ప్రీతుండనైతి నీకోరినవరంబు లన్నియు నొసంగితి. అదియునుంగాక, మహాబలపరాక్రమ సంపన్నుండును. మన్వంతరాధిపతియు నగు పుత్రుఁడు నీ గురువునకుఁ గలుగఁ గలఁడు. భౌత్యుఁడని పిలువఁబడునని చెప్పి యదృశ్యుడయ్యె. శాంతికృతాగ్ని స్తోత్రముపై ప్రకరణమునఁగననగు.

అంత గురువు యజ్ఞము సమాప్తిగావించి యాశ్రమమునకేతెంచి శాంతిని జూచి శిష్యా! నీయందును సకలజంతువులయెడలను నా మనస్సు మిగుల ప్రీతిగనున్నది. కారణము తెలుపుమన గురువు వెడలినది మొదలు

తేజస్వీ సుబలశ్చైవ భౌత్యస్యైతే మనోస్సుతాః॥

మార్కండేయే ౧౦౭ అధ్యాయే.

భౌత్యమన్వంతరమున షడ్విధ ప్రభుత్వాధికారములు.

౧. మనువు—భౌత్యమనువు—భూతిప్రజాపతి పుత్త్రుఁడు.

౨. ఇంద్రుఁడు—శుచినామకుఁడు.

౩. దేవతలు—చాక్షుష, కనిష్ఠ, పవిత్ర, భ్రాజిన (భ్రాజిర) ధారా, వృక, నామక, పంచగణములు.

౪. ఋషులు—అగ్నీధ్ర, అగ్నిబాహు. శుచి, ముక్త, మాధవ, శుక్ర, అజితనామకసప్తషులు.

౫. అవతారము—బృహద్భానువు.

౬. మనుసుతులు—గురు. గభీర, బ్రధ్న, తరస్వి, (భరత) నగ్న (అనుగ్రహ) ప్రీతిమంత (శ్రీమాని) ప్రవీర, విష్ణు, సంక్రందన, తేజస్వి. సుబలాదులు మహీపాలకులు.

భూతిప్రజాపతి వృత్తాంతము.

అంగిరసునకు భూతియను సుతుఁడుగలఁడు. ఆతం డతి తపోధన్యుండైనను, అతికోపియగుటచే నల్పవిషయముల కేని శాపమొసంగువాఁడు. ఆయన యాశ్రమమునందు, సూర్యుఁడు మిగుల వేఁడిమిచేఁ బ్రకాశింపఁడు, చంద్రుఁడు తనశీతకిరణములఁ బరుప జంకుచుండు. వాయువు విశేషముగ వీవవెఱపుఁ జెందు. అగ్ని విశేషముగఁ బ్రజ్వలింపభీతిల్లు. పర్జన్యుఁడు బురదయగునని విశేషముగ వర్షింపఁడు. వేయేల? ఆయనపేరన్న దేవతలకెల్ల భీతిగలుగు. అత్తపస్వియాజ్ఞచే ఋతువులు తమ క్రమధర్మమును విడిచి యాశ్రమవృక్షముల సతతము ఫల పుష్ప పల్లవాన్వితములుగఁ జేయుచుండు. చిరకాలము కడచినను సంతానము లేమిం జేసి యాసంయమీంద్రుఁడు సంతాపంబునొంది, తపంబు పెంపుననైననుఁ బుత్త్రునిఁ బడయుటకై పలు తెఱంగుల నుగ్రతపంబు సేయ సమకట్టినను ఆయన శాపభీతిచే రవి చంద్రమారుతాగ్నులు పూర్వమువలె నప్రమత్తనున్నఁ గని తన తపంబు ఫలింపదని తలంచి దానింజాలించె. పిదప నతని యగ్రజుండగు సువర్చస్సనుముని తానొనరించుయజ్ఞమునకు దమ్ముని నిమంత్రితుఁ గావింపగ భూతి వెడలుచు గురుకార్యనిరతుఁడును, సదాచారయుక్తుఁడును మిగుల నమ్రుఁడును శాంతుఁడును నగు శాంతినామక శిష్యునిఁబిలిచి నేను నాభ్రాతయగు సువర్చుఁడు గావించు యజ్ఞమునకుఁ బిలువఁబడి

మన్వంతరాధిపతియగు మనువు, నీపేరితోఁ బుట్టి రౌచ్యుఁడనునామము తో వెలసి బలపరాక్రమ సంపన్నులగు ననేకపుత్రులనుఁ బడయు వార లఖండభూమండలమును బరిపాలించు నృపాలకు లగుదురు. నీవు ప్రజాప తివై, చతుర్విధప్రజలను సృష్టించి, పిమ్మట నధికారమును విడిచి కైవ ల్యమునుఁ బొందఁగలవని చెప్పి, యంతర్హితులైరి. (రుచికృత పితృదే వతాస్తోత్రము, మున్ముందు పితృదేవతాప్రకరణమున వివరింపఁబడును.)

అంతట, నదీమధ్యమునుండి మనోహారిణియగు ప్రమ్లోచయను నప్సరస వెలికివచ్చి, నయభయములతో వినీతురాలై, రుచిమహర్షిం గాంచి, ఓమహనీయా! వరుణపుత్త్రుఁడగు పుష్కరునివలన, మిగుల లావణ్యవతియు, జగదేకసుందరియు నగు మాలినీనామక కన్యకనుఁబడ సితిని. ఆకన్యకను తమకొసంగెద, పాణిగ్రహణముఁ గావింపుము. అమ్మా నినియందు, మహాబుద్ధిఁగలమనువు జనించి యఖండభూమండలముఁ బరి పాలింపఁగలఁడని విన్నవింప. రుచిమహర్షి యట్లేయని యంగీకరించి, నదీ తీరమున మునులనెల్లఁ రప్పించి వారి సమక్షమున విధ్యుక్తముగ మాలి నీరమణిని వివాహమాడెను ఆమెయందు రుచికి జనించినవాడు, రౌచ్య నామకమనువై త్రయోదశతమ మన్వంతరాధిపత్యమును వహించెను.

## ౧౪. భౌత్యమన్వంతరము (ఇంద్రసావర్ణిక.)

శ్లో. భౌత్యోనామ మను స్తస్య పుత్రో భూతే రజాయత।
తస్య మన్వంతరే దేవాన్ ఋషీన్ భూపాంశ్చమే శ్రుణు॥
భవిష్యస్య భవిష్యాంశ్చ గదతో మమ విస్తరాత్।
దేవేంద్రో యశ్చ భవితా తస్య విఖ్యాతకర్మణః॥
చాక్షుషాశ్చ కనిష్ఠాశ్చ పవిత్రా భ్రాజిరా స్తథా।
ధారావృకాశ్చ ఇత్యేతే పంచదేవగణా స్స్మృతాః॥
శుచి రింద్ర స్తథా తేషాం త్రిదశానాం భవిష్యతి।
మహాబలో మహావీర్య స్సర్వైరింద్రగుణైర్యుతః॥
అగ్నీధ్రశ్చాగ్నిబాహుశ్చ శుచి ర్ముక్తోఽథమాధవః।
శుక్రోఽజితశ్చ సప్తైతే తదా సప్తర్షయస్స్మృతాః॥
గురు ర్గభీరో బ్రధ్నశ్చ తరస్వీ నగ్ర ఏవచ।
ప్రీతిమాంశ్చ ప్రవీరశ్చ విష్ణుస్సంక్రందన స్తథా॥

కాలము కర్మ నాచరింపక యుండఁజాలఁడు. కాఁబట్టి సత్కర్మానుష్ఠానము లేని సంయమము (నిగ్రహము) ముక్తినిఁ గలిగించునా? అధోగతిని గలిగించునా? యోజింపుము విషము, ప్రాణము నపహరించునదియైనను కొన్నిసమయముల ప్రాణుల రక్షించునట్టులే. అవిద్య బంధకారణమయినను, విద్యాప్రాప్తి కుపకారక మగును. సంసార విషయానుభవముల వలన దుఃఖముగలిగి, నిర్వేదనఁ జెందిన గాని, వైరాగ్యము కలుగదు. వైరాగ్యమువలనఁగాని, సమ్యక్ జ్ఞాన నిష్ఠాపూర్వక మోక్షముఁ గలుగదు. కాలిలో నొకముల్లు గ్రుచ్చుకొనిన, వేఱొక ముల్లుచే దానిని తీసివైచి, రెంటిని విడుచునట్లు. అనాసక్తమగు సత్కర్మానుష్ఠానమువలన నసద్వాసనలు నశించి, తానును బంధహేతువు కాకపోవును. కాఁబట్టి సత్కర్మానుష్ఠానమునకు గృహస్థాశ్రమ మావశ్యకత కావున, దారపరిగ్రహముఁ గావింపుము. లేనిచో, జన్మము వ్యర్థమగునని పితరులు వాక్రువ్వ, వృద్ధుఁడును, దరిద్రుఁడును నగు నాకుఁ గన్యక నెవరిత్తురని రుచి చెప్పఁగ నెట్టులేని దారపరిగ్రహము లేకపోయినచో మాకధోగతియు నీకు నరకమును గలుగునని చెప్పి పితృదేవత లదృశ్యులైరి. అంతట, రుచి, పితృదేవతల వాక్యముచే, మిగుల దుఃఖించినవాఁడై, కన్యకకొఱకు భూమియంతయుఁ దిరిగినను లభింపక ఖిన్నుఁడై, యేమిసేయుదు నెచటికిఁ బోవుదునని చింతించుచు, నభీష్టప్రాప్తికై, బ్రహ్మదేవునిఁ గూర్చి నూఱు సంవత్సరములు తపంబొనరింప, నా దేవుఁడు సాక్షాత్కరించి నీయభీప్సితమేమి? వరముకోరుమన, పితృదేవత లానతిచ్చినట్లు నాకోరిక నెరవేర్పుమని వేఁడెను. అంత చతుర్ముఖుండు రుచినిఁజూచి, నీవు ప్రజాపతివై ప్రజల సృష్టించి, యుత్తమ దార పరిగ్రహముచే సత్పుత్రులఁ బడసి, యజ్ఞాదిసత్క్రియల ననుష్ఠించి. పిమ్మట మోక్షముఁ బడయఁగలుగుదువు. పితృదేవత లానతి యిచ్చినట్లు దారనుఁ బరిగ్రహించి, వారలఁబూజింపుము. సంతుష్టులగు పితరులు, భార్యాపుత్రాది సకలాభీష్టముల నొసంగెదరని యానతిచ్చి యదృశ్యుఁడయ్యె. అంత రుచి నదీతీరమునఁ బితృతర్పణమొనర్చి, భక్తియుక్తుఁడై యేకాగ్ర మనస్సుతో బితృదేవతల ననేకవిధముల స్తుతింపగ వారలు ప్రసన్నులై, వత్సా! వరముకోరుమన, బ్రజల సృష్టించు, ప్రజాపత్యధికారము నిప్పుడే బ్రహ్మయొసంగెను. కాఁబట్టి, సత్సంతానముఁ బడయఁగల దివ్యకన్యక ననుగ్రహింపుఁడని కోరగ, బితరులు, వత్సా! మనోహారిణియగు దివ్యాంగన యిప్పుడే నీకు భార్యకాఁగలదు. ఆమెయందు,

## రౌచ్య మనువు జననవృత్తాంతము.

పూర్వకాలమున రుచి మహర్షి, మమకారరహితుఁడై నిరాహారియై, నిస్సంగుఁడై వివాహము లేక భూమిమీఁద సంచరించుచుండఁగ, నతని పితరు లతనిం జూచి, వత్సా! స్వర్గాపవర్గంబులకు హేతువగు గృహస్థాశ్రమ మేల స్వీకరింపవు? గృహస్థుఁడు, దేవతలకు, పితరులకు, ఋషులకు, అతిథులకుఁ బూజఁగావించుచు నుత్తమలోకములఁ బొందును. అగ్న్యాధానముచే దేవతలను శ్రాద్ధతర్పణములచేఁ బితరులను, అధ్యయనముచే ఋషులను. అన్నదానముచే భూతములనుఁ దృప్తిఁబొందించుచు నుత్తమగతి జెందును. దేవఋణ, పితృణ, మనుష్యఋణములను మూఁటినిఁ దీర్పక మోక్షము నందఁజాలఁడు. గృహస్థాశ్రమము (దారపరిగ్రహము) స్వీకరించితివేని, యజ్ఞాదులచే దేవతలను పుత్రోత్పాదనముచేఁ బితరులను, అన్నదానముచే మనుష్యులనుఁ దృప్తిగావించి ఋణవిముక్తుఁడవై మోక్షము నందఁగలవు. అట్లు దారపరిగ్రహమునుఁ గావింపవేని నీకు నరకమును మాకు నధోగతియుఁ గలుగునని చెప్పగా, రుచిముని పితరులంజూచి దారపరిగ్రహమువలన దుఃఖమును పాపమును అధోగతి కలుగునుగావున, నేను నిస్సంగత్వమున నకల్మషుఁడనై యుండెద. జితేంద్రియుఁడనై యాత్మసంయమనముచే ముక్తినిఁ బొందెద. అనేక జన్మసంభూతమగు పాపపంకమును సద్వాసనా జ్ఞానోదకములచేఁ గడిగివైచెద. నని చెప్పఁగఁ బితరులు, జితేంద్రియులు యోగబలముచే నాత్మమలమును గడిగివేయఁగలుగుదురు కానియది క్రమమైన మార్గముగాదు. పూర్వకర్మకృత శుభాశుభ ఫలంబుల ననుభవించి తీరవలయు మనుజుఁ డనాసక్తుఁడై కర్మ నాచరించెనేని బంధము గలుగదు. దానముల నొసంగెనేని యశుభకర్మ నశించును. పూర్వజన్మకృతకర్మఫలము భోగముచేత క్షయించుచున్నది సత్కర్మాచరణము వలన నాత్మ శుద్ధిబొంది బంధమునుండి తొలఁగుచున్నది. సత్కర్మానుష్ఠానమున నవివేకము తొలఁగి, పాపపంకమునఁ బడఁజాలఁడని, పితరులు నుడువగ, రుచిమహాముని, కర్మమార్గము, అవిద్యయని, వేద మద్ఘోషించుచుండ, నట్టి యవిద్యామార్గమున నన్నేల నియోగించెదరన, కర్మమార్గ మవిద్యయైనను, విద్యాప్రాప్తికి గర్మానుష్ఠానము హేతువగుచున్నది. సాధ్యమగు మోక్షము నందుటకు సాధనమగు త్రివర్గ సంపద కావలయును. విహితకర్మల నాచరింపకపోవుటచేఁ బ్రత్యవాయము, నహితకర్మల నాచరించుటచేఁ బాపమునుఁ గలుగును. ఎట్టి మానవుఁడేని క్షణ

తులు (లోహితులు) సువర్ణులు (సురాపులు) వీరలు ౫ పంచగణ
ములు. గణము ౧కి పదుగురు
౪. ఋషులు—ద్యుతి తపస్వీ, సుతపస్వీ, సుతప, తపోమూర్తి, తపోనిధి,
తపోధన, తపోధృతి, నామకసప్తర్షులు.
౫. అవతారము—సుధామాపతారము.
౬. మనుసుతులు—దేవవంత ఉమదేవ, దేవశ్రేష్ఠ విదూరథ, మిత్ర
వంత, మింత్రవింద నామకులు

## ౧౩. రౌచ్యమన్వంతరము. (దేవసావర్ణి)

శ్లో. త్రయోదశస్య పర్యాయే రౌచ్యాఖ్యస్య మనోస్సుతాన్।
సప్తర్షీంశ్చ సురాంశ్చైవ గదతోమే నిశామయ॥
సుధర్మాణ స్సురా స్తత్ర సుశర్మాణ స్తథాపరే।
సుశర్మాణ స్సురాహ్యేతే సమస్తా మునిసత్తమ॥
మహాబలో మహావీర్య స్తేషామింద్రో దివస్పతిః।
భవిష్యా నథ సప్తర్షీన్ గదతోమే నిశామయ॥
ధృతిమా నవ్యయశ్చైవ తత్త్వదర్శీ నిరుత్సుకః।
నిర్మోహ స్సుతపాశ్చాన్యో నిష్ప్రకంపశ్చ సప్తమః॥
చిత్రసేనో విచిత్రశ్చ నయభృన్నిర్భయోదృఢః।
సునేత్రః క్షత్రబుద్ధిశ్చ సువ్రతశ్చైవ తత్సుతాః॥

మార్కండేయే, ౯౯ అధ్యాయే.

రౌచ్యమన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

౧. మనువు-రౌచ్యమనువు-రుచిప్రజాపతికి మాలినియందు బుట్టినవాఁడు.
౨. ఇంద్రుఁడు—దివస్పతినామకుఁడు (బృహస్పతి) నామాంతరము.
3. దేవతలు—సుధర్మలు, సుకర్మలు, సుశర్మలు (సుత్రాములు) 3 గణ
ములు. ఒక్కొక్క గణమునకు 33 త్రయస్త్రింశద్దేవతలు.
౪. ఋషులు—ధృతిమంతుఁడు, అవ్యయుఁడు, తత్త్వదర్శి, నిరుత్సుకుఁ
డు, నిర్మోహుఁడు, సుతపుఁడు, నిష్ప్రకంపుఁడు, వీరలు సప్తర్షులు.
౫. అవతారము—యోగేశ్వరావతారము.
౬. మనుసుతులు—చిత్రసేనుఁడు, విచిత్రుఁడు, నయభృత్తు, నిర్భయుఁడు
దృఢుఁడు, సునేత్రుఁడు, క్షత్రబుద్ధి, సువ్రతుఁడు, వీరలు మన్వంతరపు రాజులు.

ధర్మసావర్ణి మన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

౧. మనువు—ధర్మసావర్ణి-ధర్మదేవపుత్త్రుఁడు.

౨. ఇంద్రుఁడు—వృషనామకుఁడు, (వైధృత) నామాంతరము.

౩. దేవతలు—విహంగములు, కామగులు, నిర్మాణరతులని త్రివిధగణములు. ఒక్కొక్క గణమున 30 దేవతలు.

౧ విహంగములు—రాత్రుల నిర్మించువారు.

౨. కామగులు—ముహూర్త నిర్మాతలు.

౩. నిర్మాణరతులు, మాస, ఋతు, దివసములను నిర్మించువారు. తదభిమానులు.

౪. ఋషులు—హవిష్మంతుఁడు, వరిష్ఠుఁడు, ఆరుణి, నిశ్చరుఁడు, (నిస్స్వరుఁడు) అనఘుఁడు, వృష్టి, అగ్నిదేవుఁడు, వీరలు సప్తర్షులు.

౫. అవతారము—ధర్మసేతువు.

౬. మనుపుత్త్రులు—సర్వగుఁడు, సుశర్మ, దేవానీక, పురూద్వహ, హేమధన్వ, దృఢాయు నామకులు.

## ౧౨ రుద్రసావర్ణి మన్వంతరము.

శ్లో. ద్వాదశే రుద్రపుత్రస్య ప్రాప్తే మన్వంతరే మనోః।
సావర్ణాఖ్యస్య యే దేవా మునయశ్చ శ్రుణుష్వతాన్।
సుధర్మాణ స్సుమనసో హరితా రోహితా స్తథా।
సువర్ణాశ్చ సురా స్తత్ర పంచైతే దశకాగణాః॥
తేషా మింద్రస్తు విజ్ఞేయ ఋతధామా మహాబలః॥
సర్వై రింద్రగుణైర్యుక్త స్సప్తర్షీ నపి మే శృణు।
ద్యుతి స్తపస్వీ సుతపా స్తపోమూర్తి స్తపోనిధిః॥
తపోధన స్తథైవాఽన్య స్సప్తమస్తు తపోధృతిః।
దేవవానుప దేవశ్చ దేవశ్రేష్ఠో విదూరథః॥
మిత్రవాన్ మిత్రవిందశ్చ భావిన స్తత్సుతా నృపాః॥

మార్కండేయే ౯౯ అధ్యాయే.

రుద్రసావర్ణి మన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

౧ మనువు—రుద్రసావర్ణి—రుద్రపుత్త్రుఁడు

౨. ఇంద్రుఁడు—ఋతధాముఁడు.

౩. దేవతలు—సుధర్ములు (సుకర్ములు) సుమనసులు, హరితులు, రోహి

బ్రహ్మసావర్ణి మన్వంతరమున షడ్విధ ప్రభుత్వాధి కారములు.

౧. మనువు—బ్రహ్మసావర్ణి—బ్రహ్మపుత్త్రుడు.
౨ ఇంద్రుడు—శాంతినామకుడు. (శంభువు) నామాంతరము.
౩. దేవతలు—సుఖాసీనులు (సుధామానులు) నామాంతరము.
అనిరుద్ధులు, అని యిరు తెఱంగులు. ఒక్కొక్క గణమునకు ౧౦౦ దేవతలు.
౪. ఋషులు—ఆపోమూర్తి, హవిష్మంత, సుకృతి, సత్య, నాభాగ, అప్రతిమ, వాసిష్ఠ, (సత్యకేతు) నామకసప్తర్షులు—
౫. అవతారము—విష్వక్సేనావతారము.
౬ మనుపుత్త్రులు—సుక్షేత్ర, ఉత్తమౌజ, భూరిసేన, శతానీక, వృషభ, అనమిత్ర, జయద్రథ, భూరిద్యుమ్న, సుపర్వ నామకులు.

---

# ౧౧. ధర్మసావర్ణిమన్వంతరము.

---

శ్లో. భవిష్యద్ధర్మ పుత్త్రస్య సావర్ణస్యాంతరం శ్రుణు।
విహంగమాః కామగాశ్చ నిర్మాణరతయస్తథా॥
త్రిప్రకారా భవిష్యంతి ఏకైక స్త్రింశకోగణః।
మాసస్తుదినసం యేతు నిర్మాణ రతయస్తథా॥
విహంగమారాత్రయో ఽత్ర మాహూర్తాః కామగాగణాః।
ఇంద్రోవృషాఖ్యో భవితా తేషాం ప్రఖ్యాత విక్రమః॥
హవిష్మాంశ్చ వరిష్ఠశ్చ ఋషిరస్య స్తథాఽరుణిః।
నిశ్చరశ్చానఘశ్చైవ వృష్టిశ్చాన్యో మహామునిః।
సప్తర్ష యోఽంతరే తస్మిన్నగ్నిదేవశ్చ సప్తమః॥
సర్వాంతగస్సు శర్మాచ దేవానీకః పురూద్వహః।
హేమధన్వా దృఢాయుశ్చ భావిన స్తత్సుతానృపాః॥

మార్కండేయే, ౯౯ అధ్యాయే.

దక్షసావర్ణి మన్వంతరమున షడ్విధ ప్రభుత్వాధికారములు.

౧. మనువు—దక్షసావర్ణి-దక్షప్రజాపతి పుత్త్రుఁడు.

౨. ఇంద్రుఁడు—అద్భుతనామకుఁడు - వహ్నిపుత్రుఁడగు కార్తికేయుఁడింద్రాధికారము వహించును. (శ్రుతుఁడు) నామాంతరము.

౩. దేవగణములు—పారులు, మరీచిగర్భులు, సుధర్ములని త్రివిధములు. ఒక్కొక్క గణమునకు (౧౨) పన్నిద్దఱు.

౪. ఋషులు—మేధాతిథి వసువు సత్యుఁడు, జ్యోతిష్మంతుఁడు, ద్యుతిమంతుఁడు, సవనుఁడు హవ్యవాహనుఁడు, వీరలు సప్తర్షులు.

౫. అవతారము—ఋషభావతారము.

౬. మనుపుత్త్రులు—ధృష్టకేతు, బర్హికేతు, పంచహస్త, నిరామయ, పృథుశ్రవ, అర్చిష్మంత, భూరిద్యుమ్న, బృహద్భయనామకులు.



# ౧౦. బ్రహ్మసావర్ణిమన్వంతరము.



శ్లో. మనోస్తు దశమస్యాన్యచ్ఛృణు మన్వంతరం ద్విజ।
మత్వంతరేతు దశమే బ్రహ్మపుత్రస్య ధీమతః॥
సుఖాసీనానిరుద్ధాశ్చ ద్విప్రకారా స్తథాసురాః।
శతసంఖ్యాహి తే దేవా భవిష్యంత్యత్ర వై మనోః॥
యంత్వాగ్నిషాం శతంభావి తద్దేవానాం తథాశతమ్।
శాంతి రింద్ర స్తథాభావీ సర్వైరింద్రగుణైర్యుతః॥
సప్తర్షీం స్తాన్నిబోధత్వం యే భవిష్యంతి వై తదా।
ఆపోమూర్తి ర్హవిష్మాంశ్చ సుకృతీ సత్యఏవచ।
నాభాగోఽ ప్రతిమశ్చైవ వాసిష్ఠశ్చైవ సప్తమః॥
సుక్షేత్ర శ్చోత్తమౌజాశ్చ భూరి సేనశ్చ వీర్యవాన్।
శతానీకోఽథ వృషభో హ్యనమిత్రో జయద్రథః॥
భూరిద్యుమ్న స్సుపర్వాచ తస్యైతే తనయామనోః॥

మార్కండేయే ౯౪ అధ్యాయే.

ను, శనైశ్చరునకులోకముల బీడించుగ్రహమండలాధిపత్యమును, తపతిని రూపముగనుండిలోకపావనియగునట్లును, సంవరణనృపతి వరించునట్లు అశ్వినీదేవతలు, దేవభిషక్కులుగనుండునట్లును, రేవంతుఁడుగుహ్యకుల(యక్షుల) కధిపతిగానుండునట్లును, వారివారికిఁదగిన యధికారముల నియమించెను. సావర్ణిమనువిష్ణుడు మేరువునందపంబానరించుచున్నవాడు సూర్యతేజస్సును సానఁబట్టుటచేఁ గలిగిన తేజఃపుంజముతో, విష్ణుమూర్తికి చక్రంబును, శివునకు శూలంబును, వసువులకు దారుణంబులగు శంకువులను, అగ్నిదేవునకు శక్తియును, కుబేరునకు శిబికను, యమునకు దండంబును, షణ్ముఖునకు శక్తియు, ఇతర దేవగంధర్వ యక్షాదులకు వారివారికిఁ దగిన శస్త్రములును, ఆయుధములును, విశ్వకర్మ నిర్మించి యప్రతిహతశక్తిమంతములు గావించి యొసంగెను.

# ౯ దక్షసావర్ణి మన్వంతరము.

శ్లో. దక్షపుత్త్రశ్చ సావర్ణో భావీ యో నవమో మనుః।
కథయామి మనోస్తస్య యే దేవా మునయో నృపాః॥
పారా మరీచిగర్భాశ్చ సుధర్మాణ స్తథా సురాః।
ఏతే త్రిధా భవిష్యంతి సర్వే ద్వాదశకాగణాః॥
తేషామింద్రో భవిష్యస్తు సహస్రాక్షో మహాబలః।
సాంప్రతం కార్తికేయో యో వహ్నిపుత్త్రః షడాననః॥
అద్భుతో నామకులిశీ భావీతస్యాంతరే మనోః।
మేధాతిథి ర్వసుస్సత్యో జ్యోతిష్మాన్ ద్యుతిమాం స్తథా॥
సప్తర్షయోఽస్య సవన స్తథాఽన్యో హవ్యవాహనః।
ధృష్టకేతు ర్బర్హికేతుః పంచహస్తో నిరామయః॥
పృథుశ్రవా స్త థార్చిష్మా న్భూరిద్యుమ్నో బృహద్భయః।
ఏతేనవమనుతా స్తస్య దక్షపుత్త్రస్య వై నృపాః॥

ఇతి మార్కండేయే. ౯౯ అధ్యాయే.

నిచెప్పగ, మీచెంతకురా భయపడి, మేరుపర్వతప్రాంతప్రదేశమునందు, నా భర్త సౌమ్యరూపుఁడై నన్నానందింపఁ జేయుఁగాతయని బడబారూపము ధరించి తపస్సొనరించుచున్నదని విశ్వకర్మ దెలిపి స్వామీ! మీరనుమతించితి రేని, మీ తేజస్సును భ్రమియంత్రమునఁ బెట్టి, సానఁబట్టి, లోకానందకరమగునట్లు గావించెద సెలవేనా? యని ప్రార్థింపఁగ దుస్సహమగు తన తేజఃపుంజమును సానఁబట్టుట కంగీకరించి సంకుచితరూపమును భానుఁడు ధరింపఁగా, శాకద్వీపమున నొకసంవత్సరకాలము విశ్వకర్మ సానఁబట్టెను. దేవదేవర్షిమునిగంధర్వాదులు సూర్యభగవానుని స్తుతించిరి పదునైదు భాగములు సానఁబట్టెను, ఒకభాగముమాత్రము భానుఁడు ధరించి, యశ్వరూపియై యుత్తరకురుభూములకుఁబోయి యందు బడబారూపిణియగు సంజ్ఞాదేవినిఁ గాంచెను. ఆమె పరపురుషశంకచే భయపీడితయై మెల్లగా సమీపమునకు వచ్చెను. అశ్వరూపధరులైన సూర్యసంజ్ఞాదేవుల నాసికాసంయోగమున వక్త్రమునుండి యశ్వినీదేవతలజంట యుద్భవించెను. రేతస్సునుండి రేవతుఁడను పురుషుడు ఖడ్గధనుర్బాణతూణీరధరుడై యశ్వారూఢుడై యావిర్భవించెను అంతట వివస్వంతుఁడు సౌమ్యరూపమును ధరించి యానందకరుఁడై కన్పింపగ భయరహితయై బడబారూపమును విడిచి నిజరూపము నుధరించి సంజ్ఞాదేవి భానునితోడఁగూడి స్వస్థానమును జేరె ఛాయాదేవిని దనదేహములోఁ జేర్చి జరిగినవృత్తాంతమంతయువిని సంజ్ఞాదేవి యముని నాదరించి యుభయులుగలిసి శనైశ్చరుని కాలువిఱుగఁగొట్టి భూమిపై బడవైవగ విశ్వామిత్రునాశ్రమముఁ జేరి తదనుగ్రహమువలన దుష్కరతపం బాచరించి, గ్రహమండలాధిపత్యమునుబొంది లోకములన్నిటిఁ గల్లోలముఁ గావించె. ప్రకృతము ఛాయాదేవి లేమిం జేసి, సావర్ణి, తపతి వీరల నాదరించు వారు లేరైరి, యముఁడు తల్లితోఁ జెప్పి శనిని పంగువుగ జేసి ఛాయాదేవిమీద కసిని దీర్చుకొనియెను.

వివస్వంతుండు తనపుత్త్రుల కధికార మొసఁగుట.

సంజ్ఞాదేవియందు జన్మించిన జ్యేష్ఠుఁడగు వైవస్వతున కీకల్పమున నేఁడవమన్వంతరమున మనువు అధికారమును, యమునకు(దక్షిణదిశ)లోకపాలాధికారంబును, పితృలోక పాలనాధికారంబును, యమునానది కళిందాంతర వాహినియై, లోకపావనియగునట్లు ఛాయాదేవియందు జనించిన జ్యేష్ఠుఁడగు సావర్ణికి రాబోవు నెనిమిదవమన్వంతరమున మనువధికారము

నిర్దయయై శపించెను. కాఁబట్టి శాపముతోలఁగునట్లనుగ్రహింపుమని వేఁడెను. అంత వివస్వంతుఁడు, యమునిఁజూచి తనమాహాత్మ్యము వలనఁగాని కర్మసమూహమువలనఁగాని జంతువు దుఃఖముఁ జెందుచుండు. కర్మానుభవము తప్పింప నేరితరముగాదు. సత్యవాదియు ధర్మాత్ముఁడవగునిన్నుఁ గ్రోధమావేశించి యిట్లు కావించినది. పూజ్యురాలగు తల్లి పక్షపాతముఁ జూపినను తన్నఁ గాలెత్తవచ్చునా? యాలోచింపుము. ఎల్లశాపములకుఁ బ్రతీకారముగలదు. కాని, మాతృశాపమునకుఁ దిరుగులేదు. మాతృవాక్యను వ్యర్థముసేయు సాధ్యముకానున్నను ఒకవిధముగ నిన్నను గ్రహించెద. అదెట్లన? క్రిమిసమూహము నీపాదమునందలి మాంసమును గ్రహించి క్రిందఁబడఁగలదు. కాని నీపాదము క్రిందఁబడదని, శాపము చెడకుండ సవరించెను. అంతట యముఁడు, ఫలమూలాశియై వైరాగ్యమవలంబించి గోకర్ణతీర్థమునందుఁ బదివేలసంవత్సరములు పరమేశ్వరుని గూర్చి తీవ్రతపంబొనరింపఁగా పరమేశ్వరుఁడు ప్రత్యక్షమై, దక్షిణదిశాధిపత్యమును, లోకపాలకాధిపత్యమును, పితృలోకపాలనాధికారమునొసంగెను.

పిమ్మట వివస్వతుఁడు ఛాయాదేవి చేష్టలనుఁజూచి కుపితుఁడై, తల్లి బిడ్డలందఱియెడ సమానభావముతో నుండుఁగాని పక్షపాతముతో నుండునా? ఒకవేళఁ పుత్త్రిలు పరమ దుర్మార్గులయినను, తల్లి కఠినముగా శపించునా? పుత్త్రివాత్సల్యముండదా? నీవాచరించినదిచక్కగా లేదు. అనుమానము తోఁచుచున్నది. నీవెవరు? సంజ్ఞయెక్కడనని యడుగగా, నేను త్వష్టృపుత్త్రికయగు సంజ్ఞనుగానా? మీపత్నినిగానా? మీవలన, నీసంతానముఁ గాంచితినిగదాయని ఛాయపలుకగా నాపలుకులు విశ్వసింపక సందియముకలుగుచున్నది. నిక్కముఁ దెలుపకుంటివేని శపింతునని కోపోద్దీపితుఁడై వివస్వతుఁడు పలుకగా ఛాయ భయకంపితయై జరిగినవృత్తాంతమంతయుఁ దెలిపెను. పిమ్మట వివస్వతుఁడు సంజ్ఞాదేవికొఱకై త్వష్టృప్రజాపతి గృహమున కేతేర నిఖిల జగత్పూజ్యుఁడగు నాదేవునిఁబూజించి, యోదేవా! మత్పుత్త్రికయగు సంజ్ఞాదేవి దుస్సహమగు నీతేజంబును సహింపఁజాలక, తన ప్రతిబింబమును ఛాయాదేవిగాఁ జేసి నీయొద్దనునిచి, తనవలెనే మెలంగుమనిచెప్పి నాయొద్దకురాఁగా, మీరు పంపితిరని గౌరవించితికాని, పిమ్మట మీయాజ్ఞ లేకవచ్చినదని తెలిసికొని, యమ్మా! భర్తృరహితలుగ సతులుండఁగూడదు. నీభర్తయొద్దకుఁ బొమ్ము

కును, నీవు చెప్పినట్లే మెలంగెద. శాపకేశాపకర్షణలుం గలిగినపుడు, యథార్థము తెలుపక తప్పదని ఛాయాదేవి చెప్పెను. అంత సంజ్ఞాదేవి పితృగృహమునకేఁగ, నామెను, తండ్రి ప్రేమించి సత్కరించి, అమ్మా చిరకాలము యువతులు పితృగృహమున నుండఁజనదు. నీవు భర్తనువిడిచి రాఁగతంబేమి? పూజ్యురాలవగు నీవు సభర్తృకగా వచ్చితివేని సంతసింతు నని చెప్పిన పితృవాక్యముల నాదరించి, యుత్తర కురుక్షేత్రములకుఁ జని బడబారూపము (ఆడుగుఱ్ఱము) ధరించి సంచరించు చుండెను. తీక్ష్ణమగు భర్తృతేజంబు, సహ్యమగునట్లు, తపం బొనరించుచుండెను.

## ఛాయాదేవి ప్రవర్తనము.

ఛాయాసంజ్ఞాదేవులకు భేదమించుకేని కన్పించనందున వివస్వంతుఁడు, ఛాయాదేవిని నిజభార్యయగు సంజ్ఞాదేవియే యనుకొని ప్రేమించియుండ నామె మానుషరూపియగు సావర్ణిని శనైశ్చరుఁడు అను నిరువురు పుత్త్రులను తపతియను పుత్త్రికను గనెను. (విష్టియను మఱొకపుత్త్రిక గలిగినట్లు మత్స్యపురాణమునఁగలదు.) తనకన్నఁ బూర్వము పుట్టిన వైవస్వతమనువుతోడ సమానమగు వర్ణము (గుణము) గలవాఁడు కాఁబట్టి సావర్ణి యనఁబడెను. ఛాయాదేవి తనపుత్త్రులయెడ నధికప్రీతియు, సవతి (సంజ్ఞాదేవి) పుత్త్రులయెడఁ బక్షపాతమును, అసూయయుఁగనబఱచుట జ్యేష్ఠపుత్త్రుఁడగు మనువు (వైవస్వతుఁడు) చూచి సహించుచుండెనుఁ గాని యముఁడు సహింపఁజాలక క్రోధయుక్తుఁడై ఛాయాదేవిని తన్నుటకుఁ గాలెత్తెను గాని దేహముపైఁ బడక తప్పిపోయెను. అంత ఛాయాదేవి రోషావిష్టయై యమునిజూచి "తండ్రివలెనే తల్లియు పూజ్యురాలను జ్ఞానమును మర్యాదయును లేక తన్నఁ గాలెత్తితివి. కావున నీకాలు పురుగులుబడి క్రుళ్లి భూమిమీఁదఁ బడుగాక యని శపింపఁగ యముఁడు దుఃఖించుచుఁ దండ్రియొద్దకుఁ జని దేవా! ఈమె మాతల్లి కాదు. తల్లియైనచో బిడ్డలందఱియెడ నధిక ప్రేమయు గొందఱియెడఁ బక్షపాతమును జూపునా? నేను తెలిసియో తెలియకయో బాలభావముతోఁ గాలెత్తగా నీకాలు, పురుగులుఁబడి క్రుళ్ళి క్రిందఁబడుగాక యని శపించినది. ఎట్టిక్రూరాత్మురాలగు తల్లియు బిడ్డనిట్లు కఠినముగా శపించునా? లోకమున నెచటనైనఁ గలదా? మాయన్నయగు మనువప్పుడప్పుడీమె పక్షపాతబుద్ధినిఁ గన్నట్టి నాతోఁ జెప్పుచుండును, శపింపవలదని నివారించినను

రాజ్యముఁ బొందుటయే గాక, రాఁబోవు జన్మమందు సూర్యునకు ఛాయాదేవియందు సావర్ణికమనువను నామముతోఁ బుట్టి, యెనిమిదవ మన్వంతరమునకు మన్వంతరాధిపత్యముఁ బొందఁగలవనియు, వైశ్యునకు నీవు దివ్యజ్ఞానము గలిగి సంసారబాధములను ఛేదించుకొని, మోక్షము నొందఁగలవనియు వరంబు లొసంగి, యంతర్ధానముఁ జెందెను. కాఁబట్టి దేవీప్రసాదాతిశయ ప్రభావంబున, సురథరాజు, సావర్ణిమనువయ్యెనని పైకథవలన స్పష్టమగుచున్నది.

## సూర్యకుటుంబ వర్ణనము.

బ్రహ్మమానస పుత్త్రుఁడు మరీచి యతనివలనఁ గశ్యపుఁడు, కశ్యప ప్రజాపతికి నదితియందు వివస్వతుఁడు (మార్తాండుఁడు) జనించె. వివస్వంతునకు రాజ్ఞి, ప్రభ, సంజ్ఞ, యను నామములు గల ముగ్గురు భార్యలు గలరు. అందు రాజ్ఞియందు రైవతుఁడును, ప్రభయందుఁ బ్రభాతుఁడును జన్మించిరి (ఇత్యాది మత్స్యపురాణ ప్రకారము) ఇతరపురాణములందు సంజ్ఞాదేవిని ప్రధానభార్యనుగ వర్ణించిరి. త్వష్టృప్రజాపతి పుత్త్రికయగు సంజ్ఞాదేవి, వివస్వంతుని వలన జ్యేష్ఠుఁడగు వైవస్వతమనువును గనియెను. దుస్సహ తేజస్సుగల విభునిఁ జూచి సంజ్ఞాదేవి నయనములు నిమీలనము గావించినందున వివస్వంతుండు కుపితుండై సకలప్రాణులను సంయమనము గావించు పుత్త్రుఁడు నీకు జనించునని నుడివినందున, యముఁ డుద్భవించె. భయాకులితయై, చంచలదృష్టిఁగల దేవినిఁజూచి చంచలదృష్టిఁగల దానవయినందున, విలోలస్వభావము గల పుత్త్రికనుఁ బడయుదువని చెప్పిన కతంబున, కల్లోలతరంగిణి యగు యమునను బుత్త్రికఁగాఁ బడసెం. అంతదుస్సహమగు భర్తృతేజంబును సహింపఁజాలక, యేమిసేయుదు నెచట సుఖముగ నుండు నెచటికిఁ బోవుదు నాథుండు సౌమ్యస్వరూపుం డెట్లగునని చింతించుచు, సంజ్ఞాదేవి, తనశరీరమునుండి యొక యువతినిఁ బుట్టించి ఛాయయని పేరిడి తానుకుఁ బదులుగ, భర్తయొద్ద నిడెను. అపుడు ఛాయాదేవినిఁ జూచి, 'నీవు నావలెనే భర్తయెడఁ బ్రవర్తింపుము. నా పుత్త్రుల భేదములేక మాతృవాత్సల్యమునఁ బ్రేమింపుము. భర్త, నిన్ను పరిశోధింపఁ దలఁచి యడిగినను, నేను సంజ్ఞనుఁగాదాయని విశ్వసించునట్లు పలుకుము. నందేహము కలుగనట్లు నావలెనే మెలంగుము' అని పలుతెఱఁగులఁ జెప్పఁగా, భర్త, సిగ్గుబట్టి యీయాడుచునడుగును, శపించువఱ

(మార్కండేయపురాణప్రకారము) విరజ, వరీయస, నిర్మోహ, సత్యవాక్కు, కృతి, విశ్వాదులు, మనుపుత్త్రులు.

## సూర్యసావర్ణి పూర్వజన్మ వృత్తాంతము.

స్వారోచిష మన్వంతరమున చైత్రవంశమునందు సురథుఁడను రాజు జనించి ప్రజలఁ దనపుత్త్రులవలెఁ బాలించుచు ధార్మికుఁడై యుండ కోలయను రాజధానియందు శత్త్రువులు ప్రబలులైరి. వారలఁ బరిమార్చను గాని మఱల నాపగతుకు యుద్ధసన్నద్ధులై యేతెంచి సురథు మంత్రి వర్గమును లోఁబఱచుకొనిన నాసురథుం డపజయంబునొంది కొంతకాలము పురమందుండి పుత్త్రమిత్త్రకళత్త్ర శాత్త్రవవర్గముచే నపహృతసర్వస్వుండై, రహస్యవృత్తి నేకాకియై మహారణ్యమునకుం జని యచట నొకచో శాంతమును రమ్యమునగు నాశ్రమమునుగాంచి యచట వసించు మేధస్సను మునిపుంగవుఁ జేరి నమస్కరించి తన దీనదశనుఁగూర్చి చింతించుచుండెను. మత్పూర్వులచేఁ బరిపాలితమగు రాజ్య మన్యాక్రాంతమయ్యె. నాచేఁ బోషింపఁబడిన భృత్యులు రక్షింపఁబడుచున్నారో? లేక దుఃఖితులగుచున్న వారలో? నన్నెడఁబాసిన భార్యాపుత్త్రు లెట్లు జీవింతురో? బొక్కసము లోని ద్రవ్యమును దుర్వ్యయముచేసి రాజ్యమును హీనదశకుఁ దెత్తురో? ఏమికానున్నదో యని యిట్టితలంపులచే దుఃఖించుచు మమకారబద్ధుఁడై విషయాసక్తినిఁ విడువఁజాలక యాశ్రమమునఁ దిరుగుచుండఁగ, నొకచోట సమాధినిష్ఠుఁడైన వానింగాంచి సమీపించి, నీవెవరవు? తపస్సానరింపఁ గతంబేమి? శోకాకులితుఁడవు బోలెఁ గన్పించెదవు? యథార్థము తెలుపుమని సురథుఁ డడుగగా, నో రాజోత్తమా! మహాధనికులవంశమందు జనించినాఁడను, సమాధియను పేరుగల వైశ్యుఁడను, ధనాకాంక్షితులును, పరమ లుబ్ధులునగు భార్యాపుత్త్రులచేతను, బంధువులచేతను వెడలఁగొట్టఁబడి యరణ్యముఁ జేరితిని. నిర్దయులగువారు నన్ను వెడలఁగొట్టినను వారియందు మమకారము నాకు తొలఁగ లేదు వారలక్షేమము దెలియలేదనియు, గృహమందు ధనాదులచే సుఖులుగా నున్నారా? యనియుఁ దలపోయుచుందును. కృపణులగు వారియెడఁ బ్రీతి నుంచఁ గూడదని తెలిసియు నవశముగఁ బ్రీతిని జెందుచున్నాఁడను. ఇది వైనమాయగా నున్నది. నాకేమియుఁ దెలియలేదు. నిర్విణ్ణుఁడనై తపస్సుఁ జేయుచున్నాఁడనని సమాధి తనవృత్తాంతమంతయుఁ దెలిపెను.

ఋతో దాంతో దమ స్సోమ శ్చిత్రాద్యాశ్చైవ వింశతిః॥
ముఖ్యాహ్యేతే సమాఖ్యాతా దేవా మన్వంతరాధిపాః।
మారీచస్యైవతే పుత్రాః కాశ్యపస్య ప్రజాపతేః।
భవిష్యస్య భవిష్యన్తి సావర్ణస్యాంతరే మనోః॥
తేషామింద్రో భవిష్యస్తు బలి ర్వైరోచని ర్మునే।
పాతాళ ఆస్తే సోఽద్యాపి దైత్య స్సమయబంధనః॥
విరజాశ్చ వరీయాంశ్చ నిర్మోహ స్సత్యవా క్కృతిః।
విశ్వాద్యాశ్చైవ తనయా స్సావర్ణస్య మనోర్నృపాః॥

మార్కండేయే ౭౮ అధ్యాయే.

సూర్యసావర్ణి మన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

మనువు—సావర్ణి—సూర్యభగవానునకు ఛాయాదేవియందు జనించిన వాఁడు. ముందుబుట్టిన వైవస్వత మనువుతో సమానమగువర్ణ (గుణములు) గలవాఁడు కాఁబట్టి సావర్ణియనఁబడెను.

ఇంద్రుఁడు—బలి—ప్రహ్లాదునికుమారుఁడగు విరోచనుని పుత్రుఁడు, ప్రస్తుతము పాతాళమున బద్ధుఁడై యున్నవాఁడు.

దేవతలు— సుతపులు, అమితాభులు, ముఖ్యులని త్రివిధగణములు. ఒక్కొక్కగణమునకు ౨౦ దేవతలు.

సుతపగణము—తపస్వి శుక్ర. (శక్ర) ద్యుతి, జ్యోతిఃప్రభాకర, ప్రభాస, దయిత, ధర్మ, తేజోరశ్మి, స్మర, క్రతువు, మొదలగు వారు ౨౦ మంది.

అమితాభగణము—ప్రభు—విభు—విభాస— మొదలగువారు ౨౦ మంది.

ముఖ్యగణము—ఋత, దాంత, దమ, సోమ, చిత్రాదులు, ౨౦ మంది.

ఈ దేవగణములు కశ్యపప్రజాపతి పుత్త్రులు.

ఋషులు—రామ, (జామదగ్న్య) వ్యాస, గాలవ, దీప్తిమంత, కృప, ఋశ్యశృంగ, అశ్వత్థామ లనువారలు సప్తర్షులు.

అవతారము—సార్వభౌమావతారము.

మనుపుత్త్రులు—ధృతి, వరీయస యనన సువర్ణ, నృష్టి, చరిష్ణు, ఈడ్య, సుమతి, వసు, శుభ్రాదులు.

అశ్వమేధయాగము చేసినయెడల ఇళ, కింపురుషుఁ డగును. ఒకమాసము పురుషరూపము ధరించియుండునని యనుగ్రహించి పంపఁగ, మనుపుత్త్రులలో నిక్ష్వాకుఁ డశ్వమేధము చేసినంతట, ఇళ, కింపురుషుఁ డాయెను. ఇళ, బుధునితోఁ గూడి యతనియాశ్రమమం దుండినపుడు గర్భవతియై పురూరవుఁడను పుత్త్రునిఁ బడసెను. ఇతఁడు చంద్రవంశమునకు మూలపురుషుఁడు. ఇళ, కింపురుషత్వమున సుద్యుమ్న నామముతో నొప్పి, ఉత్కలుఁడు, గయుఁడు, హరితాశ్వుఁడు (విమలుఁడు) అను మువ్వురు పుత్త్రులనుఁ బడసెను. ఇళ, ఒకమాసము స్త్రీరూపముఁ జెందుచు నొకమాసము పురుషరూపము నొందుచు రాజ్యము సేయుచుండెను. ఇళా పుత్త్రుఁడగు ఐళుని పేరితోనే ఇళావృత వర్షమనబడెను. ఈ ఐళుఁడు, సూర్యవంశజుఁడును, చంద్రవంశజుఁడు నగుచున్నవాఁడు. పురూరవుని ప్రతిష్ఠానపురమందుఁ బట్టాభిషేకము చేసి సుద్యుమ్నుఁడు తపంబునలుప వనంబునకుఁ బోయెను.



## ౮. సూర్యసావర్ణి మన్వంతరము.



### భవిష్యన్మన్వంతరములు.

శ్లో. కథిత స్తవ సావర్ణి శ్ఛాయా సంజ్ఞాసుతశ్చయః।
పూర్వజస్య మనోస్తుల్య స్సమను ర్భవితాఽష్టమః॥
రామో వ్యాసో గాలవశ్చ దీప్తిమాన్ కృప ఏవచ।
ఋశ్యశృంగ స్తథా ద్రౌణి స్తత్ర సప్తర్షయోఽభవన్॥
సుతపాశ్చామితాభాశ్చ ముఖ్యాశ్చైవ త్రిధా సురాః।
వింశకః కథితశ్చైషాం త్రయాణాం త్రిగుణోగణః॥
తప స్తపస్వీ శుక్రశ్చ ద్యుతి ర్జ్యోతిః ప్రభాకరః।
ప్రభాసో దయితో ధర్మ స్తేజోరశ్మి స్సరః క్రతుః॥
ఇత్యాదిస్తు సుతపా దేవానాం వింశకోగణః।
ప్రభు ర్విభు ర్విభాసాద్య స్తథాఽన్యో వింశకోగణః॥
సురాణా మమిఖ్యానాంతు తృతీయమపి మే శృణు

నను నేను పరమేశ్వరుని బ్రార్థించి యిలను మగవానినిగఁ జేసెదనని చెప్పి, వసిష్ఠుఁడట్లే పరమేశ్వరుని బ్రార్థించి యిలను మగవానినిగ జేసెను. అతఁడు సుద్యుమ్నుఁడు ఇతని తర్వాత ఇక్ష్వాకు, నృగప్రభృతులు సోదరులు జనించిరి. సుద్యుమ్నుఁడు పట్టాభిషిక్తుఁడై, రాజ్యము నేలుచు దిగ్విజయార్థము బయలువెడలి, మహీమండలమునఁ దిరుగుచు శరవణమున (కుమారవనమున) ప్రవేశించి పార్వతీశాపమున స్త్రీరూపమును జెంది ఇళయయ్యెను ఆతఁడెక్కిన యుత్తమాశ్వము బడబ (ఆఁడుగుఱ్ఱము) అయ్యెను. స్త్రీరూపమును జెందిన రాజు, పురుషరూపమునఁ దాఁజేసినదంతయు మఱచిపోయెను రూపవతియగు ఇళ వనమున సంచరించుచు నాతండ్రి యెవరు? తల్లి యెవరు? సోదరులెవరు? నాభర్త యెట్టివాడు? ఎచటనుండుదునని తలపోయుచుండఁగ, సకల కళాకోవిదుఁడును, రూపవంతుఁడునగు బుధుఁడు, సర్వాంగ సుందరియగు నిళనుఁజూచి, కామించి నా యాశ్రమమును వదలి యిచ్చటికేల వచ్చితివి. సాయంతన సమయమైనది. పుష్పములఁ గోసికొని చెచ్చెర యాశ్రమమునకుఁ బొమ్మని ధైర్యముతోఁ జెప్పఁగా, ఇళ తాను బుధునిభార్యయే యనుకొని, యతనితో నరిగి దివ్యమందిరమును బ్రవేశించి, యతని సేవచేయుచు సకలభోగముల ననుభవించుచుండెను.

ఇక్ష్వాకు ప్రభృతులు, సోదరుఁడగు సుద్యుమ్నునిజాడ తెలియఁజాలక పరిభ్రమించుచు నొకచోట, కళ్లెముతోఁ గూడిన యాఁడుగుఱ్ఱమునుఁజూచి, యీకళ్లెము సుద్యుమ్నుఁడెక్కు చంద్రప్రభాశ్వము సంబంధమైనది ఇట్లు మాఱుటకుఁ గతంబేమి? సుద్యుమ్నుఁడెక్కడయని తెలియఁ గోరి వసిష్ఠమహర్షి యొద్దకుఁ జని తామువచ్చినవృత్తాంతము నివేదించిరి. అమ్మహర్షి దివ్యదృష్టివలనఁ దెలిసికొని యోరాజన్యవరేణ్యులారా! సుద్యుమ్నుఁడు, చంద్రప్రభాశ్వము నెక్కి తిరుగుచుఁ దెలియక కుమారవనము ప్రవేశించినంతట పార్వతీదేవిశాపమువలన స్త్రీరూపముఁ జెందెను అశ్వము బడబయయ్యెను. కాబట్టి పరమేశ్వరు నారాధించి తదనుగ్రహమున మఱల పురుషత్వముఁ గలుగునట్లు ప్రయత్నింపుఁడన నంతట మనుపుత్త్రులు పరమేశ్వరుని గూర్చి స్తుతింపఁగ నప్పరమదయానిధి ప్రసన్నుఁడై, యోరాజపుత్త్రులారా! మీయారాధనలచే సంతుష్టుండనైతి. అయినను పార్వతీశాపమునుల్లంఘనీయము కాబట్టి ఇక్ష్వాకు రాజు

నున్నది నీవెవ్వరవని యడిగెను. మత్స్యము, తాను జనార్దనుఁడననియు, నిఁక నూఱుసంవత్సరములకుఁ బ్రళయము రానున్నదనియు, సూర్యుఁడు తనద్వాదశస్వరూపముల చేతను, బడబాగ్ని విజృంభించియు పాతాళము నుండి సంకర్షణముఖాగ్నియు, రుద్రలలాటాగ్నియు, వీనినుండి జాజ్వల్యమానము లగు నగ్నులు లేచి ముల్లోకములను దహించుచు సంక్షోభముఁ గలిగించును. అపుడు భూమి పర్వతారణ్యములతోడ దహింపఁబడి, యేకార్ణవ మహాజలప్రవాహమునందు మునుఁగును. దివ్యనావయందు స్వేదజాండజోద్భిజ్జ జరాయుజాది ప్రాణిసమూహమును, వేదములను, మహాతత్త్వముల (బీజరూపముగ) నుంచుచున్నాఁడను. మహాప్రళయార్ణవమునఁ బెనుగాలిచే నీనౌక చలించి మునిఁగిపోవకుండు నటుల అనంతుఁడనురజ్జువుచే నాశృంగమునకు గట్టిగగట్టి, ప్రాణిసమూహమును గాపాడుచుండుము. ప్రళయము పోయినతర్వాత మఱల సృష్టిగలిగి భూమ్యాదు లేర్పడును. ప్రాణివర్గము తిరిగి వారివారికర్మలచే నుత్పన్నములగును. స్థావరజంగమాత్మక మగు నిఖిలప్రపంచమునకు నీవు మనువు (ప్రజాపతివి) కాఁగలవు. భగవదాజ్ఞాపాలకుఁడవై మహోపకారకుఁడవై యెల్లప్రాణులనుఁ గాపాడిన నీవు రాఁబోవుకల్పమున నేఁడవ మన్వంతరమున కధిపతివై నెగడెదవని మత్స్యమూర్తిచెప్పి యదృశ్యమైపోయెను. అట్లు మత్స్యమూర్తియగు భగవానుఁడానతిచ్చినట్లుచేసి తపోబలమువలనను భగవదనుగ్రహమువలనను, సూర్యభగవానునకు సంజ్ఞాదేవియందు శ్రాద్ధదేవుఁడను పేరుతోజనించి యేడవమన్వంతరమున, వైవస్వతుఁడను పేరుతో, నిఖిలదేవపూజ్యుఁడై యొప్పుచుండెను.

### ఇలునిచరిత్రము

వైవస్వత మనువుభార్య శ్రద్ధాదేవి. వీరలకు ఇక్ష్వాకు,నృగ,శర్యాతి లోనగు పదుగురుపుత్త్రులు జనించిన ట్లిదివఱలోఁ జెప్పఁబడెను. ఈదంపతులకు సంతానము గలుగకమున్ను, వైవస్వతుఁడు ఉత్తమపుత్త్రునిఁ గోరి యజ్ఞముచేసెను. ఆతనిభార్య కుమార్తెను గోరి హోత నాశ్రయించెను. యజ్ఞమపుడు హవిస్సునందుకొని కూతురయ్యెడునని వషట్కారంబులు వలుకగా నామెకు ఇలయను కూఁతురుపుట్టె. వైవస్వతుఁడు వసిష్ఠునికడకు వెళ్ళి, నేను పుత్త్రునిఁగోరఁగఁ బుత్త్రిక యేలపుట్టెనని యడుగగ నతఁడు హోతగావించిన సంకల్పభేదముచే స్త్రీకలిగెను. అయి

అ. ఆదిత్యులు. వసువులు-రుద్రులు=కశ్యపాత్మజులు.
ఆ. సాధ్యులు, మరుత్తులు, విశ్వేదేవతలు=ధర్మపుత్రులు.
ఇ. భృగువులు-భృగుమహాముని పుత్రులు.
ఈ. ఆంగీరసులు=అంగిరసమహాముని పుత్రులు.

౫ ఋషులు—వసిష్ఠ, అత్రి, భరద్వాజ, గౌతమ, కశ్యప, విశ్వామిత్ర, జమదగ్ని యని సప్తర్షులు.

౬ అవతారము-వామనావతారము.

౭. మనుపుత్రులు—ఇల, ఇక్ష్వాకు, కుశనాభ, ధృష్ట, శర్యాతి, నరిష్యంత కరూష, పృషధ్న, నాభాగ, నృగులనుపదుగురు

## వైవస్వతమను జననము.

పూర్వకల్పమున (చాక్షుషమన్వంతరముయొక్క కడపటిభాగమున) ద్రమిడదేశాధిపతియగు సత్యవ్రతుండనురాజు, కృతమాలికానదీతీరంబున జలతర్పణము సేయుచుండ మత్స్యమొకటి యాతని దోసిటం బడెనని శ్రీమద్భాగవతమునం గలదు.

పూర్వకల్పమున సూర్యపుత్రుండు (వైవస్వతుండు) మలయపర్వతమున నొకప్రదేశమున జితేంద్రియుండై, ద్వంద్వసహిష్ణువై యనేకసహస్రసంవత్సరములు తపం బొనరింపంగ, బ్రహ్మదేవుండు సాక్షాత్కరించి వరము కోరుమనగా నోపితామహా! ప్రళయకాలమున, స్థావరజంగమాత్మక సకలభూతకోటికి రక్షకుండనగునట్లు, వర మనుగ్రహింపుమని యా (మనువు) రాజు ప్రార్థింపగ నట్లగుంగాక యని పితామహుం డంతర్థానుండయ్యె. అంత నొకనాం డారాజు అర్ఘ్య మిచ్చుచుండగ మత్స్యమొకటి యాతని దోసిటం బడియెం. అది తన్ను రక్షింపుము. రక్షింపుమని వేడెను రాజామత్స్యమును భాండమునం దుంచెను. మఱునాటి యుదయమున నామత్స్యము పదునాఱంగుళములు పెరిగెను. తనను రక్షింపుమని మఱల మత్స్యము ప్రార్థింపంగ దానిని నూతిలో నైచెను. ఆమఱునాటికి మత్స్యము పెరిగి నూతిపట్టకున్న దానిని దీసి చెఱువునం దుంచెను. ఆమఱునాటికి మత్స్యము మిక్కుటముగం బెరిగి చెఱువుం గూడంబట్టక యుండె. మఱలం దననుం గాపాడుమని మత్స్యము మొఱలిడ దానిని, మనువు, చెఱువునుండి తీసి సముద్రములోనుంచెను. అంతట సముద్రమంతయు వ్యాపించిన మత్స్యమునుం జూచి రాజు శెలంగుపడి, నీవు రాక్షసేశ్వరుండవా? జనార్దనుండవా! నీచరిత్రము విచిత్రముగా

ఇక్ష్వాకు ర్నాభగశ్చైవ ధృష్టశ్శర్యాతి రేవచ।
నరిష్యంతశ్చ విఖ్యాతో నాభాగో దిష్టఏవచ॥
కరూషశ్చ ప్రషధ్రశ్చ వసుమాన్ లోకవిశ్రుతః।
మనో ర్వైవస్వతస్యైతే నవపుత్రాః ప్రకీర్తితాః॥
వైవస్వత మిదం బ్రహ్మన్ కథితం తేమయాఽంతరమ్।
అస్మిన్ శ్రుతే నర స్సద్యః పఠితే చైవ సత్తమ।
ముచ్యతే పాతకై స్సర్వైః పుణ్యంచ మహ దశ్నుతే॥

ఇతి మార్కండేయే ౭౮ అధ్యాయే.

శ్లో. వివస్వత స్సుతో విప్ర శ్రాద్ధదేవో మహాద్యుతిః।
మను స్సవర్తతే ధీమాన్ సాంప్రతం సప్తమే ఽంతరే॥
ఆదిత్యవసురుద్రాద్యా దేవా శ్చాత్ర మహామునే।
పురందర స్తథైవాత్ర మైత్రేయ త్రిదశేశ్వరః॥
వసిష్ఠః కశ్యపో ఽథాత్రి ర్జమదగ్నిస్స గౌతమః।
విశ్వామిత్ర భరద్వాజౌ సప్తసప్తర్షయో ఽత్రచ॥
ఇక్ష్వాకుశ్చైవ నాభాగో ధృష్ట శ్శర్యాతి రేవచ।
నరిష్యంతశ్చ విఖ్యాతో నాభ ఉద్దిష్ట ఏవచ॥
కరూషశ్చ పృషధ్రశ్చ వసుమాన్ లోకవిశ్రుతః।
మనో ర్వైవస్వతస్యైతే నవపుత్రాస్తు ధార్మికాః॥

విష్ణుపురాణే, 3 అంశే, ౧ అధ్యాయే,

శ్లో. ధర్మిష్ఠానాం వరిష్ఠశ్చ రైవతః పంచమో మనుః।
షష్ఠశ్చ చాక్షుషో జ్ఞేయో విష్ణుభక్తిపరాయణః॥
శ్రాద్ధదేవ స్సూర్యసుతో వైష్ణవస్సప్తమో మనుః॥

ఇతి బ్రహ్మవైవర్తే ప్రకృతిఖండే.

వైవస్వతమన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

౧. మనువు—వైవస్వతుఁడు, సూర్యునివలన సంజ్ఞాదేవియందు జనించిన వాఁడు,

౨. ఇంద్రుఁడు—ఊర్జస్వి, పురందరనామాంతరము.

3. దేవగణములు—ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సాధ్యులు, విశ్వేదేవతలు, మరుద్గణములు, భృగువులు, అంగిరసులు అని అష్టగణములు.

మోక్షప్రతిబంధములగు కర్మలనుఁ బోఁగొట్టి యాత్మశుద్ధినిఁ గోరి తపం బొనరించుచున్నాఁడ. అనుగ్రహించి కైవల్యము ప్రసాదింపుఁ డని ఆనందుఁడు ప్రార్థింప బ్రహ్మ అధికారవంతుఁడు మోక్షమునుఁ బొందఁజాలఁడు. జన్మాంతరకృతతపంబువలన నఖండభూమండలమునుఁ బరిపాలించు మన్వంతరాధికారము నిన్నాశ్రయించియున్నది. ఆఱవమనువు కాఁగలవు భగవన్నియోజితమగు మన్వధికారమును నిర్వర్తించితివేని తదనంతరమున నీకు ముక్తికలుగును. తపంబు చాలింపుము. పూర్వజన్మమున నాచక్షున్సువలన బుట్టితివి. కాఁబట్టి యిప్పుడు చాక్షుషమనువను నామముతో వెలయుదువు. శుభంబుఁగల్గుఁగాత యని యంతర్హితుం డయ్యె. అంతట చాక్షుషుండు తపంబుచాలించి ఉగ్రుఁడను భూపతి కుమార్తెయగు విదర్భను వివాహమాడి భూపరిపాలనం బొనర్చుచు బలవంతులగు ననేకపుత్రులను బడసెను.



# ౭. వైవస్వత మన్వంతరము.



శ్లో. ఆదిత్యా వసవో రుద్రా స్సాధ్యా విశ్వే మరుద్గణాః।
భృగవో ఽంగిరస శ్చాష్టౌ యత్ర దేవగణా స్స్మృతాః॥
ఆదిత్యా వసవో రుద్రా విజ్ఞేయాః కశ్యపాత్మజాః।
సాధ్యాశ్చ మరుతో విశ్వే ధర్మపుత్రగణా స్త్రయః।
భృగో స్తు భృగవో దేవాః పుత్రా హ్యంగిరస స్సుతాః।
ఏష సర్గశ్చ మారీచో విజ్ఞేయ స్సాంప్రతాధిపః॥
ఊర్జస్వీ నామ చైవేంద్రో మహాత్మా యజ్ఞభాగభుక్।
భూర్లోకో ఽయం స్మృతా భూమి రంతరిక్షం భువస్స్మృతం।
దివ్యాఖ్యశ్చ తథా స్వర్గ స్త్రైలోక్య మితి కథ్యతే॥

అత్రి శ్చైవ వసిష్ఠ శ్చ కాశ్యప శ్చ మహానృషిః।
గౌతమశ్చ భరద్వాజో విశ్వామిత్రో ఽథ కౌశికః॥
తథైవ పుత్రో భగవా నృచీకస్య మహాత్మనః।
జమదగ్ని స్సప్తైతే మునయోఽత్ర తథాఽపరే॥

తోడనే, యథావిధిగ నుపనయనముఁ జేసి, గురువునొద్దవిడువగ, గురువు ఉపనీత బాలకునిఁ జూచి, మాతృవందనము గావింపుమనియెను.

అంత బాలకుఁడు గురువర్యునిం గాంచి అయ్యా! నేనేతల్లికి నమస్కరింతును? నన్నుఁ గన్నతల్లి పెంచినతల్లి యిరువురు గలరు. అందీమె పెంచినతల్లి యని చెప్పిన గురువు ఆనందునిఁ జూచి. రుధన్వపపుత్రికయు, విక్రాంతుని భార్యయు నగు నీహైమిని నీవు గన్నతల్లి కాదా? ఇదియేమి చోద్యమనిన గురువర్యా! యీయమ విశాలగ్రామమందున్న చైత్రునకు దల్లిగాని నాకుఁ దల్లిగాదని చెప్పిన నీవెవఁడవు వీఁడెవఁడు వివరింపుమని యడిగిన ఆతని దేవి యగు గిరిభద్ర నాకుఁదల్లి నేఁజనించి పురిటింటయుండినపుడు జాతహారిణి (మార్జాలము) ననుఁదెచ్చి యిచటనుంచి యిచటి శిశువును, విశాలగ్రామవాసి యగు బోధుండను బ్రాహ్మణుని గృహమునకుఁ గొనిపోయి ప్రసవించిన యతని భార్య శయ్యయందునిచి అచ్చటఁ బుట్టిన శిశువును భక్షించె కావున హైమినీపుత్రుఁడు విశాలగ్రామంబున బోధునకుఁ బుత్త్రుఁడుగనుండి ద్విజోచితసంస్కారములచే సంస్కృతుఁడై యున్నపుఁడు నేనిచట మీచే సంస్కరింపఁబడితిని మీవాక్యమును ల్లంఘనీయము. ఏతల్లికి నమస్కరింపవలసినది వాక్రువ్వుఁడని వేఁడగ నిది ధర్మసంకటముగనున్నది. యేమియుఁ దోఁచ లేదు. బుద్ధి భ్రమించుచున్నదని గురువుచెప్పగ లోకమున నెవరికెవరు సంబంధులు? జన్మించినది మొదలు సంబంధమేర్పడి మృతిజెందినంతట సంబంధము వీడిపోవుచున్నది. కావున సంసారమందు స్వతస్సిద్ధమైన సంబంధు లెవ్వరును లేరు. కార్యకారణ సంబంధమునుబట్టి కలుగుచున్నారు. ఈజన్మమునందే ప్రేమగల యిద్దఱు తండ్రులను ఇద్దఱు తల్లులఁజూచితి. ఇఁక జన్మాంతరమున నెందఱు తల్లులు ఎందఱు తండ్రులుండిరో యిది మిగుల చిత్రముగదా! నేతపంబునకుఁ బోయెదను విశాలగ్రామమందుండెడు నీరాజపుత్రుని చైత్రునిరావింపుమనిన, గురువు రాజునకెఱింగించిన నావిక్రాంత మహీపతి యాతని యందు మమకారమును వదలి, తనపుత్రుని చైత్రుని రావించి యతనికి వలయు రాజనీతులను శస్త్రాస్త్రవిద్యలను గఱపి, రాజ్యాభిషేకముఁ గావించె. పుత్రప్రేమచేఁ బెంచిన యానందుఁడు, బాలుఁడుగా నుండియును, కామాదులజయించి, తపంబు జేయుతఱి, బ్రహ్మ ప్రసన్నుండై కోరినవరం బిచ్చెద వేఁడుమన, ఆనందుఁ డిట్లని వరంబు వేఁడెను.

దేవగణములు — ఆద్యులు, ప్రసూతులు, భవ్యులు, యూథగులు, లేఖులు. పంచగణములు ఒక్కొకగణమునకు నెనమండ్రు దేవతలు. (ఆప్యులు - ప్రభూతులు - భవ్యులు - పృథగులు - లేఖులు నామాంతరము.)

ఋషులు — సుమేధ - విరజ - హావిష్మాన్ - ఉన్నత - మధు - అతినామ - సహిష్ణు నామక సప్తర్షులు.

అవతారము — అజితనామము.

మనుపుత్రులు — ఊరు - పూరు - శతద్యుమ్న - తపస్వి - సత్యవాక్కు - కవి - అగ్నిష్టుప్ - అతిరాత్ర - స్వచ్ఛస్వ - అభిమన్యు నామకులు.

## చాక్షుషమనువు జననము.

అనమిత్రుం డను మహీపతికి, గిరిభద్రయందు సర్వలక్షణలక్షితు గు సుతుం డుదయించె నంత పురిటింట గిరిభద్ర తనకుమారుని నక్కు : జేర్చికొని మక్కువతో ముద్దిడ, పూర్వజ్ఞాని యగు శిశువు పక్కున గియె నంత మాత భీతిల్లి, "యోకుమారుండా నీకిట్టి నగవు పుట్టుటకుఁ ణంబేమి యనిన నాశిశు విట్లనియె? అదిగో నన్నెక్కుటకు జాతహారిణి యను మార్జారము పొంచి యుండి, కొనిపోవఁ జూచుచున్నది. ఇట్లుండ వు నన్నుఁ బలుమాఱు ముద్దు లిడుకొని పుత్రప్రేమచే నాలింగనం సెదవు. ప్రయోజనంబు లేదుగాన నవ్వితి. నన్ను నీవెఱుఁగవు. న్ను నేనెఱుఁగను, ౫-౬ దినముల పరిచయముచేఁ బుత్రవ్యామోహ ముగలిగి యీశిశు వుపకరించునని తలఁచుకొనుచుంటివి. ఇదియంతయు దైవికమున వ్యర్థమని, శిశువుచెప్పఁగ నాపలుకుల నాలకించి, తల్లి నేనా నగించునది నీకుఁ బ్రీతిగానిచో సూతికాగృహము నుండి వెడలిపోవుదు నని చెప్పి వెడలిపోయె. అంత నాయర్భకుని జాతహారిణి కొని పోయి, విక్రాంతుం డను రాజుయొక్క భార్య ప్రసవించియున్న శయ్యయందునిచి, యచటిశిశువును మఱియొకని యింటికి గొనిపోయి యునిచి, యాయింట బుట్టిన శిశువును భక్షించె. ఇట్లు ప్రతిదినము శిశువులనుఁ బరివర్తనము సేయుచు గొన్నింటిని గనికరము లేక భక్షించుచుండును. అంతవిక్రాంత భూపతి, తనకుఁ బుత్రుం డుద్భవిల్లె నని మహదానందము నొంది యా శిశువున కానందుండని నామంబిడి యుపనయనకాలము సంప్రాప్తమైన

జ్య మొనరించుచుండఁ గొంతకాలమునకు రేవతికి సర్వలక్షణలక్షితుండగు పుత్త్రుండు జనింప రైవతుఁడని నామంబిడిరి ఈరైవతుఁడు సకలధర్మవేదియై నిఖిలశస్త్రాస్త్రకోవిదుఁడై యఖండభూమండలమునుఁ జక్కఁగఁ బరిపాలించి మనువయ్యెను.

---

## ౬. చాక్షుష మన్వంతరము.

---

శ్లో. షష్ఠే మన్వంతరే చాసీ చ్చాక్షుషాఖ్య స్తదా మనుః।
మనోజవ స్తథైవేంద్రో దేవా నపి నిబోధమే॥
ఆర్యాః ప్రసూతా భవ్యాశ్చ పృథుగాశ్చ దివౌకసః।
మహానుభావా లేఖాశ్చ పంచైతే ఒష్టకా గణాః॥
సుమేధా వీరజా శ్చైవ హవిష్మా నుత్తమో మధుః।
అతినామా సహిష్ణుశ్చ సప్తాస న్నితి చర్షయః॥
ఊరుః పూరు శ్శతద్యుమ్న ప్రముఖా స్సుమహాబలాః।
చాక్షుషస్య మనోః పుత్రాః పృథివీపతయో ఒభవన్॥

శ్రీ విష్ణుపురాణే 3 అంశే ౧ అధ్యాయం.

శ్లో. ఆప్యా నామ సురా స్తత్ర తేషా మేవాష్టకో గణః।
ప్రఖ్యాతం కర్మణాం విప్ర యజ్ఞే హవ్యభుజా మయం।
ప్రఖ్యాతబలవీర్యాణాం ప్రభామండలదుర్దృశాం।
ద్వితీయశ్చ ప్రభూతాఖ్యో దేవానా మష్టకో గణః।
తథైవాష్టక ఏవాన్యో భవ్యాఖ్యో దేవతాగణః।
చతుర్థశ్చ గణ స్తత్ర పృథగాఖ్య స్తథాష్టకః।
లేఖా సంజ్ఞా స్తథైవాన్యే తత్ర మన్వంతరే ద్విజ।
పంచమే చ గణే దేవా స్తత్సంఖ్యా హ్యమృతాశనాః॥

ఇతి మార్కండేయే.

చాక్షుషమన్వంతరమున షడ్విధప్రభుత్వాధికారములు.

౧, మనువు—చాక్షుషమనువు అనమిత్రునకు గిరిభద్రయందు జన్మించినవాఁడు. (ధ్రువవంశీయుఁడగు సర్వతేజునకు, ఆకూతియందుఁ గలిగినట్లు శ్రీ భాగవతమునఁగలదు.

౨. ఇంద్రుఁడు—మనోజవుఁడు (మంద్రుఁ మనామాంతరము)

ముగ యజ్ఞాదుల నొనరించి (పుత్) అను నరకబాధ లేకుండ, బుత్త్రినిఁ బడసితి. ఆపుత్త్రుఁడు తలిదండ్రుల పాపంబుచేతనో. బంధువుల పాపంబు చేతనో దుష్టుఁడై వర్తింపుచున్నాఁడనిన గర్గుండతనిం జూచి, రేవతీనక్షత్రనాల్గవపాదమున (ఋక్షసంధి, రాశిసంధి) నీకు సుతుఁ డుద్భవిల్లెఁగావున నాకాలమహిమచేఁ నతఁడు దుష్టుండయ్యె. అది యితరులదోషము కాదనిన ఋతవాక్కు కోపోద్దీపిత మానసుఁడై రేవతీనక్షత్రము పుడమి పైని పడునట్లు శపించిన నఖిలజనులు వీక్షింపుచుండ, రేవతీనక్షత్రము కుముదపర్వతమునం బడియె. అంత నాచుక్క వెలుఁగుచే వెలుఁగొంది యాకొండ రైవతక మనంబరగె. భూపతనంబైన యా రేవతీనక్షత్రము తామరపువ్వులచే నిబిడీకృతంబుగ నుండెడి యొకకొలనుగాఁ బరిణమిల్లె. అందు రూపవతియగు నొకకన్నియ జనించిన దానికి ప్రముచుండను ముని రేవతియని నామంబిడి తన యాశ్రమంబునకుం గొనిపోయె. కొంతకాలమున కావనితకు, యౌవనంబు నివ్వటిలఁ దగినవరుఁ డెచటం గానక, యాముని యగ్నిదేవునిం బ్రార్థించిన నాదేవుండు, నీకన్నియకు దుర్దముండను భూపతి విభుండగునని వక్కాణించె. ఇట్లుండ మృగయా వినోదంబునఁ బ్రియవ్రత వంశోద్భవుండును, విక్రమశీలునకు కాళిందీదేవి యందుజనించిన, దుర్దముండను రాజు, ప్రముచుని యాశ్రమంబున కేతెంచి యగ్నిప్రేరణచే ఓప్రియసఖీ! నీతండ్రికి నమస్కరించుటకు వచ్చితిననఁ నగ్నిశాలయందుండు ప్రముచుఁ డాపలుకుల నాలకించి, వెలుపలికి వచ్చి, దుర్దమునిం గాంచి నను జిరకాలమునకుఁ జూచితి. నీవు నాకల్లుఁడవు కావున నర్ఘ్యంబిచ్చుట యుచితం బని, యట్లొనర్చిన నాభూపతియు నర్ఘ్యంబుగైకొని,యీమునికి నేనెట్టుల జామాతనని యోజింపుచుండ ప్రముచుండు కుశలం బడిగిన, మీయనుగ్రహంబునఁ గుశలంబునకుఁ గొఱంతయేమి? అంతయు శుభం బని చెప్పి, నేను మీకెట్టుల్లుఁడనైతి వివరింపుమనన నాముని, త్రిలోకసుందరి యగు రేవతి నీకు భార్యగానున్నది. ఏల తెలియదనిన, నారాజపుంగవుండు, సుభద్ర, శాంతతనయ, కావేరి, తనయ సురాష్ట్రిజ,సుజాత, కదంబ, వరూథిని, విపాఠ, నందిని అను భార్యలు కలరుకాని, రేవతిని నేనెఱుంగను.

ఆమె యెవతె యనిన నామునిపుంగవుండు, ఓనృపోత్తమా! ప్రియసఖీ యని పిలిచితివే యది మఱచితివా? అదియే నీభార్య నీవట్లు పిలి

౨. ఇంద్రుడు—విభునామకుఁడు.
౩. దేవగణములు—సుమేధసులు-భూతరయులు (భూతరజులు) వైకుంఠులు-అమితాభులు - ఈచతుర్గణములు గణము ౧౪- చతుర్దశసంఖ్యాక దేవతలు.
౪. ఋషులు—హిరణ్యరోమ, వేదశ్రీ, ఊర్ధ్వబాహు వేదబాహు, సుధామ, పర్జన్య, వసిష్ఠనామక సప్తర్షులు.
౫. అవతారము—వికుంఠనామకుఁడు.
౬. మనుపుత్రులు—బలబంధు, మహావీర్య సుయష్టవ్య, సత్యకాద్యులు, (అరుణ, తత్త్వదర్శి, విత్తవంత, హవ్యప, కవి, ముక్తి నిరుత్సుక, సత్త్వ, నిర్మోహ, ప్రకాశకులు) నామాంతరములు.

## రైవతమనువు జననము.

పూర్వకాలమున ఋతవాక్కను ఋషి, చిరకాలము సంతానము లేక, చింతింపుచుండఁ గొంతకాలమున కతనికి రేవత్యంతమున (రవపాదము, నక్షత్రసంధి, గండకాలమున) నొకసుతుఁడుజనించెను. అతనికితండ్రి జాతకర్మనామకరణాది సంస్కారంబులు జరిగించెనుగాని యాసుతుండు జ్ఞానహీనుఁడుగ వర్తింపుచుండె. మఱియు, కొడుకు పుట్టినది మొదలు తండ్రికి దీర్ఘరోగముగ, తల్లికి కుష్ఠురోగము సంభవించె. నంత తండ్రి కుమారునివలనఁ గలిగిన యనిష్టమునకై చింతింపుచుండ నాపుత్రుఁడు మఱియొక మునిపుత్రునిభార్యనుగ్రహించె నట్టి దుర్బుద్ధిగల పుత్రుని దుష్టచర్యకు తండ్రి చింతించి, 'కుపుత్రుఁడు గలుఁగుటకన్న ఋత్తులు కలుగకుండుటయే మానవులకు మంచిది కుపుత్రుఁడెల్లకాలము తలిదండ్రులకు మనోవ్యథ గలిగించును. పితరులను స్వర్గమునుండి నరకములోనికిఁ బడద్రోయును. మిత్రుల కుపకారముఁ గావింపఁజాలఁడు. తలితండ్రులకు తీఱని దుఃఖముఁ గలిగించు నట్టి దుష్టపుత్రునిజన్మము వ్యర్థమైనది. యోగ్యులును, గుణవంతులును, పరోపకార నిరతులు నగు. పుత్రులను గలిగినవారలే పుణ్యాత్ములు, ధన్యులు, తక్కినవారల జన్మవ్యర్థము, కుపుత్రుఁడచిరకాలముననే తలిదండ్రులకు వార్ధకముననుఁ గలిగించునను నిట్టి దీనాలాపంబులఁ గుందుచు వృద్ధుండగు గర్గమునిం గాంచి, ఓ మహాత్మా! నేను బ్రహ్మచర్యాశ్రమమున, సాంగములగు వేదములగ్రహించి, పిదప గృహస్థాశ్రమమును స్వీకరించి, భార్యనుగూడి విధియుక్త

ఒకపిపాసాతురుని నిర్జించి, ధర్మంబు తప్పక వర్తింపుచుండఁ దండ్రి కాలవశంబున పుణ్యలోకంబుల కేగె. అంత తామసుం డఖిలభూమండలమును జయించి మనువుగాఁ బ్రసిద్ధిఁ బొందె. ఈతామసమన్వంతరమునందే శ్రీమహావిష్ణువు గజేంద్రుని మకరబాధనుండి తొలఁగించి రక్షించినట్లు శ్రీ భాగవత అష్టమస్కంధమునఁ జూపట్టుచున్నది.

## ౫. రైవతమన్వంతరము.

శ్లో. తస్మా దజాయత సుతో రేవత్యాం రైవతో మనుః।
సమేత స్సకలై ర్ధర్మై ర్జ్ఞానవై రపరాజితః॥
విజ్ఞాతాఖిలశాస్త్రార్థో వేదవిద్యార్థశాస్త్రవిత్।
తస్య మన్వంతరే దేవాన్ మునిదేవేంద్రపార్థివాన్॥
కథ్యమానా న్మయా బ్రహ్మన్ నిబోధ సు సమాహితః।
సుమేధస స్తత్ర దేవా స్తథా భూతరయాదయః॥
వైకుంఠా శ్చామితాభా శ్చ చతుర్దశ చతుర్దశ।
తేషాం దేవగణానాం తు చతుర్ణా మపి చేశ్వరః।
నామ్నా విభు రభూ దింద్ర శ్శతయజ్ఞోపలక్షకః।
హిరణ్యరోమా వేదశ్రీ రూర్ధ్వబాహు స్తథాపరః।
వేదబాహు స్సుధామాచ పర్జన్యశ్చ మహామునిః।
వసిష్ఠశ్చ మహాభాగో వేదవేదాంతపారగః।
ఏతే సప్తర్షయ శ్చాసన్ రైవతస్యాంతరే మనోః।
బలబంధు ర్మహావీర్య స్సుయష్టవ్య స్తథా పరః।
సత్యకాద్యా స్తథైవాసన్ రైవతస్య మనో స్సుతాః।
రైవతాంతాస్తు మనవః కథితా యే మయా తవ।
స్వాయంభువాన్వయా హ్యేతే స్వారోచిషమృతే మనుమ్॥

ఇతి మార్కండేయే, ౭౦ అధ్యాయే.

రైవత మన్వంతరమున షడ్విధ ప్రభుత్వాధికారములు.

౧. మనువు—రైవతమనువు:—దుర్దమ నృపతికి రేవతియను కాంతయందు జన్మించినవాఁడు.

## తామసమను జననము.

పూర్వకాలమున సురాష్ట్రుఁడను రాజు. అనేకయజ్ఞము లొనరించి, మహాపరాక్రమవంతుఁడై రణరంగమున, శత్రువుల జయించి, ధార్మికుఁడై యుండ అతనిమంత్రి, సూర్యు నారాధించి, రాజునకు దీర్ఘాయుష్యముఁ గలుగునట్లు వరముఁబడసెఁ. రాజు జీవించియుండ, బిడ్డలు లేని నూఱుగురు భార్యలు లోకాంతరమునకుఁ జనిరి. (సురాష్ట్రరాజు భార్యాపుత్త్రులు లేక, బలహీనుఁడై యున్నాఁడని భృత్యులవలనఁ దెలిసికొని విమర్ద నామకభూపతి, యతనివి రాజ్యభ్రష్టునిఁ గావింపఁగ నరణ్యమునకు బోయి వితస్తానదీసైకత ప్రదేశమున, మండు వేసవికాలమునఁ బంచాగ్నిమధ్యమునను, వర్షాకాలమున వర్షమునకుఁ దడయుచు, శిశిరకాలమున జలశాయిగనుండియు ఘోరముగ దపంబొనరించుచుండ వర్షాకాలంబున నాకసము మేఘావృతమై దిక్కులు తెలియక యధికముగ వర్షింపభూమి జలావృతమై మహాప్రవాహముగఁ బ్రవహించునదిలో విమర్దుఁడు దగుల్కొనిపోవుచుదరిచేరుటకిరవు లేకనుండుతఱినొకమృగవాలము చేతికందిన దానింబట్టుకొని, మెల్లగ దరిఁజేరి దాని సమీపముననుండెడు రమణీయవనముజొచ్చి. యది మృగంబని తెలిసికొనియు దానియందు మోహపరవశుఁడై యుండ నామృగంబు, రాజపుంగవుని యాశయంబుఁ దెలిసికొని, రాజునుజూచి, యోరాజోత్తమా! నన్నెందుకు స్పృశించెదవు? ఆకాలమున నీకిట్టి బుద్ధి జనించుట యనుచితము. నేగర్భవతని, సంభోగమున కర్హురాలఁ గానన, రాజోత్తముండా మృగింగాంచి, నీవెవరవు? అన నామృగి యిట్లనియె. ఓమహాత్మా! నేను పూర్వమునదృఢధన్వుఁడను రాజుకుమార్తెను నీనూఱుగురు భార్యలలో మొదటిదానను, నాపేరుత్పలావతియన, రాజు దానింగాంచి నీకీ జన్మంబెట్లు సంఘటిల్లె వివరింపుమన నిట్లనియె. నేను బాల్యంబునఁ బితృగృహంబునఁ జెలికత్తియలతో విహరింపుచుండ, నాఁడు లేడింగూడ వచ్చెడి మగలేడింగాంచి యా రెంటికి. వియోగంబుఁ గలుగు నటుల యాలేడింగొట్టిన నదిపరుగిడ, దాని వెన్వెంటివచ్చెడి మగలేడి మిక్కిలి యాగ్రహించి, నేఁజేయఁబూనిన గర్భాధానంబునకు భంగంబుఁ గలుగఁజేసితివని మానుషభాషచే నుడివిన నేను భీతిల్లి, నీవెవరు నీకీజన్మంబెట్టుల సంఘటిల్లె నన నా మృగంబు నేనునిర్వృత్తచక్షుఁడనుమునిపుత్త్రుఁడ నాపేరుసుతపుఁడు నేనీమృగియందిచ్ఛయించి మృగరూపంబునొందితి,

# ౪. తామస మన్వంతరము.

శ్లో॥ ప్రియవ్రతసుతా వన్యా ద్వౌ మనూ ధర్మిణాం వరౌ।
తౌ తృతీయ చతుర్థౌచ వైష్ణవౌ తామసోత్తమౌ
తౌచ శంకర శిష్యౌచ కృష్ణభక్తి పరాయణౌ।
తామసస్యాంతరే దేవా స్సురూపా హరయస్తథా।
సత్యాశ్చ సుధియస్త్వైవ సప్తవింశతికాగణాః॥
శిబి రింద్ర స్తథా వాసీ చ్ఛతయజ్ఞోపలక్షణః।
సప్తర్షయశ్చ యేతత్ర తేషాం నామాని మే శ్రుణు॥
జ్యోతిర్ధామా పృథుః కావ్య శ్చైత్రోఽగ్ని ర్వతకస్తథా।
పీవర శ్చర్షయో హ్యేతే సప్తతత్రాపి చాంతరే॥
నరః ఖ్యాతి శ్శాంతహయో జానుజంఘాదయస్తథా।
పుత్రాస్తు తామసస్యాసన్ రాజాన స్సుమహాబలాః॥

ఇతి శ్రీ విష్ణుపురాణే 3 అంశే.

తామస మన్వంతరమున—షడ్విధ ప్రభుత్వాధికారములు.

౧. మనువు—తామసమనువు. సురాష్ట్రునివలన మృగీరూపిణియగునుత్పలావతియందు జనించినవాడు.

౨. ఇంద్రుడు—శిబి (త్రిశిఖ, లేక శిఖినామాంతరములు)

౩. దేవగణములు—సత్యాః, సురూపాః (స్వరూపాః) సుధియః, హరయః (సత్య సుధీ స్వరూపహర్యాదయ నామకులు) ౨౭ (సప్తవింశతి) దేవగణములు.

౪. ఋషులు, జ్యోతిర్ధామ, పృథు, కావ్య, చైత్ర, అగ్ని, వతక, పీవర నామకసప్తర్షులు.

౫. అవతారము—హరి.

౬. మనుపుత్రులు—వృష, ఖ్యాతి, నర, శాంతహయ జానుజంఘాదులు, (నర, క్షాంతి, శాంత, దాంత, జానుజంఘాదులు) అకల్మష, తపోధన్వి, తపోమూల, తపోధన, తపోరతి, తపస్య, తపోద్యుతి, పరంతప, తపోభాగి, తపోయోగి, ౧౧గురు,

(మత్స్యపురాణ ప్రకారము.

గలుగుచున్నాడని చెప్పగ, నీభార్యయరణ్యములో మృగములచే భక్షింపఁ బడి యుండనోపు, మఱియొక యువిదనుఁ బరిణయముఁ జేసికొమ్మనిన, నాభార్య పాతాళలోకమున, సురక్షితముగఁ బాతివ్రత్యముతో నున్న యది. ఆమెయెడ నాకిష్టమున్నను, నాయెడనాయువతి కిష్టముండుట లేదు. కాఁబట్టి, ఆమెకు నాయెడ నిష్టముఁ గలుగునట్లు చేయుఁడని వేడిన, మిత్రవిందేష్టి యేడుపర్యాయములు గావించిన నీయెడ నామెకు నిష్టము కలుగును. కాఁబట్టి సంభారములు తెప్పింపుమన నట్లన్నియు సమకూర్చెను. మిత్రవిందేష్టిఁ గావించి, నీభార్యనుఁ దెప్పింపుమన, రాజు బలాకరాక్షసుని స్మరింపగ వచ్చి, స్వామీ! ఏల రప్పించితిరి? కార్యమున్న నాజ్ఞాపింపుమన, పాతాళలోకమున, సాలపోతక సర్పరాజునొద్ద నాభార్య కలదు తెమ్మనినఁ గొనివచ్చి చేర్చెను. అనురాగవతియగు భార్యనుజూచి రాజు సంతసించెను. అంత రాజపత్ని రాజునుఁజూచి నాయెడఁ బ్రీతిగలదేని నేవిన్నవించు కార్యం బకీరయంబునఁ గావించి నన్ను సంతుష్టురాలనొనరింపుమని ప్రార్థింపగ నట్టికార్య మెట్టిది తెలుపుమనెను.

నాగరాజసుతయగు నందయనునది నావిషయమై తండ్రిచే మూకత్వము నొందునట్లు శపింపఁబడినది. కావున, నామెమూకత్వము పోవునట్లు చేయవలయునని విన్నవించిన నారాజపుంగవుండు సుశర్మనుగాంచి దీనికిని దగు ప్రతిక్రియఁ జేయుమన నావిప్రుండు సారస్వత సూక్తంబులజపించుచు, సారస్వతేష్టిఁ గావించినఁ బాతాళంబుననుండెడు నందయు మూకత్వమునువిడిచి మాటలాడుట కారంభించిన గర్గుండను ముని యాయువతినిఁజూచి నీచెలియగు రాజభార్య నీకు మూకత్వము పోవునటుల సారస్వతేష్టిం జేయించెనని చెప్పఁగ, నంద, మహానందమునొంది భూలోకమున కేతెంచి, రాజమందిరముఁ జేరి రాజుభార్యనుఁజూచి యాలింగనము జేసికొని రాజుంబొడఁగాంచి యోరాజవర్యా! నీకు భూమండలాధిపుఁడగు సుతుఁడుద్భవిల్లి, సర్వశాస్త్రవేదియై మనువగునని చెప్పి, రాజుభార్యంగొనియాడి పాతాళంబున కేగె. అంత రాజుభార్యనుగూడి సుఖంబుగనుండి, ప్రజాపరిపాలనము సేయుచుండఁ గొంతకాలమునకు సుతుఁడుదయించెను. ఉత్తమవంశమున జనించుటచేతను, ఉత్తమావయవములుఁ గలిగిన వాఁడగుటవలనను, ఉత్తమునికుమారుఁ డగుటవలనను, ఉత్తమమనువని చెప్పఁబడుచు అఖండభూమండలాధిపత్యమువహించి చక్కఁగ బరిపాలించెను.

యీామె నామె భర్తయింటికిఁ జేర్చు"మనగ దనుజు డామెశరీరమునందా
వహించి దుశ్శీలతను భక్షించి, సుశీలనుఁజేసి భర్తృగృహమునుఁ జేర్చి
యీావృత్తాంతము రాజునకుఁ దెలిపి యింకనేమి యాజ్ఞాపింతువనిన, నేను
తలఁచినపుడు వచ్చి,నాకార్యముల నిర్వర్తింపుచుండుమని యాజ్ఞయిచ్చి
పంపెను.

అంత నుత్తముఁడు త్రికాలజ్ఞమునీశ్వరు నాశ్రమమునకుఁ బోయి
సుశర్మభార్యావృత్తాంతమును సాంతముగ నివేదించి, తనభార్య జీవించి
యున్నదా? లేదా? యున్నచో నెచటనుండెనని ప్రార్థింపఁగ, దివ్యదృష్టిని
దెలిసికొని, పాతాళలోకమున సురక్షితముగ నున్నదనఁగ, రాజు, సవి
స్తరముగఁ దెలుపుమని ప్రార్థించె. అంతముని, యోరాజా! సాలపోత
కుఁడను, నాగరాజొకప్పుడు భూలోకమున కేతెంచి, యరణ్యమున సం
చరించుచుండ, నీభార్యను గాంచి పాతాళలోకమునకుఁ గొనిపోయె,నత
నికి, మనోరమ యను భార్యయు, నందయను కుమార్తెయుఁ గలరు.
నీభార్యను, జూచి, తనకు భార్యగానుండుమని యానాగరాజు కోరగా
నతని సుతయగు నంద, తండ్రినిజూచి యోతండ్రీ! నీవిటుల గోరుట
ధర్మముగాదు, పరకాంతాసక్తివలన గీడుమూడునని చెప్పఁగ గోపించి,
నీవు మూఁగదాన వయ్యెదనని కూతును శపించెను. మూఁగ యగునంద
నీభార్యకు సఖయై రక్షించుచుండ తత్సహాయమై యున్నదనెను.

అంత రాజు మునీంద్రా! నాకు నాభార్యయం దిష్టమున్నను, ఆ
యువతికినాయెడ నిష్టము లేకుండుటకు గారణమేమని యడుగగ,ఓరాజా!
నీవివాహకాలంబున సూర్యాంగారక శనిగ్రహంబులు నిన్నును, శుక్ర
బృహస్పతు లిరువురు నీభార్యనుం జూచిరి. మఱియు నీలగ్నమునం దం
గారకుండును, నీభార్య లగ్నమున చంద్రుఁడును, పరస్పరవీక్షణముల
తోడ నుండిరి. కావున భార్యాభర్తలకు మీాకిట్లు నై మనస్యము సంఘ
టిల్లినది. ఐనను నీపత్ని మఱల నిన్ను జేరును. ధర్మయుక్తుఁడవై రాజ్యపరి
పాలనం బొనరింపుమనిన త్రికాలజ్ఞునకు నమస్కరించి రథంబెక్కి తనపు
రంబునకుఁ బోయి సుశర్మనుగాంచెను. సుశర్మరాజునుఁజూచి, యోమహీ
పాలా! నీ యనుగ్రహమున నాభార్యనుఁ బడసితి. కర్మలఁ జక్కగ నిర్వ
ర్తించుకొనుచున్నానని చెప్పగ, రాజు, ఓవిప్రోత్తమా! నాభార్యాగృ
హంబున లేమిచే సంకటము గలుగుచున్నది. కర్మానుష్ఠానమున కనర్హాత

కర్పించిన నీకుఁ బాపములంటవు పొమ్మని సెలవిచ్చెను. అంతనుత్తముఁడు
ఓమునీంద్రా! నాకర్ఘ్య మిప్పింపకుండుటకుఁ గారణంబేమనియడుగ నో
రాజా! నీవు స్వాయంభువ వంశజనితుండవై భార్యను విడిచితివి. భార్యాహీ
నుఁడు కర్మలనాచరింప నర్హుఁడుకాఁడు. భార్య దుశ్శీలయైనను బోషింప
వలయును. పురుషధర్మంబు పత్న్యనుకూలతచేఁ గర్మలనొనరింపవలయును.
లోకమునందలి జనులను ధర్మయుక్తులుగఁ జేయునట్టి నీవే యధర్మపరుఁ
డవైతివి. భార్యావిహీనుఁడవగు నీకర్ఘ్యంబిచ్చుట యుచితము కాదనెను

అంతనుత్తముఁడు మౌని వచించిన వనమునకు వచ్చి మారేడు
పండ్లను భక్షింపుచున్న బ్రాహ్మణుడు చెప్పిన లక్షణములుగల యువతిని
జూచి, నీవీవనమున కెట్లువచ్చితివి? నీపతి సుశర్మకాఁడా? యనిన నాయు
వతి, నేనతిరాత్రుఁడను బ్రాహ్మణుని సుతను, నీచే నుడువఁబడిన బ్రాహ్మ
ణునిపత్నిని, నేనిద్రింపుచుండ, బలాకుండను రక్కసుండు నన్నిచటికి
దెచ్చి. భక్షింపకయు, భోగింపకయు దాఁచి యుంచెను. అతఁడీవనముఁ
నెచటనో తిరుగుచున్నాఁడనెను. రాక్షసుఁ డట్లుంచుటకుఁ గారణమేమని
యతఁడు విస్మయపడి దనుజుని దగ్గఱఁ జేరెను. అంత రక్కసుఁడు దూర
మునుండి రాజునుఁజూచి నమస్కారము లొనర్చి, దగ్గఱఁజేరి పలుతె
అంగులఁబొగడి నన్నను గ్రహింపుము. నేను నీబంటను, నాయర్ఘ్యమున
గైకొనుము. నీయాజ్ఞాబద్ధుండనయిన నన్నురక్షింపుమని వేఁడిన నారాజ
నందనుఁడు, అమందానంద కలితుఁడై, యోరాక్షసా! సుశర్మభార్యను
ఆహారార్థముఁ దెచ్చితివా? ఏల భక్షింపవు? కామార్థముఁ దెచ్చితివా
ఏల భోగింపవని యడిగిన? ఓరాజకుమారా! నరుల భక్షించుట లేదు
నరుల పుణ్యపాపములఁ భక్షించెదను. పుణ్యంబుహరించిన మనుజులు దు
లగుదురు. పాపముల హరించిన సుగుణులయ్యెదరు. కామమునకై యీ
వనితనుగొని రాలేదు, అప్సరసలకన్న రూపవతులగు స్త్రీలనేకులు నాకు
గలరు. మానుషీ సంబంధము నేనపేక్షింపను. అయితే సుశర్మ, యజ్ఞ
ములందు, ఋత్విజుఁడై, రక్షోఘ్నమంత్రములచే, రక్కసులగు మమ్మే
నుక్కుమాపుచుండు గాన నతని కళత్రమును హరించితినేని, కర్మలాచ
రించుట కర్హుఁడు కాఁడని తలఁచి యామెను దాఁచియుంచితి. నన్నను
దేవరవారి యానతియయ్యెనేని యామెను బ్రాహ్మణునకిత్తుననియె. అంతట
రాజు, "రక్కసా! యీబ్రాహ్మణస్త్రీకిఁ గల దుశ్శీలతను నీవు భక్షించి

యెడ నుపేక్షాభావము వహించియుండె. ఇట్లుండ నొకానొకప్పు డుత్త
ముఁడు, ఆటపాటలయందు నేర్పుగలుగు వారవనితలఁ గూడి, మధురసముఁ
గ్రోల మద్యపాత్ర మొసఁగగ, బహుళ దానిని గ్రహింపక, పలువురు రాజు
లలోను భర్తనుఁ దిరస్కరింప నతఁడు కుపితుఁడై యామెను కాననము
లలో విడువుఁడని భృత్యుల కానతిచ్చె. ఆమెయు సుఖపడితినని కాననము
లకేగె. ఇట్లుండఁ గొంతకాలమున కొకనాఁడు, సుశర్మయను బ్రాహ్మణుఁ
డు, తాను నిద్రించుతఱి తనభార్య నెవ్వఁడో యపహరించెనని, రాజుకొ
లువు సేయుచుండ నిండుసభలో జెప్పెను. మాతపంబులో ఆఱవ భాగముఁగై
కొని రాజ్యపాలనమాచరించు నో మహారాజా! నాభార్యనుఁ దెచ్చి నాకప్ప
గించుమని కోరెను. నీభార్యను నే నెఱుంగను, ఆమె యెట్లుండునని రాజు
ప్రశ్నించెను. భయంకరములగు నేత్రములు, కుఱుచ చేతులు, కృశించినము
ఖము, పరుషవాక్కులుగలది. పొట్టిది, నల్లనదియు ననియా బ్రాహ్మణుఁడు చె
ప్పెను. ఓ బ్రాహ్మణుఁడా! కురూపియు, గయ్యాళియునగు నట్టిభార్య పోయిన
దని విచారింప నేల? కులీనయు, రూపవతియు, సుశీలయునగు వేఱొక యింతినిఁ
బరిణయముకమ్మని రాజు బోధించెను. అంత సుశర్మ యోరాజా! భార్య
యెట్టిదైనను భరింపఁబడవలయు, కురూపియని విడనాడఁదగదు. పత్నీ
విహీనున కనుదినము కర్మ చెడును. భార్యను విడనాడిన నరకంబును సంక
రంబును గలుగునుగావున, నాభార్యను వెదకి నాకప్పగింపుమని ప్రార్థించె.
అంతట నుత్తముఁడు, అతిరయంబగు రథంబునెక్కి కాననముల కేగి గట్టు
లు, గుట్టలు పొదలు లోనగువానిం జూచి వెదకి యెందును నామెను
గానక యొకయెడ సుఖాసీనుఁడై తపంబొనరించెడి త్రికాలజ్ఞుఁడను మునీ
శ్వరు నాశ్రమముఁ జేరెను. మునీశ్వరుఁడు, శిష్యునిఁ బిలిచి యర్ఘ్యముఁ
దెమ్మని చెప్పుచుఁగాని, శిష్యుఁడు యర్ఘ్యము తీసికొనిరాక చక్కఁగ నాలో
చించి యాజ్ఞాపింపుఁడని పలికెనంత మునీశ్వరుఁడు, తనమనమున రాజు భా
ర్యావిహీనుఁడగుట యెఱింగి, యాతని కర్ఘ్యమిప్పింపక, యోరాజా! నీవ
చ్చిన కార్యం బేమనిన, సుశర్మయను బ్రాహ్మణుని భార్య నెవ్వఁడో హరించె
నామెను వెదకుటకిచ్చటికి వచ్చితి. ఆమె యెచ్చటనున్నది యెవ్వఁడు హరించినది
తెలుపుఁడని ప్రార్థింపఁగ మునీంద్రుఁడు దివ్యదృష్టినిఁ దెలిసికొని అద్రి
సుతుండగు బలాకుఁడను రాక్షసుఁడు సుశర్మ భార్యనెత్తుకొనిపోయెను.
ఉత్పలావతకమను వనమునఁ గాంచెదవు. ఆమెనుఁ గొనిపోయి బ్రాహ్మణుని

పుత్రా స్తస్య మనో రాసన్ విఖ్యాతా స్త్రిదశోపమాః॥
తత్సూనతి సంభవై స్సామీః పాలితా ఽభూ న్మహేశ్వరైః॥
యావన్మన్వంతరం తస్య మనోరుత్తమ తేజసః॥
చతుర్యుగానాం సంఖ్యాతా సాధికా హ్యేకసప్తతిః॥
కృతత్రేతాదిసంజ్ఞానాం యాన్యుక్తాని యుగే మయా॥
స్వతేజసా హితపసో వసిష్ఠస్య మహాత్మనః॥
తనయాశ్చాంతరే తస్మి స్సప్తసప్తర్షయో ఽభవన్॥
తృతీయ మేతత్కథితం తవ మన్వంతరం మయా॥

మార్కండేయే-౭౩-అధ్యాయే.

ఉత్తమ మన్వంతరమున — షడ్విధభుత్వాధికారములు.

౧. మనువు—ఉత్తమమనువు. ప్రియవ్రత పుత్త్రుఁడగు. (ఉత్తమునకు ప్రబహుళయందు బుట్టినవాఁడు, ఔత్తమనామము)

౨. ఇంద్రుఁడు-సుశాంతి—(సత్యజిత్ నామాంతరము.)

౩. దేవగణములు—స్వధామాఖ్యులు—ప్రథమగణము.
సత్యాఖ్యులు —ద్వితీయగణము
శివాఖ్యులు—తృతీయగణము
ప్రతర్దనాఖ్యులు—చతుర్థగణము
వశవర్తులు—పంచమగణము.
(సత్యవేదశ్రుత భద్రాదులు) నామాంతరము.

౪. ఋషులు—వసిష్ఠపుత్త్రులు. సుతేజ సుతపాదులు (సప్తర్షులు) (ప్రమదాదయః.)

౫. అవతారము—సత్యసేనాభిధము.

౬. మనుపుత్త్రులు—(పవన సృంజయ యజ్ఞహోత్రాదులు.) ఈష, ఊర్జ, భూర్జ, శుచి, శుక్ర, మధు, మాధవ, నభస్య, నభ, సహానామకులు.

## ఉత్తమమను జననము.

స్వాయంభువ వంశజుఁడగు, ఉత్తానపాదునకు సురుచియందు ఉత్తముఁడను పుత్త్రుఁడుకలిగెను. ఇతఁడు ధార్మికుఁడును, పరాక్రమవంతుఁడును, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన దక్షుఁడును, నీతికోవిదుఁడునై బభ్రుసుతయగు బహుళయను యువతిని బెండ్లియాడి, యామెయం దెక్కుడుమక్కువగలిగి యభీష్టభూషణాంబరములనొసఁగినను, అవనిత యాతని

ఈకశ్యపసంతతి స్వారోచిషమన్వంతరమునఁగలిగినట్లీ క్రిందిప్రమాణశ్లోకముచేఁ దెలియఁబడుచున్నది

శ్లో. ఏష మన్వంతరే రాజన్ సర్గ స్స్వారోచిషే స్మృతః।
తత స్త్వేకోనపంచాశ న్మరుతః కశ్యపో దితేః॥
జనయామాస ధర్మజ్ఞా న్సర్వా నమరవల్లభాన్॥

మాత్స్యే-౬-అధ్యాయే.

దితి తనపుత్త్రులగు దైత్యులు హతులయినందున,తీవ్రవ్రతానుష్ఠానముచే నేకోనపంచాశత్ (౪౯) మరుద్గణములఁగనెను. దేవేంద్రుఁడామెనుఁబ్రార్థించి మరుద్గణముల సోదరులుగఁ దలఁచి,తనకు ముఖ్యులుగఁ జేసికొనినట్లు యిదివఱలోఁ జెప్పఁబడియెను.

## ౩. ఉత్తమమన్వంతరము.

శ్లో. మన్వంతరే తృతీయేఽస్మిన్నౌత్తమస్య ప్రజాపతేః।
దేవా నింద్రానృషీన్ భూపాన్ నిబోధ గదతో మమ॥
స్వధామాన స్తథా దేవా యథానామానుకారిణః।
సత్యాఖ్యశ్చ ద్వితీయోఽన్య స్త్రిదశానాం తథాగణః॥
తృతీయేతు గణే దేవా శ్శివాఖ్యా మునిసత్తమ।
శివా స్స్వరూపత స్తేతు శ్రుతాః పాప ప్రణాశనాః॥
ప్రతర్దనాఖ్యశ్చగణో దేవానాం మునిసత్తమ।
చతుర్థ స్తస్య కథిత ఔత్తమస్యాంతరే మనోః॥
వశవర్తినః పంచమేఽపి దేవా స్తత్రగణే ద్విజ।
యథాఖ్యాతస్వరూపాస్తు సర్వఏవ మహామునే॥
ఏతే దేవగణాః పంచ స్మృతాయజ్ఞభుజ స్తథా।
మన్వంతరే మనుశ్శ్రేష్ఠే సర్వే ద్వాదశకా గణాః॥
తేషామింద్రో మహాభాగ స్త్రైలోక్యేచ గురుర్భవేత్।
శతంక్రతూనా మాహృత్య సుశాంతి ర్నామ నామతః॥
యస్యోపసర్గనాశాయ నామాక్షరవిభూషితా।
అద్యాపి మానవై ర్గాథాగీయతేతు మహీతలే॥
సుశాంతి ర్దేవరాట్కాంత స్సుశాంతిం సంప్రయచ్ఛతి।
సహితశ్శివ సత్యాద్యై స్తథైవ వశవర్తినః॥
అజః పరశుచిర్దివ్యో మహాబల పరాక్రమాః।

వాది జలపక్షులను సుగ్రీవ, మేష, ఉష్ట్ర, ఖరాది పశువులనుఁ గనెను. ఇది తామ్రవంశము.

౭. వినతయందు:—అరుణుఁడు, గరుడుఁడు అను ౨ పుత్త్రులు, సౌదామిని యను పుత్త్రికయుఁ గలిగిరి. అరుణునికి, సంపాతి, జటాయువు ౨ పుత్త్రులు సంపాతికి, బభ్రు, శీఘ్రగ, అతివిస్తృత, జటాయు, కర్ణికార, శీఘ్రగామి, సారస, రజ్జుపాల, అరుణనామక పుత్త్రులు పలువురు గలరు. వారి పుత్త్రపౌత్త్రులచేఁ బక్షిసంతతి విస్తరించెను.

౮. సురసయందు:—సహస్రసంఖ్యాక సర్పములు గలిగెను.

౭, కద్రువయందు:—సహస్ర శిరస్సులుగల, భుజగేంద్రులు సహస్ర సంఖ్య జనించెను. వారలలో ౨౬ గురు ప్రధానులు ప్రఖ్యాతి జెందినవారలు. శేష, వాసుకి, కర్కోటక, శంఖ, ఐరావత, కంబళ, ధనంజయ, మహానీల, పద్మాశ్వతర, తక్షక, ఏలాపుత్త్ర, మహాపద్మ, ధృతరాష్ట్ర, వలాహక, శంఖపాల, మహాశంఖ, పుష్పదంష్ట్ర, శుభానన, శంఖరోమ, నహుష, వామన, పాణిని, కపిల, దుర్ముఖ, పతంజలి మొదలయినవారలు. వీరలు కాద్రవేయులు కామరూపులు ఈసర్పరాజుల పుత్త్రపౌత్త్ర సంతతి, అనంత సంఖ్యయై విస్తరించెను. ఈసర్పములలో ననేక జాతులు జనమేజయ సర్పయాగమున దగ్ధములైనవి.

౮. క్రోధవశయందు:—దంష్ట్రలుగల రాక్షస గణములు లక్షసంఖ్య జనించెను. భీముఁడు వీరలనందఱ నాశముఁ జేసెను.—

౯. సురభియందు:—రుద్రగణములు, గోవులు, మహిషులు, వరాంగనలు జనించిరి.

౧౦. మునియందు:—మహాముని గణములు, అప్సరసలు జనించెను.

౧౧. అరిష్టయందు:—కిన్నర గంధర్వాదు లనేకు లుద్భవించిరి.

౧౨. ఇరయందు:—తృణవృక్షలతాగుల్మములు కలిగెను.

౧౩. విశ్వయందు:—యక్షులు, రాక్షసులు, కోట్లసంఖ్య జనించెను.

పైపదుమువ్వురు దక్షప్రజాపతి కుమార్తెలు. కశ్యపున కీయఁబడిరి. వీరలందఱు కాశ్యపదాయాదులు. సహస్రసంఖ్యలుగ విస్తరిల్లిరి.

మథనుఁడు, ఇరుఁడు గర్గతరుఁడు, విద్రావణుఁడు, ఫేనుఁడు, కేతువీర్యుఁడు, శతహ్రదుఁడు, ఇంద్రజిత్తు, సత్యజిత్తు, వజ్రనాభుఁడు, మయుఁడు, ఏకవక్త్రుఁడు, మహాబాహువు, అజాక్షుఁడు, తారకుఁడు, అసిలోముఁడు విలోముఁడు, రిపుడు, బాణుఁడు, మహాసురుఁడు, స్వర్భానువు, వృషపర్వుఁడు, మొదలగు వారు నూఱుగురు పుత్త్రులు కలిగిరి. వీరలలో విప్రచిత్తి మహాబలాఢ్యుఁడు ప్రధానుఁడు, స్వర్భానువునకు సుప్రజాకన్యయు,శచియును,మయునకు, ఉపధ, మందోదరి, కుహూయును, వృషపర్వునకు, శర్మిష్ఠ, సుందరి, చంద్రయను పుత్త్రికలు గలిగిరి.

పులోమ, కాలకయను నిరువురుస్త్రీలను మారీచుఁడు వివాహమాడెను. వారివలన ౬౦ వేలు పౌలోములు, కాలకేయులును, దానవులు జనించిరి. వీరలు మానవులవలన మృత్యువులేనట్లు, బ్రహ్మదేవుని వలన వరముబడసి, హిరణ్యపురమునందు వసించి యెల్లఱ బాధించుచుండ నర్జునుఁడు వీరినందఱిని బరిమార్చెను. విప్రచిత్తికి సింహికయందు సైంహికేయుఁడు జనించెను. దనువు వలనఁ బుట్టినందున వీరెల్లఱు దానవులయిరి.

వత్సుఁడు, శల్యుఁడు, రాజేంద్రుఁడు, బలుఁడు, వాతాపి, ఇల్వలుఁడు, నముచి, నర్జుఁడు, అశ్వాంజనుఁడు నరకుఁడు, కాలనాభుఁడు, పరమాభుఁడు, అల్పవీర్యుఁడను, నీపదుమువ్వురు హిరణ్యకశిపుని భాగినేయులు(అక్కకుమారులు)దానవవంశమునువృద్ధిఁ బొందింపఁ జేయు వారలు.

సంహ్లాదుఁడను దైత్యేంద్రునకు నివాతకవచులనుపుత్త్రులుగలిగి, దేవ గంధర్వ నాగరాక్షసులను బాధించుచుండ. రణరంగమున వీరి నందఱిని. అర్జునుఁడు హతులఁ గావించెను.

౪. తామ్రయందు:—శుకి, శ్యేని, భాసి, సుగ్రీవ గృధ్రిక, శుచియను నాలుగురు కన్యకలుకలిగిరి— శుకి చిలుకలను,గూబలను గనెను; శ్యేని. డేగలను గనెను; భాసి, గోరంకులను, గృధ్రి గ్రద్దలను, [illegible] పక్షులను శుచి,హంససారస,కారండ

## కశ్యపసంతతి.

నవబ్రహ్మలలో నొకరగు మరీచికి కలయను భార్యయందు కశ్యపుఁడు జన్మించెనని యిదివఱలోఁ జెప్పఁబడెను.

కశ్యప ప్రజాపతికి, ౧ అదితి, ౨ దితి, ౩ అరిష్ట, ౪ సురస, ౫ దను, ౬ సురభి, ౭ వినత, ౮ తామ్ర, ౯ క్రోధవశ, ౧౦ ఇర, ౧౧ కద్రు, ౧౨ విశ్వ, ౧౩ ముని, అను పదుమువ్వురు భార్యలు గలరు.

౧. అదితియందు:—ఇంద్రుఁడు, ధాత, భగుఁడు, త్వష్ట, మిత్రుఁడు, వరుణుఁడు, యముఁడు, వివస్వంతుఁడు, సవిత, పూషుఁడు, అంశుమంతుఁడు, విష్ణువు, అను నామములుగల (౧౨ గురు) ద్వాదశాదిత్యులు గలిగిరి.

వీరలు చాక్షుష మన్వంతరమున, తుషితాఖ్య దేవతలుగను వైవస్వత మన్వంతరమున, ద్వాదశాదిత్యులుగ నుండురు.—(ద్వాదశమాసాధిపు లగు సూర్యులయిరి.)

కృశాశ్వఋషి పుత్రులందఱు, శస్త్రాస్త్రాభిమానీ దేవతలు, పైనిచెప్పఁబడిన దేవగణములు ప్రతిమన్వంతరమునఁ మాఱుచుందురు. ప్రతికల్పమున బుట్టి లయించుచుందురు.

౨. దితియందు:—హిరణ్యకశిపు, హిరణ్యాక్షుఁడు అనుఇరువురుపుత్రులు. అందు హిరణ్యకశిపువునకు, ప్రహ్లాద, అనుహ్లాద, సంహ్లాద, హ్లాదులను నలువురుపుత్రులు ప్రహ్లాదునకు, ఆయుష్మంతుఁడు, శిబి, బాహులుఁడు, విరోచనుఁడను నలువురు సుతులు. విరోచనునకు, ధృతరాష్ట్ర, సూర్య, చంద్ర, దుర్యోధన, నికుంభనాభ, గుర్వక్ష, కుంభి, క్రీబ, విభీషణాదిమహాబలాఢ్యులగు నూఱుగురు పుత్రులు గలిగిరి. వీరలలో బాణుఁడు, జ్యేష్ఠుఁడు, గుణసంపన్నుఁడును, సహస్రబాహువునై, పరమశివునారాధించి, శివుఁడు తనపురమున నుండునట్లు చేసికొనియెను.

హిరణ్యాక్షునకు, దుర్ధరుఁడు, శకుని, భూతసంతాపనుఁడు, మహానాభుఁడను వారలు. వీరి పుత్రపౌత్ర సంతతి ౭౭ కోట్లు, మహాబలులు, మహాకాయులు, నానారూపములఁ బ్రకాశించువారలు. దితిసంతతికి దైత్యులని పేరుకలిగెను.

౩. దనువందు:—విప్రచిత్తి, ద్విమూర్ధుఁడు, శకుని, శంబరుఁడు, మరీచి,

ద్వితీయుఁడగు స్వారోచిషమనువు, వహ్నిపుత్త్రుఁడు. స్వాయంభువు మనువునలె ధర్మాత్ముఁడు, ఔదార్యవంతుఁడు. సంపన్నుఁడు. పైనిచెప్పఁబడిన షడ్విధ ప్రభుత్వాధికారులు, వారి యధికారమునకుఁదగినకార్యములు నిర్వర్తింతురని, స్వాయంభువ మన్వంతర సందర్భమునఁ జెప్పఁబడియె.

కలినామక గంధర్వుఁడు, కపట ప్రవర వేషమునుధరించి వరూధినిని వంచించి రమింపగ, బాలసూర్య కిరణములఁబోలు, తనకాంతులచేఁ బ్రకాశించుచు జనించినందున, స్వరుచియని నామంబుకలిగె. స్వరుచి, సకలవిద్యాపారంగతుఁడై శస్త్రాస్త్రకోవిదుఁడై, మనోరమ విభావరీ, కలావతులను మువ్వుర నారీమణులఁ బరిణయమయ్యెను.అందు కలావతి శంభుపత్నియగు సతిదేవిచేఁ బద్మినీ నామకవిద్యను గ్రహించి, భర్తకుపదేశింపఁ దన్మూలమున నవనిధులు స్వాధీనమయ్యె. మనోరమ, సకలాస్త్రరహస్యమును నాధునకొసంగి రక్షోబాధనుండి తొలఁగి స్వస్థయయ్యె. మనోరమవలన విజయుని, విభావరివలన మేరునందనుని, కలావతివలన ప్రభానుని నీముగ్గురుపుత్త్రుల స్వరుచి కాంచెను. ప్రాగ్దిశయందు, కామరూపపర్వతమున విజయమనుపురమును నిర్మించి విజయునికిని, ఉత్తరదిక్కున నందనతీ పురమును నిర్మించి, మేరునందనునికిని, దక్షిణదిక్కున తాళపురమును నిర్మించి ప్రభానునకు నొసంగెను.

ఒకానొకనాఁడు, స్వరుచి యరణ్యమున వేటాడుచుండ హరిణాంగన, తనమీఁద బాణము వేయుమనియు, తాను స్వరుచిని ప్రేమించినట్లును, భావమునుఁ దెలిపెను. నీవు మృగజాతివి, నేను మనుష్యజాతుఁడను, మనకెట్లు సమావేశ మేర్పడునని, స్వరుచి యడుగగ, నీభావము నాయెడ నక్తమయ్యెనేని యాలింగనముఁ గావింపుమని ప్రార్థించె. అట్లాలింగనము గావించినంతట దివ్యాంగనయై యెదుటనిలువ, విస్మయాన్వితుఁడై, నీవెవరు, ఇట్లు రాఁగారణమేమనియడుగగా, లజ్జావనతముఖియై నేను వనదేవతను, దేవతలచేఁ బ్రార్థితనై, నీయొద్ద కేతెంచితి. అగ్నితుల్యుఁడును, భూపరిపాలకుఁడునగు, మనువు జన్మింపఁబోవు నను గ్రహింపుమని వేఁడగ, నావనదేవతయందు సర్వలక్షణ లక్షితుఁడగు స్వారోచిషమనువు జనించెను. దేవతలు హర్షధ్వనులును, గంధర్వులు గానమును, అప్సరోగణములు నాట్యమును గావించిరి.



## ౨. స్వారోచిష మన్వంతరము.

శ్లో. తత స్స్వారోచిషం నామ్నా ద్యుతిమంతం ప్రజాపతిం।
మనుం చకార భగవాం స్తస్య మన్వంతరం శృణు॥
తత్రాంతరేతు యే దేవా మునయ స్తత్సుతాశ్చయే।
భూపాలాః క్రోష్టుకే యే తాన్ గదత స్త్వం నిశామయ॥
దేవాః పారావతా స్తత్ర తథైవ తుషితాద్విజ।
స్వారోచిషేఽ న్తరే చేంద్రో విపశ్చి దితి విశ్రుతః॥
ఊర్జ స్తంబ స్తథాప్రాణో దత్తోళి ఋషభ స్తథా।
నిస్వర శ్చార్వరీవాంశ్చ తత్ర సప్తర్షయో ఽభవన్॥
చైత్ర కింపురుషాద్యాశ్చ సుతా స్తస్య మహాత్మనః।
సప్తాఽసన్ సుమహావీర్యాః పృథివీపరిపాలకాః।
తస్య మన్వంతరం యావత్తావ త్తద్వంశ విస్తరే।
భుక్తేయ మవనిస్సర్వా ద్వితీయం వై తదంతరమ్।
స్వారోచిష స్తు చరితం జన్మస్వారోచిషస్యచ।
నిశమ్యముచ్యతే పాపై శ్శ్రద్ధధానో హిమానవః॥

మార్కండేయే ౬౨ అధ్యాయే.

### స్వారోచిష మన్వంతరమున షడ్విధ ప్రభుత్వాధికారములు.

౧. మనువు—స్వారోచిషమనువు, స్వరోచికి వనదేవతయందుఁ బుట్టినవాఁడు. (వహ్నినందనుఁడు.)

౨. ఇంద్రుఁడు—విపశ్చితుఁడు, (రోచననామాంతరము.)

౩. దేవగణములు—తుషితాదులు-పారావతులు.

౪. ఋషులు—ఊర్జ, స్తంభ, దత్తోళి, ప్రాణ, ఋషభ, నీవార, (నిస్వర) అరివంత (అర్వరీవంత) నామకులు.

౫. అవతారము—విభువు,

౬. మనుపుత్త్రులు—చైత్ర కింపురుషాదులు ౭ గురు (నభ, నభస్య, ప్రసృతి, భావన ౪ గురు) (ద్యుమ త్సేనరోచిష్మ(త్ప్ర)భృతులు)

శ్లో॥ స్వారోచిషో మనుశ్చైవ ద్వితీయో వహ్నినందనః।
రాజావదాన్యో ధర్మిష్ఠో స్వాయంభువసమో మహాన్॥

| | | |
|---|---|---|
| . తామసమన్వంతరము | త్రిశిఖ | (శిబి) |
| . రైవతమన్వంతరము | విభు | |
| . చాక్షుషమన్వంతరము | మనోజవ | (మందద్రుమ) |
| . వైవస్వతమన్వంతరము | ఊర్జస్వి | (పురందర) |
| ౯. సూర్యసావర్ణిమన్వంతరము | బలి | (వైరోచని) |
| ౯. దక్షసావర్ణిమన్వంతరము | అద్భుత | (కార్తికేయ) |
| ౧౦. బ్రహ్మసావర్ణిమన్వంతరము | శాంతి | (శంభుత్రిదివ) |
| ౧౧. ధర్మసావర్ణిమన్వంతరము | వృష | (వైధృత) |
| ౧౨. రుద్రసావర్ణిమన్వంతరము ఋతధామ | | |
| ౧౩. దేవతసావర్ణి లేక భౌచ్య లేక రౌచ్యమన్వంతరము | దివస్పతి | (బృహస్పతి) |
| ౧౪. ఇంద్రసావర్ణి లేక భౌత్య మన్వంతరము | | శుచి |

పదునాలుగు మన్వంతరములందలి, భూతభవిష్యత్కాలీన నియమిత ఇంద్రనామకులు చెప్పఁబడిరి. వీరల కొకానొకప్పుడు బ్రహ్మహత్యాది దోషములచేఁ బదభ్రంశముఁ గలిగినపుడు ఏకోనశతక్రతువులు జేసినవారిలో జ్యేష్ఠుఁడు. శ్రేష్ఠుఁడు, తాత్కాలికముగ నింద్రపదవి నధిష్ఠించి దేవగణములతోఁ గూడిపాలించును. అసురపక్షమునకు బలము గలిగినపుడు వారిలోని నాయకుఁడు తాత్కాలికేంద్రు నభిభవించి, త్రైలోక్య సామ్రాజ్యము నధివసించు, అతనికధర్మము ప్రబలమై దురాచారములు గలిగెనేని ఐంద్రలక్ష్మితొలఁగి దేవతలనాశ్రయించును ఇట్లు పర్యాయముగ నింద్రపదవి యొక్కొక్కకాలమున నొక్కొక్కనిఁ జెందుచుండును.

ఇట్లు ఇంద్రునధికారమును, అర్హతయును, లక్షణములును వివరముగఁ దెలుపఁబడియె. ముస్ముందు, అగ్ని, మారుత వరుణాదిలోకపాలకులయు, నితరదేవతలయు నధికారమును, లక్షణములను, నియమితకాలమును, ఆయాస్థలములయందు విశదీకరింపఁబడును.

పర్యాయేణతు సంప్రాప్తే త్రైలోక్యం పాకశాసనే।
తతోఽసురా స్పరిత్యజ్య శుక్రో దేవా నగచ్ఛత॥

మత్స్యపురాణే ४७ అధ్యాయే.

కాలవశమున నేపక్షమునకు బలముగలుగునో, తత్పక్షీయనాయకులు ప్రభుత్వమును నడపుచుండుట, ప్రకృత రాజ్యాంగమునఁ గనపడు నట్లుల, అసురపక్షమునకు బలము గలిగినపుడు, వారలలో నాయకులగు హిరణ్యకశిపువు, బలి, ప్రహ్లాదుఁ డనేక వేల సంవత్సరములు త్రైలోక్య సామ్రాజ్యము ననుభవించుచు నింద్రులుగ నుండిరి. బలిచక్రవర్తి రాజ్యాధికారమున నుండునంత వఱకు ప్రహ్లాదుఁ డసురులతోఁ గూడి శాంతముగ నుండును. త్రైలోక్యరాజ్యము దైత్యులవశములో నుండునపుడు పది మహాయుగములు, సంక్షోభకరముగ నుండు, చక్రవర్తి ధార్మికుఁడైనను, తదను యాయులగు నసురులు తమ దుష్ప్రవర్తనముచే లోకములఁ బీడింతురు. బలిచక్రవర్తికిఁ బిమ్మట, ప్రహ్లాదుఁడు కొన్నివేల సంవత్సరము లింద్రుఁడుగ నుండి పాలించును ప్రహ్లాదుని నుండి దేవేంద్రుఁడు యుక్తిచే త్రైలోక్య సామ్రాజ్యము నపహరించును. ఇట్లు కొంతకాలము దేవతలలో నాయకులగు వారింద్రులుగను, పిమ్మట కొంత కాలము, అసురులలో నాయకులగు వారింద్రులుగ నుండి పరిపాలింతురు. వారు వారివారి ధర్మములను శాసనములఁ జేసి, యాజ్ఞల నిర్వహింతురు.

## చతుర్దశమన్వంతరములనుండు ఇంద్రులు.

శ్లో॥ ఇంద్రశ్చ విశ్వభుక్ జ్ఞేయో విపశ్చిత్త దనంతరమ్।
విభుః ప్రభుశ్శిఖిశ్చైవ తథైవచ మనోజవః॥
తేజస్వీ సాం ప్రతస్త్వింద్రో బలిర్భావ్య స్త్వనంతరమ్।
అద్భుతస్త్రిదివశ్చైవ దశమస్త్వింద్ర ఉచ్యతే॥
సుశాంతిశ్చ సుకీర్తిశ్చ ఋతధామా దివస్పతిః।
ఇతి భూతా భవిష్యాశ్చ ఇంద్రాజ్ఞేయాశ్చతుర్దశ।

దేవీపురాణే- కాలవ్యవస్థాధ్యాయే

| మన్వంతరము లు. | ఇంద్రనామములు. | నామాంతరము. |
|---|---|---|
| ౧. స్వాయంభువమన్వంతరము | విశ్వభుక్కు | (యజ్ఞనామకః) |
| ౨ స్వారోచిషమన్వంతరము | విపశ్చిత్తు | (రోచననామకః) |
| 3. ఉత్తమమన్వంతరము | సుశాంతి | (సత్యజిత్) |

నూర్వశితోడఁ గూడదని చెప్పెను. కాఁబట్టి దేవలోక దివ్యాంగనల చట్ట మర్జునునియెడ వర్తింపదని ఖండితముగఁ జెప్పెను?

పర్వతుఁడు:—మనుష్య శరీరము గలవాఁడైనను, దేవతల యనుగ్రహముచే, దివ్యాంశాణువులు లేక, స్వర్గలోకమునఁ బ్రవేశింపఁ జాలఁడు. ఎవ్వఁడేని యీస్వర్గలోక పుటావరణములో నుండువఱకు, దేవలోక సంబంధ దివ్యాంగనల శాపము (చట్టము) శాసనరూపముగ ననువర్తింపఁగలదని నారదుని వాదమును ఖండించెను

ఇట్లు వాదప్రతి వాదములు జరుగుచుండగా, దేవలోకముననుండు వారెల్లను, సభాధ్యక్షుఁడగు నింద్రునకు నూర్వశి ప్రియురాలు, అర్జునుఁడు ప్రియపుత్రుఁడు, ఎవరియెడ ననుకూలముగఁ దీర్మానించినను, అప్రీతికలుగును ఇట్టి క్లిష్టపరిస్థితిలో నెట్లు తీర్మానించునని నిరీక్షించుచుండగ, నింద్రుఁడు ఏమియుం దోఁచనివాఁడై, మంత్రియగు బృహస్పతితో నాలోచించెను. ఓయింద్రా! ఇయ్యది విషమపరిస్థితి యెవరికి నప్రియముఁ గావింపఁ గూడదు. కావించినచో శాశ్వతాపకీర్తి నీకుఁ గల్గును. దేవలోక, అప్సరస్త్రీ మర్యాదలగాపాడవలయు, గౌరవపురస్సరముగ బిలువనంపిన, నరాంశభవుండగు నర్జునినిఁ గాపాడి గౌరవింపవలయు. కాఁబట్టి నేనుభయులకు సమాధానముఁ గావించెదను. ఊర్వశి నపుంసకుండవు కమ్మని శపించెను గాని కాలపరిమితి నియమింపలేదు. అర్జునుఁడు మున్ముందు అజ్ఞాతవాసమున నొకవత్సర కాలమేదో నొక వేషమునుధరింపవలయును, ఆ కాలమున నీషండరూప రూపమునుధరించి స్త్రీలమధ్య చరించినవాఁడై విరాటరాజపుత్రికయగు ఉత్తరకు నాట్యము, గానము, వాద్యము, నేర్పించును.

ఈనపుంసకరూపమగు శాపము, అతని కాలమున నుపకారముగ నియపకారము గానేరదు. ఈశాప మర్జునునికి లోఁబడి యతఁడెప్పుడు కావలెనని కోరునో అప్పుడతని నావేశించి యొకవత్సరకాలముండి వదలిపోవును. ఇది యుభయులకు సమ్మతముగానుండుటయే గాక, దేవలోకసభ్యులు, నారద పర్వతాదిమునీశ్వరులెల్లను హర్షింతురు. నీకుఁ గీర్తి కలుగునని చెప్పగా నింద్రుఁడు హర్షోత్ఫుల్ల మనస్కుఁడై నమస్కరించి వాచస్పతి మంత్రియనునామములు నీయెడ నన్వర్థాభిధానములు ఈవిషమస్థితి నుండి నన్నును, దేవతలను రక్షించితివని వేవిధములఁ బొగడెను.

ఇయ్యది భావమును గుర్తెఱుంగమిచేఁ గలిగినది. ఇందుభయుల దోషము లేదని నుడివెను సభాధ్యక్షుఁ డర్జునునిఁ జూచి యేలనవ్విత్రివని యడుగగా?

ఈయూర్వశి మావంశమూలపురుషుఁడగు పురూరవశ్చక్రవర్తికిఁ బ్రేయసిగనుండి పలువురకుమారులం బడసినది వంశవర్ధని మాయవ్వయని యాశ్చర్యపడి నవ్వితిని. అట్టి మాయవ్వ నాట్యకళాప్రవీణయై యెల్లఱ రంజింపఁజేసినదని యాదేకదృష్టి గలవాఁడనై చూచితిగాని, వేఱొండుభావము లేదు. గాంధారి-కుంతి-శచీ దేవులయెడ నెట్టిభావమో యట్టి పూజ్యభావమే నాకీమెయందు గలదని నుడివెను.

పర్వతుఁడు:—భూలోకముననున్న మానవులకు (దత్తత్కర్మానుబంధ వాసనలచేతను, ఉపాధులచేతను, తండ్రి, కుమారుఁడు, తల్లి, చెల్లెలు, కూతురు, అవ్వ లోనగు వావి వరుస, మర్యాదలుండునుగాని, మనుష్య దేహమును విడిచి, దివ్యశరీరములను బొందిన జీవులకు, స్వర్గలోకమున భోగానుభవము గాని వావివరుసలుండవు. జీవులకు, కులగోత్రసూత్ర జాత్యాదిభేదములు లేవు. ఉపాధులవలన గలుగును. అదియునుంగాక పురూరవశ్చక్రవర్తి పుత్రులు. పౌత్రులు, ప్రపౌత్రులు, క్రతువుల నొనరించి, తత్తత్పుణ్య ఫలానుగుణ్య భోగముల నప్సరస్త్రీలతోఁడ ననుభవించుచున్నప్పుడు, భూలోకసంబంధముగ వావివరుస లుండవు. పుణ్యఫలము ననుభవింపదగు. నీస్వర్గలోకమునందు భోగానుభవము ప్రధానము. అప్సరస్త్రీలు తాము వరించిన పురుషులఁగూడ ననువర్తింప స్వర్గలోకమున హక్కుగలదు. తమ యభీష్టమును స్వర్గపతిచేసినవారల శపింతురు. శాపానుగ్రహశక్తి దేవలోకమునఁ గలదు కాఁబట్టి తన యభీష్టము నెఱవేర్పక యవమానము ననాదరము నొనరించిన యర్జునునియెడ, నూర్వశి శాపముచెల్లి తీరవలయును. అట్టి శాపమే చెల్లనిచో దేవజాతికి గౌరవభంగము కలుగును. అప్సరస్త్రీల ప్రతిష్ఠ చెడిపోవును. కాఁబట్టి, దేవలోకజాతి మర్యాద ననుసరించి శాపము చెల్లి తీరవలయునని వాదించెను.

నారదుఁడు:—ఓ సభాధ్యక్షా! పర్వతముని, మనుష్య దేహమును విడిచి, దివ్యశరీరములను బొందిన జీవులకు, స్వర్గలోకమున వావివరుస మర్యాదలుండవని ప్రతిపాదించెనుగదా? ఆవాదమే మాకనుకూలము. ఏలయన? అర్జునుఁడు, మనుష్యశరీరము, తదభిమాన వాసనలతో నిచటనుండెనుగనుక, భూలోకమున, మనుష్యశరీరమునకుఁ గల వావివరుసలతో

ధారి, కుంతి, మాద్రీ దేవులతో సమానురాలవు! పూజ్యురాలవు! నీయెడ నాకు వేఱు భావము లేదు మన్నింపుమని ప్రార్థింపఁగ, నవమానితయై రోషముబట్టఁజాలక శపించెనని పర్వతముని శాపకారణముల వివరించెను. సభాధ్యక్షుఁడగు నింద్రుఁడు ఓనారదమునీంద్రా! అప్సరోభూషణమగు నూర్వశిని గృహమునకుఁ బిలువనంపి యవమానింపఁదగునా? రాజర్షుల కును దుష్ప్రాపియగు నూర్వశి నవమానింప నామె శపింపదా? శాపమేల చెల్లగూడదు విశదీకరింపుమనియెను.

నారదుఁడు:-అర్జునుఁడు త్రికరణశుద్ధిగా నూర్వశిని ప్రేమింపలేదు. తన కూర్వశిని ఘటింపఁజేయుమని చిత్రసేను నామెయింటికిఁ బంపలేదు. భూలోకమున నరణ్యావాసము చేయుచుఁ దపోనియమములతోఁ గాల ముపుచ్చుచుండ దేవతలు, రాక్షసులవలన బాధలుపోఁగొట్ట నతనిని బిలుచుకొనివచ్చిరి. తండ్రికిఁ బ్రియురాలన, తల్లితోసమానముగదా? ధర్మజ్ఞుఁడగు పురుషుఁ డధర్మవర్తనమునకెట్లు సమ్మతించును? కాఁబట్టి యధర్మప్రవర్తకురాలగు నూర్వశికి ధర్మమునుబోధించి తన సత్యధర్మ ప్రవర్తనమును, చిత్తస్థైర్యమును తెలుపుటకాని యవమానించుట కాదు. కాఁబట్టి శాప మక్రమము. చెల్లఁగూడదు.

పర్వతుఁడు:-దుష్కరమగు తపస్సొనరించిన రాజర్షులును తనగృహ మునకుఁ జనుదెంచినను బలుకనిమానవతి, చిత్రసేనుని మాటలనాదరించి, యర్జునుని గృహమునకుఁబోవ ననాదరముఁ గావింపనెట్లుండు.

"శ్లో. మానోహిమహతాం ధనమ్" గొప్పవారికి సన్మానమేగదా ధనము, మానముపోయినతర్వాత ప్రాణముండి ప్రయోజనమేమి? అల్పు నేని యవమానింపఁ గూడదుకదా? అట్టి స్థితిలో, జగదేకసుందరియు, నాట్యకళాప్రవీణయు దేవగంధర్వ కింపురుషాదులచే మాననీయయునగు నామెను గృహమునకుఁ బిలువనంపి యవమానించుట యెట్లుండునో? మానవంతులగు సభాధ్యక్షులే గ్రహింతురుగాత. సభాధ్యక్షుఁడు చిత్ర సేనునిఁబిలిచి యథార్థమునడుగగా ఆర్య! దేవరవారు కొలువుఁదీరి యప్సర సలచే నాట్యమాడించునపుడు, ఊర్వశియొక్క నాట్యకళాప్రవీణతను, అర్జునుఁడు తదేకదృష్టినిఁ జూచుచు స్మేరాననుఁడగుటవలన నూర్వశియెడ లగ్నమనస్కుఁడయ్యెనేమో యని యూహించి, యర్జునునికి మనఃప్రీతి గలిగింప నూర్వశిగృహమునకు నేనే చనుదెంచితి అర్జునుఁడు పంపలేదు,

సంబున వేఱుభావము లేదు. కుంతీ, మాద్రీ, శచీదేవులతో సమానురాల వు. పూజ్యురాలవు నన్ను మన్నింపుమని, పాదములకు నమస్కృతిగావిం పఁబోవు నర్జునునిఁజూచి, యూర్వశి విఫలమనోరథ యగుటచేఁ గోపము బట్టఁజాలక యొడలువడఁకుచుఁ బెదవుల దేమ లేక చిడిముడిపాటుతో నో యర్జునా! చిత్రసేనునిచేఁ బ్రార్థితయై, యింద్రునిచే నాజ్ఞప్తయైయెంత యుఁ గుతూహలముతో నీయొద్దకువచ్చిన యప్సరోవతంసమగు నన్ను నిరాకరించి విఫలమనోరథఁ గావించితివి కాఁబట్టి, మానహీనుఁడవై స్త్రీ బృందమధ్యమున నాట్యమునలుపుచు నపుంసకుఁడవై వర్తింపుమాయని శపించి వికల మనస్కయై యూర్వశి స్వభవమునకుఁ జనియెను. అంతట నర్జునుఁడు రేయిజరిగిన వృత్తాంతమంతయు చిత్రసేనునకు నివేదించెను.

భూలోకములో రాజకీయశాసనసభలలో వివిధకక్షులు ద్వేష్య పక్షము లుండినటుల దేవేంద్రసభలోను, ద్వేష్యపక్షములుఁగలవు. నార దమహాముని పక్షముననుండు మునులు దేవతలు ఊర్వశి ప్రక్కనువాదిం పఁబూనుకొనిరి. దేవేంద్రుఁడు దేవర్షి సిద్ధసాధ్య వసురుద్రాదిత్యాది గణ ములచేఁ బరివేష్టితుఁడై నిండుకొలువుండ నారదమహాముని సభామధ్య మున లేచి ఓపురందరా! సభ్యులారా! భూలోకమునుండి యర్జునుని బహుమానపురస్సరముగ నిచటికిఁ గొనివచ్చి యతనివలన మహోప కారములఁబొంది, గౌరవించి సంపుటకుబదులు, ఊర్వశీదత్త దుర్భరషండ త్వమునొసంగి పంపుట మీకుఁగాని మీసభ్యులకుఁగాని ధర్మమా? గౌరవ మా? యీవార్తనుభూలోకవాసులు విని మనల బరిహసింపరా? కాబట్టి, అక్రమమైన యీశాపమునుఁ బోఁగొట్టి నష్టపరిహారమునిప్పించి యర్జును నిగౌరవింపవలయునని ధర్మసమ్మతముగ వాదించెను.

సుధర్మా సభాధ్యక్షుఁడగు నింద్రుఁడు, ఊర్వశీపక్షవాదియగు పర్వ తమునింగాంచి, యక్రమముగ నేలశాపమొసంగెను? త్రిలోకమాన్యుని శపింపసగునా? శపింపవలసిన కారణమేమి కలిగెనని యడుగగా, రూప సౌందర్యగర్వితయు నప్సరోవతంసమగు నూర్వశిభవనమునకుఁ జిత్రసేనుఁ డేతెంచి, యర్జునుఁడు శౌర్యతేజోవిరాజితుఁడు సురమాననీయుఁడు కాఁబట్టి కిరీటి నభినందింపఁ జేయుమన నిది దేవకార్యమనియుఁ, నాట్యగాన కళావిశారదుఁడగు చిత్రసేనుఁడు బ్రతిమలాడెననియుఁ దలఁచి సర్వాలం కార భూషితయై యర్జునునిభవనమునకుఁ జన నోనారీమణీ! నీవు గార్

అంతట నూర్వశి ఓచిత్రసేనా! మిత్రుఁడవగు నీవు పార్థుని వర్ణించిచెప్పుట చేతను, ప్రభువగునింద్రుఁ డాజ్ఞాపించి సందేశమంపుటచేతను, సహజముగ నర్జునుని పరాక్రమగుణరూప సంపత్తిఁ జూచుటచేతను, మీయాజ్ఞ శిరసా వహించి యర్జునుని మనస్సు నానందింపఁజేసెద నని యాతనిఁబంపెను. తపస్సంపన్నులగు రాజర్షులకును నలభ్యయై, రూపగర్వితయై యింద్ర ప్రేయసియై యొప్పు నూర్వశి, సర్వాలంకారభూషితయై యర్జును నే కాంతశయ్యామందిరమునకుఁ జని నిలువఁబడఁ బార్థుఁడు లేచి, యామెను సత్కరించి, యోనారీమణీ! నీవిచ్చటకు రాఁగతంబేమి? సెలవీయుమని సప్రశ్రయముగ నుడువ, నోరాజకుమార! మారసుకుమారాకారుఁడ వగు నీయెడ నామనంబు లగ్నమై బాధించుచున్నది. పంచబాణానలార్త యగు నన్ను సముద్ధరింపుము, ఆర్తులఁబ్రోవ బద్ధకంకణుఁడవగు నీవు విర హాగ్నితప్తయగు నన్ను పేక్షింప న్యాయముకాదని తనయనురాగము నివే దింప, నోసుదతీతిలకమా! కుంతి, మాద్రి, శచిదేవి, వీరలెట్లు పూజ్యు లో నీవు నాకట్లుపూజ్యురాలవు. పుత్రతుల్యుఁడగు నాయెడ వేఱుతలం పువలదని బ్రతిమలాడెను. నేను నాట్యమాడుచుండ బాటపాడుచుండ నేకాగ్రదృష్టితో నన్నుఁ జూడలేదాయని యూర్వశియడుగ, నీవెయే కదా పౌరవవంశమునకు బ్రధానభూతురాలు ఈమెయేకదావంశవర్ధనియగు మాయవ్వయని యత్యంత కుతూహలముతో నిర్నిమేషముగఁ జూచితిఁ గాని, యనురాగ బద్ధుఁడనై చూడలేదు. సత్యము పలుకుచున్నాఁడ నని యర్జునుఁడునుడివెను. ఇంద్రాభినందన, యోయర్జునా! నన్నుఁ బూజ్య స్థానమందుంచవలవదు. పౌరవవంశమునఁ బుట్టిన రాజకుమారులు, పుత్త్రు లు, పౌత్త్రులు, మునిమనుమలు, పుణ్యతపఃఫలంబుచే స్వర్గలోకమునకు వచ్చి మమ్ముల రమించెదరు. ఇయ్యవి పుణ్యఫలమునకు భోగభూములు ఇచ్చట వావివరుసలుండవు. భూలోకమునందువలెను వావివరుసలుండు ను. మేమప్సరసలము, తపోభంగముఁగావించి, పలువురు రాజర్షులను వశ్యులఁగావించుకొనియెదము. మాయనుగ్రహమునకై యనేకులు తప స్సొనరించియుఁ బడయఁజాలకుందురు. ఇట్లనన్యలభ్యనై, రూపసౌందర్య గర్వితయగు, నేనువచ్చి నిన్నుఁబ్రార్థింప నిట్లు నిరాకరింపఁగూడదు. నన్ను స్వీకరింపుమని పలువిధముల వేఁడు నూర్వశినిఁజూచి యోవనితాతిలక మా! సర్వదేవతాసాక్ష్యముగఁ బ్రమాణము సేయుచున్నాఁడను, నామ

## అర్జునుఁ డింద్రలోకమున కేగుట.

అరణ్యవాసకాలమున నర్జునుఁడు కిరాతరూపియగు మహాదేవునితో యుద్ధముచేసి, సంతుష్టుఁడగు నాపరమేశ్వరునివలన వరములను దివ్యాస్త్రమునుఁ బడయుటఁగని, ఇంద్రుఁడు లోకపాలకులతోడ నచటికివిచ్చేసి యర్జునుని నభినందించి, ఓపార్థా! నాపురంబునకు రమ్ము! సారథియగు మాతలితోడ దివ్యరథము బంపెద. మున్ముందు నీవు చేయఁబోవు మహోద్యమమునకు దివ్యాస్త్రములనొసంగెద. దేవతానుగ్రహముఁ బొందవలయుననిచెప్పి యంతర్హితుండయ్యె. మందరపర్వతమున వసించుచున్న యర్జునునొద్దకు మాతలి దివ్యరథమునుఁ గొనివచ్చి యారోహింపుము. పాకశాసనుండు సగౌరవంబుగ నిన్నాహ్వానించెనని చెప్పఁగ నచ్చటి వనదేవతలకు బర్వతరాజమునకు నమస్కరించి దివ్యరథమునెక్కి యెడనెడఁ గలుగు పుణ్యలోకముల పుణ్యపురుషుల, సిద్ధచారణ గంధర్వాదులఁగాంచుచు స్వర్గపట్టణమునకు జనుదెంచినంతట దేవేంద్రునాజ్ఞచే దేవర్షివసు గంధర్వాదు లభ్యుత్థాన మొనరించి, స్వాగతమొసంగి సుధర్మ (ఇంద్రునాస్థానము) సభలోఁ బ్రవేశ మొనరింపఁ శక్రుఁ డర్జును నాలింగనముచేసి, తన యర్ధసింహాసన మొసంగి గౌరవించెను. ఇట్లు అయిదువత్సరములు మహావైభవమున నచ్చటనుండె. ఈయైదు సంవత్సరములలోపల చిత్రసేనునియొద్ద నృత్తగీతవాద్యముల నేర్చుకొనెను. ఒకనాడు దేవేంద్రుఁడు వసురుద్రాదిత్యులతోడను, సిద్ధచారణగంధర్వులతోడను, మహర్షిముని లోకపాలకులతోడను, నిండుకొలువుండి యప్సరస్త్రీలను దమనృత్తగీతవాద్య ప్రావీణ్యముఁ జూపునట్లాజ్ఞాపించగ నప్సరలలో నెల్లరూపవతియు విద్యావతియునగు, నూర్వశి తన నృత్తగీత వాద్యవైభవముచే నెల్లఱవిస్మితులఁ గావించెను. అప్పుడర్జునుఁడు నిర్నిమేషదృష్టితో నూర్వశినిగాంచుచుండుట నింద్రుఁడు విలోకించి యర్జునుని మనస్సు ఊర్వశియెడఁగలదని భావించి, యప్సరసలకు నాట్యాచార్యుండగు చిత్రసేనునేకాంతముగఁబిలిచి యర్జునుని మనంబు ఊర్వశియెడ నున్నట్టుల భావించెద. నతని మనస్సంతుష్టిఁగావించి పంపించు బాధ్యత మనయందుఁగలదు. కావున నూర్వశి యొద్దకుఁబోయి పార్థునిసుగుణరూప సౌందర్యాదులవర్ణించి, యతని నభినందింపఁ జేయ నేను చెప్పినట్లుచెప్పుమని పంపగ నతఁడూర్వశి యొద్దకుఁ బోయి యామెచే సత్కృతుండై, యింద్రుఁడు చెప్పినదంతయు నివేదించెను.

మున నీరాజును వహింపగ నతఁడు కకుత్స్థుఁడై దానవులసంహరించె. నాటంగోలె పురంజయుండు కకుత్స్థుఁడనంబరగె. ఇట్లు అజుఁడు దిలీపుఁడు రఘువు, దశరథుఁడు లోనగు మహావీరులు రాక్షసవధమునుఁ గావించి యింద్రునిమెప్పుఁ బడయుచుండిరి.

### శ్రీకృష్ణకృత, శక్రగర్వభంగము, ఇంద్రయాగము.

గోపకులు వర్షములు చక్కఁగఁగురిసి పంటలుపండినందుననింద్రోత్సవము సేయుచుండెడివారు. ఇంద్రునేల పూజింపవలెను? గోవులను, విప్రులను, పర్వతములను సత్కరింపుడని శ్రీకృష్ణుఁడు చెప్పి గోపకులచే నింద్రోత్సవము చేయుట మాన్పించెను. ఇంద్రుఁడు కుపితుఁడై, గోవుల మీఁదను గోపాలకుల మీఁదను, ఝంఝామారుత యుక్తపాషాణ వర్షము కురిపించెను. శ్రీకృష్ణభగవానుఁడు గోవర్ధన పర్వతమెత్తి గోగోపాలకులను జేర్చి, వారిపై రాళ్లుపడకుండఁ గాపాడెను. ఇంద్రుఁడు లజ్జితుఁడై శ్రీకృష్ణభగవానుని సందర్శించి భూభార నిగ్రహణార్థ మవతరించిన పరమపురుషుఁడవు. మేమందఱము నీయంశులము, నీమాహాత్మ్యము దెలియకుంటి. నాతప్పుమన్నింపుమని స్తోత్రముఁ గావించి గోవులకింద్రుఁడవని, యైరావత కరోత్క్షిప్త జలములచే నభిషేకించి. గోగోపాల బృందములకు నిరంతర సౌఖ్యముల నొనరించె. లోకంబుల నెవ్వఁడేని తనకు మించినవాఁడు లేఁడని గర్వింపఁగూడదు సర్వభూతాంతర్యామి, పరమేశ్వరుఁడు, జగన్నియంత యొకఁడు కలఁడని తెలుపుటకై యిట్లు గావించితినని శ్రీకృష్ణపరమాత్మ నుడివి యింద్రుని సంతృప్తిపఱచి నిజనివాసమునకుఁ బనిచెను.

శ్రీరామచంద్రుఁ డరణ్యావాసము సేయునపు డింద్రుఁడు, శరభంగాశ్రమసమీపమునకే తెంచియు, శ్రీరామచంద్రునిసందర్శింప నిది సమయముకాదు. రావణవధానసందర్భమున సందర్శింపఁదగునని తలఁచి, యుద్ధసమయమున, తనరథమును, సారథియగు మాతలితోడనంపి శ్రీరామచంద్రునకు సాహాయ్యమొనరించె రావణాదినిఖిల రాక్షసవధకు సంతసించి; శ్రీరామచంద్రునిస్తుతించి యేమివరము కావలయుననికోరఁగ, యుద్ధనిహతులగు వానరులనందఱిని బ్రదికింపుమని కోరెను. అట్టుల యందఱినిఁ బునరుజ్జీవితులఁగావించె సంతుష్టుండైన యింద్రుఁడు మహోపకారముఁ జేసి వరములొసంగు మహనీయుఁడు.

రజిపుత్త్రు లింద్రుని జయించి యింద్రపదవినిఁ బడయుట.

కొంతకాలమునకు రజి స్వర్గతుఁడు కాఁగ, నతనిపుత్త్రులు నారద మహర్షి ప్రేరితులై యింద్రునికడకుఁ బోయి, మాతండ్రికి నీవు ధర్మపుత్త్రుఁడవు, మేము నౌరసులము, తండ్రిసొత్తుకు నందఱు నర్హులుకదా? త్రైలోక్య రాజ్యదాయభాగము నిమ్మనికోరఁగ నతఁడీయనొల్లఁడయ్యె నంత బలిష్ఠులగు రజిపుత్త్రులు ఇంద్రునిజయించి యింద్రత్వమునుఁ బొందిరి. త్రైలోక్య రాజ్యమును, హవిర్భాగములనుఁ బోఁగొట్టుకొనిన యింద్రుఁడిట్లు కొంతకాలమయిన పిమ్మట, మంత్రియును బురోహితుఁడు నగు బృహస్పతినిఁ జూచి బదరీఫలమాత్రమేని హవిర్భాగభోజనము నాకుఁ గలుగఁజేయ లేకపోయితివికదా! యని యడుగఁ గొలదికాలములోనే నీయింద్రపదవి నీకువచ్చునట్లుచేసెద? పూర్వమే నాతో సంప్రతించితివేని తగు విధమగు నుపాయము నాలోచించియుందు నింతవఱకీస్థితివచ్చియుండదు, చింతింపవలదనిచెప్పి, ప్రతిదిన మాభిచారిక హోమముచే రజిపుత్త్రులకు బుద్ధిభ్రంశము గలుగునట్లు, ఇంద్రునకు తేజోఽభివృద్ధియగునట్లు వ్రేల్చుచుండగ గొంతకాలమునకు, రజిపుత్త్రులుబుద్ధి మోహముఁజెంది, జైన, బౌద్ధ, పాషండధర్మముల నవలంబించి, బ్రహ్మద్వేషులును ధర్మత్యాగులును, వేదవాదపరాఙ్ముఖులు ననాచారవంతులు కాగా వారలను వధించి, బృహస్పతిచే నొసఁగఁబడిన తేజోవంతుఁడై త్రైలోక్య సామ్రాజ్యము నింద్రపదవిని మరలఁబొందెను. ఈగాథవలన మహాబలపరాక్రమ సంపన్నులగు రాజోత్తముల ధర్మబద్ధులఁగావించి, స్వకార్యములను, నిర్వహింపుకొనుచు, నింద్రపదవినిఁ గాపాడుకొనుచుండెననియు,దనకు సాహాయ్యమొనరించిన వారికిఁ దగు వరములొసంగి యుత్తమలోకములు గలిగించుచుండెననియు, బృహస్పతి యుక్తిబలంబునను, నీతిప్రయోగంబునను నెల్లలోకముల రంజింపఁ జేయుచు నధిక తేజస్వి యగుచుండెననియు విదితమగుచున్నది. ఈగాథ శ్రీవిష్ణుపురాణమునఁ గలదు.

రాజన్యసత్తము లింద్రునికి సాహాయ్యమొనరించుట.

అప్పుడప్పుడు స్వర్లోకరాజ్యమున రాక్షసోపద్రవముఁ గలుగునపుడైక్ష్వాకరాజోత్తముల సాహాయ్యమును బొందుచుండువాఁడు. పురంజయుఁడను రాజును దానవులతోడ యుద్ధముసేయ రమ్మనిపిలువగ వృషభముపైనెక్కి వచ్చెదననియెం. అపుడింద్రుఁడు వృషభమై. దనకకుత్థ్సల

మున జయముగలుగుననియడుగ, రజినృపోత్తముఁ డెవరిపక్షము నాశ్ర
యించునో వారలకు జయము కలుగునని వాక్రుచ్చె నంతట దైత్యులు
రజియొద్దకేతెంచి నీసాహాయ్యముచే దేవతల గెలువవలయు, మాకుఁ దో
డ్పడుమని ప్రార్థింపగా నేను దేవతలజయించితినేని, నన్నింద్రునిఁగా మీరొన
రించునెడ మీపక్షముఁ జేరుదునని రజియనియె. కార్యార్థము మేమిపు
డొకటిచెప్పి రేపు వేఱొకటిచేయము. యథార్థమే పలుకుదుము చేయుదుము.
మాకింద్రుఁడు ప్రహ్లాదుఁడు, అతని నిమిత్తమే, యీసంగ్రామమున మీసా
హాయ్యముఁ గోరితిమనిచెప్పగ రజి సమ్మతింపకపోయెను. పిమ్మట దేవతలు
రజిరాజునొద్దకు వచ్చి మీసాహాయ్యమున మాపక్షము జయింపవలె నని
కోరిరి. అట్లయినచో నేను రాక్షసుల గెలుతునేని మీరు నన్నింద్రునిఁగాఁ
జేసెదరా? యనియడుగ దేవతలతని నింద్రునిగఁ జేయ సమ్మతించిరి రజి
నృపాలుఁ డనేక మహాస్త్రములతోడను, దేవసైన్యసహాయముతోడను,
ఘోరముగఁ బోరి రాక్షస సమూహము నంతయుఁ బరిమార్చి దేవతలకు
గెలుపు గలిగించెను.

## ఇంద్రుఁ డుపాయముచే రజివలన నింద్రత్వమునుఁ బడయుట.

అనుకొనిన యొడంబడిక ప్రకారము రజికింద్రత్వము గలుగునని
యింద్రుఁడు భయంపడి, తనశిరంబును రజి పాదయుగంబునఁ జేర్చి మహా
నీయా! భయత్రాత, అన్నదాత, యేవురు తండ్రులలో నొకరుగ ధర్మజ్ఞు
లునుడివెదరు. నీవు నన్నురాక్షసభయమునుండి రక్షించి హవిర్భాగము
లవిచ్ఛిన్నముగఁ గలుగునట్లొనరించినందునఁ దండ్రి వగుచుంటివి త్రిలో
కేశ్వరుఁ డనగు నాకు నీవు తండ్రియగుట యుత్తమోత్తమముగదా? తం
డ్రిసొత్తు కుమారుఁడనుభవించుట న్యాయముగనుక, నీసాహాయ్యము
వలనఁగలిగిన త్రిలోకరాజ్యము ననుభవించెద నాకొసంగుమా! తండ్రీ!
యని ప్రార్థింప, నప్పార్థివోత్తముండు నవ్వి, అట్లయగుఁగాక. ఓయింద్రా!
ప్రియవాక్యగర్భితముగ నాత్మసమర్పణము (శరణాగతి) శత్రుపక్షము వారొ
నరించినను, నతిక్రమింపఁగూడదుకదా! అట్టియెడ నీబోఁటి మహనీయుఁడు
నన్ను శరణుజొచ్చి త్రిలోక సామ్రాజ్యము నభ్యర్థించుచుండ నీప్రార్థన
మేల త్రోసివైతును? కావున నోమహాత్మా! నీవు కోరినప్రకార మింద్రత్వ
ము పొంది. త్రిలోకరాజ్యలక్ష్మివైభవము ననుభవింపుమనిచెప్పి స్వపు
రంబునకు రజి చనియెను

గొని వచ్చిరి. ఈవార్త స్త్రీరూపముననున్న భంగాస్వనునకుఁ దెలిసి, బ్రాహ్మణుని పాదములపైఁ బడి మ్రొక్కఁగఁ దానింద్రుఁడ నని తెలిపి పుత్త్రుల నందఱిని బ్రదికించెను. అతని స్త్రీరూపమునుఁ బోఁగొట్టెను. ఇంద్రుఁడు తనకును తన రాజ్యస్థితికిని నప్రియకారములగు కార్యములనొన రించిన వారి యెడఁ గుపితుఁడై యపకారముల నొనరించినను, వారుశరణాగతులై ప్రార్థించిరేని, వారి తప్పులు మన్నించి, యభీష్టార్థము లొసంగి యనుగ్రహించుచుండె నట్లనేక గాథలు కలవు

ఇంద్రుఁడు శిబిచక్రవర్తినిఁ బరీక్షించి వరంబు లొసంగుట

శిబిచక్రవర్తి యజ్ఞము సేయుచుండఁగ నాతని శరణాగతరక్షణత్వ ధర్మమునుఁ బరీక్షింపఁ దలఁచి, యింద్రుఁడు డేగయై, అగ్నినిఁ బారావతముగఁ జేసి తఱుముకొనుచుఁ బోవగ నది, యాచక్రవర్తి పాదములపైఁ బడియె. నాకాహారమగు పావురమును విడువకుండుట ధర్మమా? యనిడేగ యడుగ నీకాహారార్థము నామేనిమాంసమిచ్చెద, శరణాగతమైన యీపారావతమునువిడువఁజాల నాధర్మమిది, యీపావురమెత్తుమాంసము నాదేహమున నెచ్చటనేని నీవుకోరిన ట్లొసంగెదనని బలికి, త్రాసులో బెట్టి యెంతతూఁచినఁ బావురమువైపు బరువుగ నుండె. మేనిమాంసపు ఖండములనన్నియు సంతోషముతో నొసఁగఁగ నింద్రుఁడు, వానిధార్మికత్వమునకును, శరణాగత రక్షణత్వమునకును మెచ్చుకొని, దర్శనమొసంగి, నేనింద్రుఁడను, ఈపారావతమగ్ని మేమిపావురము నీధర్మగుణమునుఁ బరీక్షింప నీరూపములతో వచ్చితిమి నిన్ను మెచ్చితిమని వరంబులొసంగి, శరీరమునుఁ బూర్వమువలె వజ్రమయముచేసి, శాశ్వత పుణ్యలోకములఁ బొందవు నీకీర్తి యెల్లప్పుడు వెలయుఁగాతమని నుడివి యంతర్హితులైరి. కావున యింద్రుఁ డప్పుడప్పుడు ధర్మాత్ముల బరీక్షించి వారలకు శాశ్వత పుణ్యలోక సుఖంబు లొసంగుచుండును.

రజికింద్రత్వప్రాప్తి.

పురూరవశ్చక్రవర్తి జ్యేష్ఠపుత్త్రుఁడగు నాయువునకైదుగురుపుత్త్రులు గలరు. వారిలో రజియను రాజసత్తముఁడు బహుపరాక్రమవంతుఁడు అతనికి బలవీర్యపరాక్రమ సారసంపన్నులగు పుత్త్రు లేనూఱుగురు కలరు దేవాసుర సంగ్రామారంభమునఁ బరస్పరజయేచ్ఛగలవారలై సురాసురులు బ్రహ్మదేవునియొద్దకుఁబోయి లోకపితామహా! మాలో నెవరిపక్షు

పొందెను ఇంద్రుండెట్లయిన దనపదవిని సంపాదింపఁగోరి, దేవగురుని కడకుఁబోయి యేమిచేసిన నా రాజ్యము నాకు వచ్చునని యడుగగ, భార్గవు నడుగుమని బృహస్పతిచెప్పెను. భార్గవునొద్దకుఁ బోయి యడుగగఁ బ్రహ్లాదు నడుగుమని యాతఁడు నుడివెను. అంతట ఇంద్రుఁడు బ్రాహ్మణవేషమునఁ బ్రహ్లాదునొద్దకుఁ బోయి యతనినిఁ గొలుచుచుండి, యొకనాఁడు, ఓ ప్రహ్లాదా! నీకీ త్రిలోకరాజ్య మెట్లువచ్చెనని యడుగగ సుశీలమువలన వచ్చెనని శీలమాహాత్మ్యము నతనికెఱింగించెను. అట్లయినచో నీశీలము నాకొసంగుమని కోరగ నట్టుల యొసంగెద ననె. ఇంతలో ప్రహ్లాదుని శరీరమునుండి తేజస్వియగు పురుషుఁడు వెడలగ నీవెవ్వఁడవని యడిగె. నేను నీశీలమును ఇంద్రుఁడడుగగ నిచ్చితివి. కాన బోవుచుంటినని యాపురుషుఁడుచెప్పెను, వానివెంట నింకొకపురుషుఁడు పోవుచు నేనుబలమును శీలముతోడఁ బోవుచున్నాననినుడివెను వీరివెనుక నొక యువతి బయలునించి నేనుసిరిని శీలమెచ్చటనుండునో యచటికిఁ బోవుదుననిచెప్పె ఇట్లు మువ్వురును నింద్రునిపొందగఁ దనరాజ్యము సంపాదించుకొనఁగలిగెనని మహాభారతమునఁగలదు కాఁబట్టి యింద్రుఁడు సమయోచితముగ రాజనీతి నవలంబించి కార్యముల సాధించుకొను నేర్పరి యని స్పష్టమగుచుండెడిని. ఇట్లు ప్రహ్లాదునుండి త్రిలోకరాజ్యలక్ష్మి తొలఁగి యింద్రు నాశ్రయించెను

### ఇంద్రుఁడు భంగాస్వనుని శోధించి వరంబు లొసంగుట.

భంగాస్వనుఁ డను రాజు పుత్రులనుఁ గోరి యాగము చేయుఁగ నతనికి నూఱుగురు పుత్త్రులుకలిగిరి కాని యాయాగ మింద్రుని కప్రియమైన దగుటచే నతనికి గోపముగనుండెను. భంగాస్వనుఁడొకనాఁడు వేటకేగగ నింద్రుఁడు వానిని వంచించుటకై దిగ్భ్రాంతిఁ గలుగఁజేసి దూరము పోవునట్లుచేసెను. రాజునకు నడకవలన దప్పిక గలుగఁగఁ జేరువనున్న కొలనిలో దిగి జలముత్రాగి పైకివచ్చి యతఁడు స్త్రీయయ్యె. స్త్రీరూపముతోఁ బురమునకుఁబోవ సిగ్గుపడి యచ్చటనే యుండనాతనికు బుత్త్రులుకలిగిరి. వారును, భంగాస్వనుని మొదటిపుత్త్రులునుగలిసి రాజ్యము సేయుచు దేశముల గెలుచుచుండిరి. తానపకారము సేయఁబోవఁగ నది యుపకారమయ్యెనని యింద్రుఁడు చింతించి, బ్రాహ్మణవేషమున వచ్చి యిరుతెగల కుమారులకు వైరము పెట్టెను. వారొకరి నొకరు కొట్టు

నాగమాతతో నుంచి, స్నానముచేసి వచ్చులోపల నింద్రుఁడుమాయా రూపముతో నాగదిలోనికిఁ బోయి, యమృతకలశ మపహరించి, దానిని యథాస్థానమున నుంచి కాపాడుచుండెను. కాద్రవేయులు, గరుత్మంతునితోడ స్నానము చేసి, వచ్చి చూచునప్పటి కమృతకలశ మదృశ్యమయ్యె. వారుతమయజాగ్రత్తకుఁ జింతిలి, దర్భలపై స్రవించియుండునేమో యని జిహ్వలచే నాకిరి. నిశితాగ్రములగు దర్భలనునాకినందున, జిహ్వలు రెండుగా చీలెను. నాటంగోలె కాద్రవేయులు ద్విజిహ్వులై పఱగిరి. ఈసందర్భమున నింద్రుఁడు గరుత్మంతుని శక్తిప్రభావములకు మెచ్చుకొని, సఖ్యముచేసి యమృతకలశము నొసంగెను. పిదప రాజ్యసంరక్షణకై రాజనీతి ననుసరించి యమృతకలశ మపహరించి తెచ్చెను. గరుత్మంతుఁడును తన ధర్మమునిర్వర్తించుటకై యమృతమును కాద్రవేయుల వశముఁ గావించెను గాని, వారు దానిని దక్కించుకొనలేక పోయిరి. ఇంద్రుఁ డపహరించికొని పోయిన సంగతి గరుత్మంతునికిఁ దెలిసినను గినియక, తన బాధ్యత తొలఁగినదని యూరకుండెను.

ఇంద్రుఁడుగర్వముచే నైశ్వర్యమునుఁగోల్పోయి మఱలనొందుట.

ఇంద్రుఁ డైరావతము నెక్కి దేవతలతో వచ్చుచుండఁగ దూర్వాస మహాముని యెదురుగవచ్చి పుష్పమాలిక నిచ్చెను. దానిని దనయేనుఁగుపై వైవఁగ నది తొండముతోఁ గ్రిందఁబడవైచి తుంపులు చేసెను. దేవతలు నవ్విరి. తానిచ్చిన పుష్పమాలికను గ్రహింపక యలక్ష్యముచే నిట్లవమానము చేసెనని దూర్వాసునకుఁ గోపమువచ్చి నీసిరులన్నియు సముద్రములోఁ గలయుఁగాక యని యింద్రుని శపించెను. దానంజేసి, యైరావతము, కామధేనువు, కల్పవృక్షము లోనగునవియన్నియు సముద్రమునఁ బడెను. ఇంద్రుఁడు భయంపడి విష్ణుమూర్తి కడకు బోయి చెప్పుకొనఁగ, నీవు సముద్రమును మధింపుము నీసిరులన్నియు నీకు మఱల వచ్చునని యా పురుషోత్తముఁడు నుడివెను. సముద్రమును మధింపఁగ మొదట శ్రీదేవి యావిర్భవించెను. ఇంద్రుఁడు భక్తియుక్తుఁడై శ్రీస్తుతిఁ గావింపఁగ నామె ప్రసన్నయై వరము వేఁడుమనఁగ, జగదీశ్వరీ! త్రైలోక్య సామ్రాజ్య లక్ష్మివగు నీవు నాయెడ ననుగ్రహించి నన్నుఁ బూర్వము వలె శ్రీమంతునిఁగావింపుము నాయెల్లసంపదలు నాకొసంగుము. నాయా న[illegible]మువదలి పోవలదు. భుక్తిముక్తి ప్రదాయినివి. చరాచర ప్రపంచ

మఱలిపోయెను. పిమ్మట వాయువునుఁ దెలిసికొనిరమ్మనిపంపిరి. వాయువాభూతమునుసమీపింప, నీవెవ్వఁడవన? వాయువను, పృథివియందుఁగల పదార్థముల నన్నిటిఁ జలింపఁజేయుదుననె నయినచో నీతృణమునుఁ గదలింపుమనఁ దనసర్వశక్తులఁ బ్రయత్నించిన నించుకేని చలింపకుండఁగఁ జూచి, యిది చిత్రముగనున్నది. దీని మహిమ తెలియ శక్యముగాకున్నదని తలఁచి వాయువు మఱలిపోయెను. పిమ్మట నింద్రునిఁ దెలిసికొనిరమ్మని దేవతలుపంపిరి. ఇంద్రుఁడాభూతమునుసమీపించునప్పటికదియదృశ్యమయ్యె. అచ్చటనే శోభనగాత్రియగు నుమయుండ నామెయొద్దకు నింద్రుఁడుచని అమ్మా! అదృశ్యుఁడైన యీయక్షుఁడెవరని యడిగెను. అతఁడే పరబ్రహ్మము, అతనివలననే మీరుగెల్చితిరి. అనియును తెలియపఱచెను. పరబ్రహ్మ సమీపమున కేగుటవలన, నింద్రాగ్నివాయువులు దేవతలలో శ్రేష్ఠులైరి. ముందుగ పరబ్రహ్మస్వరూపమునుఁ దెలిసికొనుటచే నింద్రుఁడు దేవతలలో నగ్రగణ్యుఁ డయ్యెను. అగ్ని వాయువులు సమీపించిరి కాని, స్వరూపముఁ దెలిసికొనలేకపోయిరి. ఇంద్రుఁడు మాత్రము స్వరూపమునుఁ దెలిసికొనినందున, బ్రహ్మవేత్తయై యందఱిలో నగ్రగణ్యుఁడయ్యెను. అట్టి ప్రభావ మింద్రునందుఁగలదని కేనోపనిషత్తునం దిట్లుచెప్పబడియె:—

శ్రు. తస్మాద్వా ఇన్ద్రోऽతితరామివాన్యాన్ దేవాన్ స హ్యేనన్నేదిష్ఠం
పస్పర్శ స హ్యేనత్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి.

కేనోపనిషత్. ౪-౨౮

ఇంద్రుఁడమృతమునొసంగి ఖగేంద్రునితో సఖ్యమొందుట.

వినతాపుత్త్రుఁడగు గరుత్మంతుఁడు, తనతల్లి దాస్యవిమోచనమునకై, యమృతము నపహరించి తేఁబోవగ, నచట పెక్కులు కాపులు పెట్టి యతిజాగరూకతతో నమృతమునుఁ గాపాడుచుండిరి. వానినన్నిఁటిని దాటిపోవుచుండఁగ నింద్రుఁడు గరుత్మంతునిపై వజ్రాయుధము నేసెను. దానివలన గరుత్మంతుని ఱెక్క యీకలలో నొకటి రాలఁగ, వైనతేయుని శక్తిప్రభావములకు మెచ్చుకొని యింద్రుఁడు వానితో సఖ్యము చేసి యమృతము నొరుల కీయఁపలదని వేఁడెనుగాని, తనతల్లి దాస్యవిమోచనమునకై, కాద్రవేయుల కీయవలసి, దానిం గొంపోయి ఖగేంద్రుఁడు వారికొసంగి దాస్యవిమోచనమును గావించెను. కాద్రవేయులమృతకలశమును, దర్భలు పఱచిన పవిత్ర ప్రదేశమున నొకగదియందుఁ

మునఁగునాకు లోమమాత్రమేని హింసింపఁబడదు. ఇయ్యది నామాహాత్మ్యముగాదు. అంతయు జ్ఞానప్రభావము. నన్నెవరు, చిత్స్వరూపునిగఁ దెలిసికొని భావింతురో, వారికిఁ దదనుగుణ్యఫలము మొసంగుదును. శారీరకక్రియచేఁగాక, మనోవాక్కులచేనయినను, మాతృవధాదులనుగావించినేనియు జ్ఞానికి మోక్షము గలుగునుగాని, కర్మలచే బద్ధుఁడుకాఁడు. పాపకర్మమొనరించినను ముఖమునందు సహజానంద వికాసము చెడదుగాని తొలఁగదు అట్టి చిత్స్వరూపుఁడగు నాత్మజ్ఞాని యసంగుఁడగుటవలన పాపములేవియు నంటవు ముక్తికలుగక మానదని శాస్త్రము ఘోషించును. అనియిట్లు పలువిధముల నాత్మజ్ఞానమును ప్రతర్దనునకు నింద్రుఁడుబోధించెనని శ్రీవిద్యారణ్యమునీశ్వరకృత అనుభూతిప్రకాశమున నెనిమిదవప్రకరణమున విపులముగఁ జెప్పఁబడియెను.

ఈవిషయమునే శ్రీభగవానుఁడు గీత ౧౮వఅధ్యాయ ౧౭వ శ్లోకమునందు:—

శ్లో. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే,
హత్వాఽపి స ఇమాంల్లోకాన్ నహంతి న నిబధ్యతే.

ఎవఁడు కర్తృత్వాభిమానబుద్ధిలేక యసంగుఁడై లోకముల నన్నింటిని వధించినప్పటికిని వధించినవాఁడుకాఁడు. బద్ధుఁడునుఁగాఁడు. కాఁబట్టి పూర్వోక్త కృత్యములన్నియు నింద్రుఁడు కర్తృత్వాభిమానము గలిగిచేసెనా? లేక యసంగుఁడై చిత్స్వరూపియై చేసెనాయని విమర్శించి యసంగుఁడై చేసెనని గ్రహింపవలయును.

ఇంద్రుఁడు బ్రహ్మవేత్తయగుటచే దేవతలలో శ్రేష్ఠుఁడు.

దేవాసురులకు యుద్ధమైనపుడు దేవతలుగెల్చిరి. ఈజయము వారి మాహాత్మ్యమువలననే కలిగినదనుకొనిరి. పరబ్రహ్మమువారి యహంకారమునుపోఁగొట్టఁదలఁచి యక్షరూపమున గోచరించెను. వారు పరబ్రహ్మము నెఱిఁగినవారుకారు కాఁబట్టి యది చూచి యెవ్వరోయనుకొనిరి. వానిం దెలిసికొనుటకై తొలుత యగ్నిదేవునిబంప నాయగ్ని, యక్షుని సమీపింపగ నీవెవ్వఁడవు? నీకుఁ గలశక్తియేమని యడిగెను? లోకమునం గలయెల్లపదార్థములను దహింతుననె, అయినచో నీతృణమును దహింపుమనియెను. తనసర్వశక్తి ప్రయత్నములచేనించుకేని దహింపనశక్తుఁడగుగాక యీభూతమేమో చిత్రముగానున్నది. తెలియశక్యముగాకున్నదని తలఁచి

మనుష్యులకు హితతమమైనదాని నానతీయవలెనని యింద్రుని వేఁడగ, మర్త్యసుఖమునకన్న నధికమగుటవలన స్వర్గసుఖము హితము, యాగాద్యాయాసమువలన లభించెడినశ్వరమగు ఆస్వర్గసుఖమునకన్న తద్వైరాగ్యము హితతరము నిత్యానందానుభవముఁ గల్గుటవలన నాత్మబోధము హితతమము అనాద్యవిద్యారూప జననమరణ ప్రవాహమునుఁ బోనడచి, నిరతిశయానందరూపమగు నాత్మజ్ఞానబోధకన్న నతిశయించిన హితతమమైనది మఱియొకటిలేదు సహస్రాక్షుఁడను నభిమానముగల యీస్థూలశరీరమునకు స్వామిత్వ, ఇంద్రత్వాధికారముల నారోపించుటచే నసురులవలన బాధ కలుగుచుండెడిని. సూక్ష్మశరీరాభిమానముచే త్వాష్ట్రిపుత్త్రులగు విశ్వరూప వృత్రులవలన భీతియు, వారితోఁ ద్వేషంబునుఁగలిగి వారిని వధింపవలసె. అహంకార మమకారములు గల సూక్ష్మశరీరికి బ్రహ్మహత్యాదోషంబును భీతియుఁ గలిగెను. అసంగుఁడును, చిత్స్వరూపుఁడునగు నాకేవియు నంటవు. నన్నేవియుబాధింపవు. విషయాసక్తుఁడ నయ్యెదనేని బాధితుఁడనగుదును. ఇట్టి యాత్మబోధలను, ప్రతర్దనునకుఁ గావించిన మహనీయుఁడు బ్రహ్మవిద్యారిష్ఠుఁడు.

శ్లో. కర్తృత్వభా(క్బ్రహ్మహత్యా నత్వసంగే చిదాత్మని,
వేదాంతజ్ఞానహీనానాం యతీనాం హననే తథా.
లోకత్రయే బహువిధా నసురాన్ హతవా నహం,
చిదాత్మనోఽపి మే తత్ర నైవ లోమాఽపి హింస్యతే,
మాహాత్మ్యం మమ నైతత్స్యాత్కింతు జ్ఞానస్య తద్భవేత్,
అన్యోఽపి మాం చిదాత్మానం వేత్తిచేత్తత్ఫలం భవేత్.
నాచా వా మనసా మాత్రృవధాదీన్ కురుతే యది,
తథాఽపి జ్ఞానినో మోక్షో నహ్యాత్మైర్వనివార్యతే.
పాపం కృతవతోఽప్యస్య ముఖే హర్ష క్షయో నహి,
సముక్తిగ్రశ్రుతీత్యేవం శాస్త్రైరస్య వినిశ్చయాత్.

అనుభూతిప్రకాశే-౮-అధ్యాయే.

కర్తృత్వాహంకారము గలవానికి బ్రహ్మహత్యాదిదోషము లంటునుగాని, యసంగుఁడగు చిదాత్మకు నేవియు నంటవు. వేదాంతజ్ఞానహీనులగు యతులవధయందును, బహువిధదుష్కృతులొనరించిన యసురులవధయందును, కర్తృత్వాభిమానము లేక, చిత్స్వరూపుఁడును, నసంగుఁ

శించుసలువదితొమ్మిదిసంఖ్యగల (మరుత్తులను)పుత్త్రులనుంజూచి, యింద్రా! ఇది యేమిచిత్రము? దేవతలకు భయంకరుండగు నొకపుత్త్రునిం గోరి వ్రతమాచరింప నిందఱెట్లుకలిగిరి? యథార్థము చెప్పుమనియడుగ నోతల్లీ! నన్నుం జంపంగలపుత్త్రుండు నీగర్భమునజనించునని తెలిసి భీతుండనై స్వార్థపరుండనై, బాలకరూపమున నిన్ను శుశ్రూష సేయుచుండ నించుకేని లోపముకన్పింపమిం జింతిలుచుండ, నీవశుచివై నిదురించుచుండనీగర్భమునం బ్రవేశించి యేడువిధములుగ ఛేదించితిని మృతిం జెందక మఱల యేడ్చుచుండ నాశిశువు మఱల యేడువిధములుగ ఛేదించితి, వైష్ణవవ్రతప్రభావంబునం జేసి మృతిం జెందక దేదీప్యమానముగం బ్రకాశించువారిని నాకు సాహాయ్యులుగను, పరివారగణములుగనుం గ్రైకొంటిని. ఓతల్లీ! స్వార్థపరుండనై యవివేకినై కావించిన యీనాతప్పును క్షమింపుమని వేడగ నామె యోయింద్రా వారలు మృతిం జెందక దేదీప్యమానముగం బ్రకాశించుచు భగవన్మహిమచే నిన్నాశ్రయించిసందులకెంతయు సంతుష్టురాల నగుచున్నదానను. నీసోదరులుగ భావించి యధికారమొసంగి, సఖ్యముం గావించినందున నీయెడ నాకుం బ్రీతికలదు. మన్నించితి వర్ధిల్లుమని యాశీర్వదించెను. దీనివలనం దెలియు సారాంశమేమన? ఇంద్రుండు, మహా మహిమాన్వితుండును, వివేకజ్ఞానసంపన్నుండు నయినను, త్రైలోక్య సామ్రాజ్యలక్ష్మి విభవబద్ధుండైనందున, రాగద్వేషాసూయాదులు కలుగకమానవు. ప్రకృతిబద్ధుండై, రజస్తమోగుణాన్వితుండగు వాండెంతవివేకియైనను, బహుశ్రుతులశుశ్రూషనుగావించినను, స్వార్థపరుండై యకార్యముల సేయకమానండు. సామాన్యులొనరించినయెడ నీతిబాహ్యమని, స్వార్థపరత్వమనియందురు. మహావిభవాన్వితులగుగొప్పయధికారులురాజప్రతినిధులు రాజులుకావించునెడ, రాజనీతియనియు, రాజ్యసంరక్షణమునకై కొన్నింటి గావింపక తప్పదనియు, నధికారపదవియందు లేనివో, వ్యక్తిపరముగనున్నప్పుడిట్టివి సేయననావశ్యకమనియునుడివి, తామొనరించినవి యుచితములేయని సమర్థింప గడంగుదురు.

ఇంద్రుండు బ్రహ్మవిద్యను ప్రతర్దనున కుపదేశించుట.

ఇంద్రుండు బ్రహ్మవిద్యను గ్రహించిన మహనీయుండగుటచే, ప్రతర్దనునకు నాత్మవిద్యను బోధించినట్లు కౌషీతక్యుపనిషత్తునందుగలదు.

నింద్రుఁడు క్షమార్పణము నొనరింపఁ బృథుచక్రవర్తి యంగీకరించి, యింద్రునితో సఖ్య మొనరించెను. మొదట బ్రహ్మదేవుఁడు సంధి (కాంప్రమైజు, రాజి) చేకూరుమాటలు మాట్లాడి, యనుకూల సంవిధానముఁ గూర్చిన పిమ్మట, శ్రీమహావిష్ణువు, తనయంశ పురుషులగు, నింద్ర పృథు చక్రవర్తులకు సఖ్య మొనఁ గూర్చెను. పురపాలకాధ్యక్షులు స్థానిక మండలాధ్యక్షులు, శాసనసభాధ్యక్షులు మంత్రులులోనగు ప్రజాప్రాతినిధ్య సభాధిపతులకును, ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యులకును, వ్యవహారము పట్ల భావభేదములుగలిగి, స్వాధికారమును నిర్వహింప బట్టుదలయు, రోష ద్వేషములఁ బూని వివాదములఁ బెంచుకొను నపుడు, రాష్ట్రపాలకులు (గవర్నరులు) మధ్యవర్తులుగ నుండి, సమాధాన వాక్యముల నుభయులకు నచ్చఁజెప్పి కలహముల నణఁచి, యవసరమున్నచో క్షమార్పణముల నర్పింపఁజేసి, సఖ్య మొనఁగూర్తురు. రాజప్రతినిధికి, నఖిలభారత సైన్యాధిపతికి, నట్టుల భావభేదముగలిగి, స్వాధికార నిర్వాహణవిషయమునఁ బట్టుదలకలిగి కలహించుచున్నపుడు చక్రవర్తి, యుభయుల సామవాక్యముల సమాధానపఱచి, సఖ్య మొనఁగూర్చుచుండుట లోకవిదితము. ఇయ్యది దేవతా ప్రభుత్వమునందునుగలదని పూర్వోక్తపృథుచరిత్రమున విశదమయ్యెను.

ఇంద్రద్వేష్యశతాశ్వ మేధయాగమును విరమించుట.

సగర, నహుష, దిలీప, మాంధాత్రాది రాజన్యుల నూఱవ యశ్వమేధమునకు, విఘ్నము వాటిల్లినట్లు చరిత్రమువలన స్పష్టమగుచున్నందున, తక్కిన రాజోత్తములును, శతాశ్వమేధ దీక్షకుఁ బూనకొనక యుండిరి. తొంబదితొమ్మిది యజ్ఞములనుఁ గావించి యింద్రునితో సఖ్యమొందుచుండిరి. ఇంద్రునికి బ్రహ్మహత్యాది దోషములచేఁ బదభ్రంశముగలిగినపుడు, (ఏకోనశత) తొంబదితొమ్మిది యజ్ఞములఁ జేసినవారిలో జ్యేష్ఠుని, శ్రేష్ఠుని, నభ్యర్థించి, నూఱవయజ్ఞము సేయించి శతక్రతుత్వముచే లభ్యమగు నింద్రపదవి నొసంగెదరు. ఇది తాత్కాలికముగ నుండునది, కాని, క్రమప్రాప్తముగ మన్వంతరాంతము వఱకు నుండునదికాదు. ఇయ్యది నహుష చరిత్రము వలన స్పష్టము. మన్వంతరాంతమున, నేకోనశతక్రతురాజన్య శ్రేష్ఠుని మహాతపస్విని, భగవదనుగ్రహ పాత్రుని, శతక్రతు దీక్షఁగావించి, పూర్తి సేయించి, రాఁబోవు మన్వంతరమున

శ్రీహరిసన్నిధిని, ఇంద్రక్షమార్పణముచేఁ బృథువుశాంతించుట.

పిమ్మట యజ్ఞేశ్వరుండును యజ్ఞభోక్తయునగు శ్రీమన్నారాయణమూర్తి యింద్రునితో నచ్చటి విచ్చేసి పృథునృపాలున కిట్టులనియె. ఓ నరేంద్రా! యజ్ఞాశ్వమునపహరించి నీయశ్వమేధ శతదీక్షకు భంగముఁగావించినట్టి యింద్రుఁడితండే, తనతప్పిదంబు మన్నించి నీవు శాంతిఁగొనునట్లు (అపాలజి) క్షమార్పణము వేఁడికొనవచ్చియుండెను. ఈతని క్షమార్పణ విన్నపంబాలకించి ప్రసన్నుఁడవగుము. దేహమునెడ నాత్మాభిమానము పట్టని నరోత్తములు భూతద్రోహమున కొల్లరు. భవాదృశులును దేవమాయకు మోహముఁ జెందుదురేని వృద్ధసేవనంబు నిష్ఫలమేకదా. ఇంద్రాదిపదవులు భోగములు స్థిరమైనవికావు, నీవింద్రపదవికెనిఁ బ్రయత్నించినవాఁడవుకావు, నీయొనరించిన యజ్ఞములచే సమ్యగారాధితుండనైతి. ఇంద్రాదులకు లభ్యముకాని శాశ్వతమగు పరమపదవి నీకొసంగెదను. నీవు మోక్షవిదుండవు. ధర్మార్థకామంబుల నెడ నాసంగము వదలి యీపృథివి నేలుము. దాన బ్రజానురాగంబుఁ గాంచి యచిరంబ నీయింటికినచ్చు సనకాదిసిద్ధులం గొలిచి జ్ఞాతవ్యం బెఱుంగుదువు. ఏను భవదీయ గుణశీలములకు భవద్వశుఁడనైతి. నభిమతవరంబుల వేడుమా, యని యనుశాసించిన పుండరీకాక్షు నాదేశము శిరసావహించి, స్వామీ! నరకవాసులకును లభ్యంబులగు క్షుద్రసుఖంబుల కాసించి వరంబుల నెట్లు వేఁడద. ఇంద్రాదిపదంబులును భోగంబులును దుఃఖయుతంబులు, శాశ్వతములుగావు. అట్టి క్షుద్రపదభోగంబుల నాసింపను మహానుభావుల హృదయాంతరాళములనుండి వెడలు భవదీయచరణకథాసుధారసంబు లేకుండిన కైవల్యంబు నేనభిలషింపను. భవబంధంబులఁ దొలఁగించునట్టి భవచ్చరణారవిందముల నిరంతరము నాహృదయమున నెలకొలుపవలయు. సచ్చిదానంద స్వరూపంబగు నీయనుగ్రహముకన్న నాకు వేఱొండేల? నన్ను నీవానిగఁ జేసికొమ్మని ప్రార్థించెను.

శ్లో. స్పృశంతం పాదయోః ప్రేమ్ణా వ్రీడితం స్వేన కర్మణా।
శతక్రతుం పరిష్వజ్య విద్వేషం విససర్జహ॥

అశ్వాపహరణయజ్ఞభంగరూపమగు తానొనరించిన నీచకర్మకు లజ్జితుండై, పాదములపయిం బడిన యింద్రునిఁ గ్రుచ్చి కౌఁగిటం జేర్చి, పృథుచక్రవర్తి రోషంబుడిగి ద్వేషమును విడిచెను. శ్రీజగదీశ్వరునాజ్ఞచే

చుటంజేసి ధర్మలోపముకలుగును. ధర్మలోపమునకుఁ గారణంబైన యీ యజ్ఞము చాలింపుము. వేనుని యపచారంబునం జెడిన ధర్మమునకుఁ దత్తత్సమయానురూపంబుగఁ బునఃప్రతిష్ఠఁగావింప విష్ణుదేవునంశమున నవతరించిన నీకు నీపాషండరూప ధర్మలోపము నుపేక్షింపఁజెల్లునే? విశ్వ సృష్టివిధానంబరసి సృష్టికరులగు ప్రజాపతుల సంకల్పంబు నెఱవేర్పుము. అధర్మకారణంబైన యింద్రమాయవలనం బొడము పాషండమార్గంబు హరింపుమని యిట్లు చతుర్ముఖుండు బోధింపఁగా బృధుచక్రవర్తి యధ్వరంబుమీఁది యాగ్రహమునుఁ ద్యజించి యింద్రునితో సంధిచేసికొనెను.

ఇంద్రకృత్యముచితమని సమర్థించుట. (రాజనీతి)

ఈలోకమునను రాజ్యపాలనావిషయమునఁ దత్తత్సమయోచితముగ, నావశ్యకతనుఁబట్టి రాజప్రతినిధియు, రాష్ట్రపాలకులును, దమ యసాధారణాధికారపు టాజ్ఞల నుపయోగించి, యధర్మమును, నీతివిరుద్ధమునయినను, శాసనములఁగావించి యాత్మపదవినిఁ గాపాడుకొని లోకరక్షణము నొనరించుచున్నట్టుల యింద్రుఁడును, తనపదవినిఁ గాపాడుకొనుటకై మేధ్యాశ్వాపహరణము, పాషండముల సృజించుట లోనగుకార్యములఁ గావించును. రాజప్రతినిధి రాష్ట్రపాలకులు నిరంకుశాధికారము నుపయోగించి యధర్మశాసనములఁ గావించినందునఁ గొందఱకు నష్టముకలిగినను, దమచే నియమితుఁడై తమవాఁడయినందున, ప్రభుత్వమువారు (చక్రవర్తి మంత్రిమండలి) తత్కార్యము లుచితమనియు, నావశ్యకతనుఁబట్టి నిర్వర్తింపవలసివచ్చెననియు, సమర్థించి ప్రభుత్వప్రతిష్ఠను గాపాడుకొనియెదరు (డిపార్టుమెంటలుసపోర్టు) అట్టుల యింద్రుఁడునునాత్మపదరక్షణమునకుఁ గావించెననియు, నతఁడు భగవదంశముఁ గ్రకొని త్రిలోకినిఁ బాలించుననియు, నతనితోడ స్పర్ధ పెట్టుకొనవలదనియుఁ బెట్టుకొనిన విఘ్నములును, తద్వారాక్రోధమును జనించుననియుఁ, బ్రజాపతులసంకల్ప కార్యక్రమమునకు భంగముఁ గావింపవలదనియు, నీ వేయిశతాశ్వమేధంబు నుపసంహరించుకొనుమనియు,మాచే నియమితుఁడగులోకపాలేశ్వరునితో వైరము విడువుమనియు, బ్రహ్మదేవుఁడు బోధింపఁగ బృధుచక్రవర్తి యింద్రునితో సంధియొనర్చుకొనెనని భావము. విధాత తమ ప్రభుత్వమువారిచే నియమితుడగు నింద్రునికృత్యములను సమర్థించెననుట స్పష్టము గదా. ఇయ్యది రాజనీతితంత్రము.

ధర్మమని భ్రమించి, వాక్చమత్కారముల కానపడి కుమతు లాదరింతురు. ఇట్టి యధర్మసృష్టికంతయు నింద్రుఁడే మూలకారణంబని, క్రోధ దుర్నిరీక్ష్యుండై పృథుచక్రవర్తి యింద్రునిఁ బరిమార్పఁ గోదండంబుఁ గొని బాణసంధానంబు సేయుచుండ, ఋత్విజులు కనుఁగొని, మహామతీ! యజ్ఞదీక్షితుండవైన నీవు, మేధ్యపశువునుఁ దప్ప మఱియొక ప్రాణిని వధింపరాదు. ఇతర వధంబువలన నీకిప్పుడు పాతకం బొడఁగూరును, వీర్యవంతంబులగు మంత్రంబుల నుచితాహుతు లగ్నిముఖంబున వ్రేల్చి యింద్రునిటరావించి, భవత్కీర్తిమాత్రంబున హతప్రభుండైన యాతని నస్మదీయమంత్రాహుతులకు బలిచేసి నీకు హితముఁ గూర్తుము ఈయుద్యమము నుండి విరమింపుమని బోధించి, యుదంచిత క్రోధమూర్తులై స్రుక్పాణులై వ్రేల్వఁబూనఁగ బ్రహ్మదేవుండా క్షణంబ ప్రత్యక్షంబై యిట్లనియె.

## విరించి ఇంద్రపృథువులకు సమాధానమొనరించుట.

ఓ ద్విజులార! ఇంద్రుఁడవధ్యుండు యజ్ఞనాముండైన యితఁడు భగవంతుని యంశము. యజ్ఞమున మీరారాధించు సురలితని యంశములని మీకుఁ దెలియనిదా? పృథుని యజ్ఞమునకు విఘ్నమొనర్పఁబూని యీతం డొనర్చిన యన్యాయంబు చూడుఁడు. లోకంబునఁ బాషండప్రచారంబు పెంపయ్యె. పాషండు లధర్మమును వాక్చమత్కారముచే ధర్మముగ నుపన్యసించి యజ్ఞవిఘ్నములఁ గావింతురు. పృథుచక్రవర్తి యేకోనశతమఖ (తొంబదితొమ్మిది) పూరణమాత్రంబున నాత్మదీక్షాపూర్తి సేయుఁగాక యని చెప్పి పృథుచక్రవర్తి దెస మొగంబై యిట్లనియె. ఓ నృపసార్వభౌమ! నీ వింతవఱకు ననుష్ఠించిన యజ్ఞంబులు నీకుఁ జాలును. మోక్షధర్మవిదుండవు గావున, శతమఖానుష్ఠాన లభ్యంబగు ఫలము నీకనపేక్షితంబు గావున మహేంద్రునిపై రోష ముడుగుము. నీవును, ఇంద్రుండును నుత్తమశ్లోకుండగు భగవంతుని యంశంబులు గావున మీలో మీకుఁ గలిగిన కలహము నాకుం జూడఁ బోలదు. యజ్ఞవిఘ్నమునకుఁ జింతిల్లవలదు. ఆదరించి నా మాట వినుము. దైవోపహతంబైన కార్యముఁ జేయు నెడ నయ్యది నెఱవేఱమింజేసి మానసంబు రోషాక్రాంతంబై మఱింత మోహంబు చెనయుం గాని శాంతిం బొందనేరదు.

నీయజ్ఞమునకు ద్రోహముసేయ నింద్రుఁడు సృజించిన పాషండవేషములు, జనుల చిత్తములం జెఱచెడు. పాషండములు లోకమునఁ బ్రవేశిం

## శతక్రతుత్వవిఘ్నము.

శతక్రతువులను నిర్విఘ్నముగఁ జేసినవానికింద్రత్వము గలుగును గావున, నప్పటియింద్రుఁడు తనపదవికి హాని కలుగునని నూఱవయజ్ఞము సేయువారికి యజ్ఞీయాశ్వాపహరణము, అగ్నిలోపము, మంత్రలోపము, క్రియాలోపము లోనగు విఘ్నములను గావించి, యజ్ఞము పూర్తి కాకుండునట్లు ప్రయత్నములొనరించుచుండును. దానంబట్టి పూర్వకాలమునందు మహారాజులు, చక్రవర్తులు, నూఱవ యశ్వమేధయాగ మింద్రునకప్రీతియు, ద్వేషమును గలిగించుననియు, నింద్రునితోడ వైరముఁబెట్టుకొని యజ్ఞము పూర్తిగావింప లేమనియుఁ దలఁచి, తొంబది తొమ్మిదియజ్ఞములుమాత్రము గావించి విరమింతురు. యజ్ఞము పూర్తియగుటకు నింద్రునియొక్కయు, తదనుయాయులగు దేవగణములయొక్కయు ననుగ్రహమును సాహాయ్యమునుండవలయు తొంబదితొమ్మిది యజ్ఞములగువఱకు నింద్రుఁడు హర్షముతో హవిర్భాగములను దేవగణములతోఁ గూడి గ్రహించుచుండును నూఱవయజ్ఞమునుఁ దలపెట్టునప్పటికి, బహువిధ మాయారూపములతో విఘ్నములుగావించుచుండును, నూఱవయజ్ఞము పూర్తియయ్యెనేని శతక్రతుత్వము వజ్రపాణిత్వము లోనగుధర్మములతో నింద్రపదవి వెంటనే యాతని నాశ్రయించును. పూర్వపు టింద్రుఁడు పదభ్రష్టుఁడగును. లోకములో నిప్పటిప్రభుత్వమున స్థానిక, మాండలిక, రాష్ట్రీయాధ్యక్షపదవికి నర్హులుగా నుండువారు ప్రయత్నించుచుండ, నప్పటియధ్యక్షులు తమపదవికి భంగముకలుగునని, పరివారమును, అధికారమును తనవశమున నున్నందున, సరియైనకాలమందు, అభ్యర్థనపత్రిక పంపఁబడలేదనియు, శాసనవిధుల ప్రకారముఁ గావింపఁబడ లేదనియు, నింక ననేకదోషముల నారోపించి, తత్ప్రయత్నముల వ్యర్థముఁ గావించుట ప్రత్యక్షనిదర్శనమే. అదియునుంగాక పైనినుండు ప్రభుత్వమువారును, తాత్కాలికాధ్యక్షునికి దాక్షిణ్యవశంబునఁ దోడ్పడుచుందురు. వారియధికారములు సాగుచుండును. ఇది యింద్రునిచరిత్రమందు స్పష్టమగుచున్నట్లు పృథుచక్రవర్తి శతాశ్వమేధకథవలన విదితమగుచున్నది.

యూర్వశియని నామమిడిరి. ఈమె యతిసౌందర్యవతి యగుటచే నింద్రునకుఁ బ్రియురాలు.

### ఇంద్రుని లక్షణములు, తద్ధర్మములు.

ఒకయింద్రుని భోగైశ్వర్యసంపదలను లక్షణములనుఁ జూచి యూ యనవలెనే తాను నుండవలయునని తీవ్రతపస్సును, లోకోపకారక కార్యములను శతక్రతువులనొనరించి శ్రీపరమేశ్వరు నారాధించినట్లయిన, తదనుగ్రహముచేఁ గల్పాంతరమందుఁగాని మన్వంతరాంతరమందుఁగాని, భావితలక్షణలక్షితుఁడై యింద్రత్వమునొందును. ఇంద్రులందఱు సమానలక్షణవంతులని మార్కండేయపురాణమున నీక్రిందివిధమునఁ జెప్పఁబడెను.

శ్లో. అతీతానాగతాయేచ వర్తంతే సాంప్రతంచయే।
సర్వేతే త్రిదశేంద్రాస్తు విజ్ఞేయాః స్తుల్యలక్షణాః॥
సహస్రాక్షాః కులిశిన స్సర్వ ఏవ పురందరాః।
మఘవంతో వృషా స్సర్వే శృంగిణో గజగామినః॥
తే శతక్రతవ స్సర్వే భూతాభిభవతేజసః।
ధర్మాద్యైః కారణై శ్శుద్ధై రాధిపత్యగుణాన్వితాః॥
భూతభవ్యభవన్నాథా శ్శృణుష్వైత త్త్రయం ద్విజ॥

మార్కండేయే ౭౭ అధ్యాయే.

భూతభవిష్యద్వర్తమానకాలపు టింద్రులందఱును సమానలక్షణములుగలవారు. సహస్రాక్షత్వము, వజ్రపాణిత్వము, పురందరత్వము, శృంగిత్వము, ఐరావతగజగామిత్వము, శతక్రతుత్వము, వృషత్వము, ఈ ధర్మములు లక్షణములు నెల్లఱుకుఁగలిగియుండు ఇంద్రులందఱును, సర్వభూతములఁ దిరస్కరించునట్టి తేజఃప్రభావములు గలవారలు పరిశుద్ధమగు ధర్మాదికారణములచేతను, తపోమహిమచేతను, ఐంద్రాధిపత్యగుణాన్వితులగుదురట. భూలోక, భువర్లోక, స్వర్లోకములను, త్రిలోకములకుఁ నందఱు ఇంద్రులు ప్రభుత్వముగలవారలు. కొందఱు రాక్షసులు, దైత్యులు, అసురులు ఇంద్రాధిపత్యమునొందిరి. అందు కొంతభేదముగల దు. అట్టివి దైత్యదానవ స్వరూపభేద సందర్భమున విశదీకరింపఁబడును.

## ఇంద్రుని గుణములు.

ఋషభరాజర్షి సద్గుణగణ యోగమహిమాదులఁ గాంచి, ఇంద్రుఁడోర్వఁజాలక, స్పర్థఁబెట్టుకొని, ఆయన దేశమునందు వర్షింపకుండుటఁ జూచి, యారాజర్షి యిది యింద్రకృత్యమని నవ్వి తన యోగప్రభావమున నా దేశమంతట వర్షింపఁ జేసెను. తనకన్న నుత్కృష్టయోగప్రభావాది సద్గుణములు గలవారినిఁ జూచి యింద్రుఁ డోర్వకుండుటయుంగలదు. రాజర్షి ముని మానవదైత్యాదులు తపం బొనరించునెడ, తపస్సిద్ధి కలిగి యోగ మహిమాదులచేఁ దన్ను నతిశయింతురనియు, తనపదవికి భంగము కలుగుననియుఁ దలచి తపోభంగముఁ గావింప, స్వాధీనములో నుండిన యప్సరస స్త్రీలను, అణిమాద్యష్ట సిద్ధులను, చింతామణి కల్పవృక్ష కామధేన్వాదులను బంపి, వారిని లోభింపఁజేసి కొన్ని వరంబులొసంగి తనకు లోఁబడునట్లు చేసికొనుచుండు. తానంపిన యప్సరస్త్రీలకు నష్టసిద్ధులకు, మాయలకుఁ లోఁబడని వారినిఁజూచి స్పర్థఁబెట్టుకొని, పెక్కుమాయారూపములచే విఘ్నములుఁ గావించుచు, కష్టపెట్టుచుండును. తనశక్తికి మించినచో, బ్రహ్మదేవుని యొద్దకును, శ్రీమహావిష్ణువునొద్దకును బోయి, తన్ననుగ్రహింప సాహాయ్యముఁ గావింపఁ వేడుచుండును. ధ్రువుఁడు తపంబుసేయుచుండ, విఘ్నమునకై యామాఖ్య దేవతలను, భయంకరులగు కుంభాండాది దేవతలనుఁ బంపె. కండుమహర్షి తపోభంగమునకు, ప్రమ్లోచయను నప్సరసను, విశ్వామిత్రుని తపస్సునకు మేనకను, ఇట్లు పెక్కండ్ర తపస్సులకు విఘ్నమాచరింప నప్సరస్త్రీలనుఁ బంపుచుండెను. ఒకప్పుడు నారాయణమహర్షి తపస్సు సలుపుచుండ, భగ్నమునకై వసంతమన్మథులను తత్పరివారమును, అప్సరసలనుఁ బంపఁగఁజూచి వారలాశ్చర్యపడునట్లు, తన యూరువులోనుండి (తొడ) మహాసౌందర్యవతియగు నొక నారీరత్నమును సృజింప, నామె సౌందర్య మందఱికన్న నతిశయించియుండ వారలు సిగ్గుపడి, పోయి యావృత్తాంతము నింద్రునకు నివేదించిరి. అంత నింద్రుఁడువచ్చి యామహనీయుని శ్రీహరిరూపముగఁ దెలిసికొని స్తుతించి, తన్ను క్షమింపుమని వేడి, యానారీరత్నమును, దేవలోకమునకంత నలంకారభూతముగ నుండునట్లు, తనకొసంగుఁడని ప్రార్థింపగ నామెనిచ్చెను. ఊరువునందు జనించుటంజేసి,

టము. పరమపురుషుని నశ్వమేధయజ్ఞముచే నారాధించితివేని పునీతుండ వగుదువని బ్రహ్మర్షులు నుడివిరి. విశ్వరూపునివధించిన బ్రహ్మహత్యాదోషమును భూమ్యంబు తరు వనితలు గైకొనినందున పునీతుండవైతివి. ఈదోషము నెట్లుపోఁగొట్టుకొనియెద నని చింతించుచుండెను. ఇట్లుండ బ్రహ్మహత్యాదోషము, చండాలస్వరూపిణియు, జరావేపమానాంగియు, దుర్గంధవతియునై యింద్రు నాశ్రయించెను. బ్రహ్మహత్యా దోషగ్రస్తుడు తేజోవిహీనుఁడగువాఁడు రాజ్యమును బాలింప ననర్హుఁడని బ్రహ్మర్షులు నిర్ణయించుటకుమున్నే రాజ్యాంగసంబంధమును వదలుకొని యెచ్చటికిఁబోయినను వసింపవీలు లేక, ప్రాగుదీచీదిశను మానససరస్సునందుఁ బుష్కరనాళతంతువుల నాశ్రయించి వేయిసంవత్సరములు దాఁగికొనెను, మిత్రుఁడగు నగ్నిదేవుఁడు హవిర్భాగముల నందింప నవకాశము లేని జలములయందు డాఁగియుండె. ఎంతవానికిని విధికృతము తప్పింపనలవికాదు. ఇంద్రుఁడు లేని కాలమందు నహుషు నింద్రునిగాఁ జేసిరి. ఈవృత్తాంతము మఱియొక సందర్భమున విశదీకరింపఁబడును. ఇట్లు వేయిసంవత్సరములు డాఁగినంత బ్రహ్మర్షులు పాపముపశమించినది రమ్మని యానతీయ, ప్రాగుదీచీదిశనుండివచ్చుచుండ నచ్చటనుండిన దిగ్దేవతయగు విష్ణుశక్తిచే బ్రహ్మహత్య వారింపఁబడెను. అంతమహర్షులు ఇంద్రునిచే నశ్వమేధయాగముచేయించి పరమపురుషు నారాధించిరి. శ్రీ యజ్ఞేశ్వరుఁడగు హర్యనుగ్రహముచే నపహతకల్మషుఁడై తేజోబలసంపన్నుఁడై మఱల త్రైలోక్య రాజ్యలక్ష్మియగు నింద్రపదవి నధిష్ఠించెను. కాఁబట్టి మొట్టమొదటఁగావించిన గురుతిరస్కారమువలన నిన్నియిక్కట్టులు గలిగినవి శ్రీజగదీశ్వరుఁడగు నారాయణునియనుగ్రహము ఇంద్రునిపై నున్నందునను, ఆయన యంశయే యింద్రుఁడైనందునను పెక్కుచిక్కులు గలిగినను, మఱల తన రాజ్యపదవిని గ్రహించుచుండెను. ఇప్పుడు ప్రభుత్వములోఁగూడ, గొప్పప్రభుత్వాధికారి పొరబాటుజేసినను, దోషమాచరించినను, ప్రభుత్వవారు పక్షీకరించి Departmental Partiality తమయధికారి యొనరించి పని సాధువేయని సమర్థించి లోకమునఁ బ్రకటింతురు,

పుండరీకాక్షుండు, శరణాగతులగు నింద్రాదుల స్తుతుల నాలకించి ప్రసన్నుండై, దధీచిమహర్షి యస్థులనుఁ బ్రార్థించి తెచ్చిన విశ్వకర్మ వజ్రాయుధముఁ గావించు నందు మదీయ తేజస్సు నుంచెద. మదీయ తేజోపబృంహితమగు వజ్రాయుధముచే త్రిలోకభయంకరుఁడగు వృత్రాసురునివధించి, నిర్భయులై స్వర్లోక రాజ్యమును సుఖముగఁ బాలించుకొండని యానతిచ్చి యంతర్ధానుం డయ్యె. నిఖిల జగదుపకారకమని దధీచి మహర్షి యోగబలము నాశ్రయించి యస్థులనొసంగ విశ్వకర్మ వజ్రాయుధమును నిర్మించెను. ఇంద్రుఁ డైరావతము నధిరోహించి, వజ్రాయుధోపేతుఁడై దేవతాగణములతోఁ గూడి యుద్ధమునకై వృత్రాసురు నెదుర్కొనగా, దేవాసురులకు నర్మదాతీరమునందుఁ బ్రథమమహాయుగీయత్రేతాయుగమునందు,మహాయుద్ధము ప్రారంభమయ్యె. ఇంద్రవృత్రుల యుద్ధముమహాఘోరంబుగ నుండె. వృత్రుఁడు త్రిశూలముతోఁ గొట్టగ, వజ్రాయుధము చేతినుండిపడెను. పిమ్మట నింద్రుఁడు లజ్జితుడై వజ్రాయుధముఁ జేకొని, కుడిచేతిని, యెడమచేతిని వృక్షశాఖలు నరికినట్లు నరికెను. అట్లు ఛిన్నుఁడై నను వృత్రుఁడు ధీరుఁడై,ఇంద్రా! నన్నుఛేదింపుము. నేనుమృత్యువునకు భయపడను. జాతునకు మృత్యువు సిద్ధము, నీవు భగవత్ప్రేరితుఁడవై నన్ను, వజ్రముచేఁ జంపఁ బూనుకొంటివి. నేను శ్రీహరిని శరణుజొచ్చెదను. కామాది క్షుద్రసుఖముల నేఁగోరను. స్వర్గాది సుఖములకై గురువునుఁ బురోహితుని బ్రహ్మిష్ఠుని నీవు చంపితివి. ద్రోహివి ధర్మయుద్ధము నాతోడఁ గావింపుము. నేను శ్రీహరిపదవిఁ బొందెదనని జెప్పుచు, యుద్ధముఁ జేసి యింద్రునిచే హతుఁడై ప్రాణములను విడిచెను.

## రాజ్యసంరక్షణకొఱకు యుద్ధవధాదులు తప్పవు.

లోకభయంకరుఁడగు వృత్రాసురుఁడు హతుఁడై నంత దేవర్షి సిద్ధ సాధ్య మరుద్గణములు హర్షించెనుగాని, ఇంద్రుఁడు బ్రహ్మహత్యాదోష సంకోచముచే బ్రాహ్మణవధకు సంతోషింపఁడయ్యె. జగత్కల్యాణము కొఱకు సురసంరక్షణకొఱకు వృత్రాసురునిఁ జంపినందున దోషము నీకం

దేవతల బాధించుచుండిరి. సురలతోఁగూడి యింద్రుఁడు బ్రహ్మదేవుని దగ్గరకుఁబోయి తమకు వాటిల్లిన విపత్తు విన్నవించుకొనఁగ, బ్రహ్మణ్యమూర్తియు, బ్రహ్మవిద్వరిష్ఠుండును, మహావిష్ణుభక్తుండు నగు నాచార్య బృహస్పతిని నవమానించినందున, రాక్షసులబాధకలిగెను. ఇయ్యది మీదుష్కృతమునకు ఫల మనుభవింపకతప్పదు. అయినను త్వష్టృప్రజాపతి పుత్త్రుఁడగు విశ్వరూపుని నాచార్యునిగా వరించిన మీకుండు క్లేశములు తొలఁగునని విరించి నుడువగా నింద్రుఁడు దేవతలతోడ విశ్వరూపు నాశ్రమమునకుఁబోయి మా కాచార్యుండవు పురోహితుండవు కమ్మని ప్రార్థింపఁగఁ బౌరోహిత్యమువలన దోషముగలుగును. ఐశ్వర్యవంతుల నాశ్రయించుటచేఁ బెక్కుచిక్కులు కలిగినను, మీబోంట్లిలోకపాలకులు మహనీయులు ప్రార్థించినపుడు వ్యర్థముఁగావింపఁ గూడదని యెట్టకేలకు సమ్మతించి, తనతపోమహిమచేతను, వైష్ణవవిద్యాప్రభావముచేతను, రాక్షససైన్యము ను నశింపఁజేసి వారిచేతఁ జిక్కిన మహేంద్రసంపదనుఁ దీసి యింద్రునకొసంగగా, మహానుభావ! విశ్వరూప! ఈవిద్యారహస్యము నుపదేశింపుమని ప్రార్థింపగ, నారాయణ కవచ మహామంత్రము నుపదేశించెను. దానంగోలె నింద్రుఁడుయుద్ధమున రాక్షసులజయించి యవ్యాహతబలుండై త్రైలోక్యరాజ్య లక్ష్మిని నిశ్చింతగ ననుభవించుచుండెను.

## విశ్వరూపవధ-బ్రహ్మహత్యాదోషము.

విశ్వరూపునకు, సోమపానము, సురాపానము, అన్నాదము ననిమూఁడు శిరస్సులుగలవు. ఒకానొకప్పుడు విశ్వరూపుఁడాధ్వర్యముఁ జేయుచు నింద్రాగ్న్యాదిదేవతలకు హవిర్భాగముల ప్రత్యక్షముగనిచ్చుచు, మాతృభక్తివశుఁడై మేనమామలగు నసురులకుఁ బరోక్షముగ నొసంగుచుండ సీవంచనకృత్యమునుఁ జూచి యోర్వఁజాలక, రాక్షసులకుఁ బుష్టికలుగునని భయపడి యింద్రుఁడు కుపితుఁడై వజ్రాయుధముచే విశ్వరూపుని త్రిశిరస్సులను ఛేదించెను అందొకటి కపింజలపక్షియు, మఱియొకటి కలవింకపక్షియు, వేఱొకటి తిత్తిరిపక్షియు నయ్యె. నారాయణకవచము

సంచయముతోడ దహించివైచునని పైఁ జెప్పఁబడిన మనుస్మృతియందుఁ గలదు. ఎల్లప్రజలను, తనబిడ్డలవలెఁ బాలించవలసిన, రాజు (రాజప్రతినిధి) శాసనసభకు సభ్యులకును, మంత్రిమండలికిని విరుద్ధముగఁ బ్రవర్తించి, యధర్మమునకు లోఁబడి, యన్యాయ ప్రవర్తకుఁడై ప్రజాద్రోహముఁ గావించెనేని నంతకన్న నధికులగు ధర్మపాలక ప్రభువులలో భాగవంతులు ప్రవేశించి, యా యధర్మ ప్రవర్తకుని పదభ్రంశంబుఁ గావించి, (Impeachment) ప్రత్యేకసభయం దాతని చరిత్రమును విమర్శించి దండించునట్లు, ఇంద్రునిపాలన చరిత్రమందును నచ్చటచ్చటఁ గాన్పించుచున్నయది. ఇంద్రుఁడు మహనీయుఁడయ్యుఁ బ్రకృతివాసనచేఁ బరోత్కర్షాసహిష్ణుత్వము, నసూయయు, స్వాతిశయము, నైశ్వర్య గర్వములోనగునవి యొకానొకప్పుడు గలిగి యుండుటచే గర్వభంగము, పదభ్రంశమునొందుచుండెను. పూర్వ మొకానొకప్పు డింద్రుఁడు, వసురుద్రాదిత్యాదిగణములతోడను, సిద్ధసాధ్య మరుద్గణముల తోడను, మహర్షులతోడను, పరివేష్టితుఁడై నిండుకొలువుండి, శచీదేవితోఁ గూడి, గంధర్వ కిన్నర కింపురుషాదులచే గొనియాడఁబడుచు, నైశ్వర్య మదమత్తుఁడై సభలోనికి విచ్చేయుచుండును.

### గురుతిరస్కారమువలన నింద్రునకుఁ గష్టములు.

సురాచార్యుఁడగు బృహస్పతిని నభ్యుత్థానాది సత్కారములచే నెదుర్కొని సత్కరింపక యుపేక్షించెను. సింహాసనమునుండి లేచి సత్కరింపనందున నవమానితుఁడయిన బృహస్పతి గృహమునకు విచ్చేసి నైశ్వర్యమదమత్తుఁడైన యింద్రునిచేష్టితమునుఁ దలపోయుచుండెను. అంతట నింద్రుఁడు, పొరబాటుజరిగినదని తెలివిఁ దెచ్చుకొని, యాచార్యుని పాదములనాశ్రయించి, బ్రతిమాలికొనివచ్చెదనని బృహస్పతి భవనమునకురాగా నట్టి గురుధిక్కారున కగపడఁగూడదని యోగమాయచే, గురుఁ డదృశ్యుఁడై యుండె. అంతనింద్రుఁడు బృహస్పతిసందర్శనము లభింపక మిక్కిలి చింతిల్లి దేవతలఁ గూడి విచారపడుచుండ నీసంగతి రాక్షసులు తెలిసికొని శుక్రాచార్యుని నీత్యుపదేశములచే శస్త్రాస్త్రములఁ బ్రయోగించి

ఢిల్లీమహాపట్టణమందున రాజప్రతినిధి భారతశాసనమహాసభయందు గాయా రాష్ట్రపాలకులతోడను, దేశీయప్రజాప్రతినిధులతోడను, సంస్థాధిపులతో [illegible] కార్యనిర్వాహక సభ్యులతోడను, మంత్రివర్గముతోడను, అధి[illegible] సభ్యులతోడనుగూడి, భారతసామ్రాజ్యాధికారమును [illegible] భవముతో నేలుచు శాసనములఁగావించి ప్రజాపరిపాలన [illegible] చున్నట్లు ఇంద్రుఁడును మహదైశ్వర్యముతోఁ త్రైలోక్యమునుఁ బాలించుచుండును. లోకపాలకుల యంశముండుటంబట్టియే దండశాసనములచేఁ బ్రజాపాలనముఁ గావించుచు రాజు (రాజప్రతినిధి) దుర్నిరీక్ష్యుఁడగుచుండినటుల మనుస్మృతియందుఁ గలదు.

## నృపాలునకు దేవాంశత్వము.

శ్లో. ఇంద్రానిలయమార్కాణా మగ్నేశ్చ వరుణస్యచ।
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రానిర్హృత్య శాశ్వతీః॥
శ్లో. యస్మాదేషాం సురేంద్రాణాం మాత్రాభ్యోనిర్మితో నృపః।
తస్మాదభి భవత్యేష సర్వభూతాని తేజసా॥
తపత్యాదిత్య వచ్చైష చక్షూంషిచ మనాంసిచ।
నచైనం భువి శక్నోతి కశ్చి దప్యభివీక్షితుం॥
ఏక ఏవ దహత్యగ్ని ర్నరం దురుపసర్పిణం।
కులందహతి రాజాగ్నిః సపశుద్రవ్యసంచయమ్॥

మనుస్మృతి ౭ అధ్యాయే.

అష్టదిక్పాలకుల కళలతోఁ (అంశల) నరేశ్వరుని భగవంతుఁడు, ప్రజాసంరక్షణము కొఱకు నిర్మించుటంజేసి, యెల్లప్రజలను తన తేజస్సుచే నణఁచివైచి, సర్వాధికుఁ డగుచున్నవాఁడు. సూర్యునివలెఁ దన తేజస్సుచే నేత్రములనుఁ మనస్సును తపింపఁజేయుచు నొరులచేఁ జూడ నశక్యుఁడగుచున్నవాఁడు. దుష్కార్యము నొనరించిన మనుజునొక్కనే యగ్ని దహించునుగాని, రాజుయొక్కకోపాగ్ని, శాసనోల్లంఘన ద్రోహాది దుష్కార్యములఁ జేసిన వానికుటుంబమును, గృహవస్తు వాహనాది ధన

చుండును ఎల్లప్రాణులజీవనమున కాధారమయిన జలము, వృష్టివలనఁగలు గును అట్టి వృష్టి మేఘములవలనఁగలుగు. నట్టి మేఘములన్నియు నింద్రుని స్వాధీనములోనుండును ఇంద్రుఁడు వర్షింపకున్నచో క్షామబాధచే లోకమునకుహానికలుగు. కాబట్టి ఇంద్రునియందుగొప్పయధికారమున్నది. కోపించినచోఁ బాషాణప్రచండ వాతోపేత వృష్టిని గురిపించి నశింపఁ జేయును. ఆయాకామములతో యజ్ఞములనొనరించినవారికిఁ గర్తానుగు ణ్యముగ స్వర్గలోక సౌఖ్యముల నొసంగును. ఆంగీరసపుత్త్రుఁడగు బృహస్పతి ఇంద్రునికి మంత్రియుఁ బురోహితుండునై రాక్షసులవలన బాధకలుగ కుండ నీత్యుపాయముల నుపదేశించుచుండును. దేవతలరాజ్యమునుఁ గాపాడు బాధ్యత యెక్కువగ బృహస్పతిమీదనుండును గాఁబట్టియే సురా చార్యుఁడనియు నింద్రపూజ్యుఁడనియుఁ బిలువఁబడి నీతిశాస్త్రము (బార్హ స్పత్యనీతిశాస్త్రము) నొనరించి యాశ్రితులకు బోధించుచుండును

దేవతలలో బృహస్పతికి గొప్ప గౌరవస్థానమును, మండలమును గల దు. ఆయనపేరిటి యజ్ఞమునకు బృహస్పతి సవనమనియుఁ బేరుకలదు. ము న్ముందు బృహస్పతి మండలమును వివరించునపుడు విశేష విషయములు విస్తరింపఁబడును. ఇంద్రుఁడు ప్రాగ్దిశకధిపతి, లోకపాలకులలో నొక్కఁ డయినను, దేవలోకముల కంతటి కధీశ్వరుఁ డగుటం జేసి, లోకపాలకులలో శ్రేష్ఠుఁడనియు వారికి బ్రభువనియుఁ జెప్పఁబడును. ప్రభుత్వమున రాష్ట్ర పాలకు (గవర్నరు) లందఱిలో రాజప్రతినిధి (గవర్నరు జనరలు) శ్రేష్ఠుఁ డై వారికధీశ్వరుఁడై నట్టుల, యమాగ్నికుబేరాదులకన్న నధికుఁడును, వారిని లోఁబఱచుకొని పాలించువాఁడు నగును. లోకపాలకులందఱు నింద్రు ననుమతిపై మెలఁగవలయు. ఇంద్రునిసభకు లోకపాలకు లప్పుడప్పు డువచ్చి, యింద్రుని సందర్శించి యావశ్యకములయిన కార్యముల నెఱవేర్చు కొనుచుందురు. ఇవ్విషయము, మహాభారత సభాపర్వమున లోకపాలక సభావర్ణనమందు విశదీకృతము. ఇంద్రునిపట్టణము అమరావతి. భార్య ఇంద్రాణి (శచీదేవి), జయంతుఁడు పుత్త్రుఁడును, జయంతియును పుత్త్రికయు, ఐరావతమను యేనుఁగు వాహనము. ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱము వజ్రా యుధమా యుధము సుధర్మయను దేవసభ బృహస్పతి మంత్రి, దేవగణా ములు కార్య నిర్వాహకులు. ఇట్టి పరిజనముతోఁ గూడికొని త్రైలోక్య రాజ్యమును, స్వర్గలోకమునందుండియే యింద్రుఁడుపరిపాలించుచుండును.

సేయుటచే, ప్రాచీనబర్హియను నామమును బడసెను. ప్రాచీన బర్హికి శత ధృతియందు ప్రచేతస్సులను పదుగురుసుతులు జనించిరి. వీరు తపస్సంపన్నులును, యోగులును, భాగవతోత్తములునైరి. ప్రాచీనబర్హిపుత్త్రులగు ప్రచేతస్సులు అనేకవేల సంవత్సరములు సముద్రములోపలఁ దపంబొనరించి, వెలికివచ్చి వృక్షలతావృతమగు వసుధను గాంచి కోపించి దహించుచుండ, వారించి కండుమహర్షివలన ప్రమ్లోచకుఁ గలిగి వన దేవతలచేతను సోముని చేతను రక్షింపఁబడిన మారిషాభిధాన (వార్క్షి) కన్యకనుఁ బరిణయమాడ బ్రహ్మదేవుఁడు నియోగింపఁ బడువారు ప్రచేతస్సులును, ఆవార్క్షి కన్యను స్వీకరించిరి. తొల్లి రుద్రుని దూషించుటచే, దక్షప్రజాపతి ప్రచేతస్సులకు వార్క్షియందుఁ బుట్టటంజేసి ప్రాచేతసుఁ డనంబరఁగె. పూర్వజన్మజ్ఞానముచేతను భగవదాదేశముచేతను, చాక్షుష మన్వంతరమునందుసృష్టింపఁ బ్రారంభించి యనేక ప్రజాసర్గములఁ గావించెను.

ఈమన్వంతర మంతమగునంతకు బూర్వోక్త ప్రియవ్రతోత్తానపాద పుత్త్రులును, పౌత్త్రులును తద్వంశీయులెల్లను భూపరిపాలనముఁ గావింతురు. భూమండలమును, ద్వీపవర్ష ఖండములుగా విభజించి యాయా రాజవరేణ్యులనామములతో వెలయునట్లుజేసి యజ్ఞాదికర్మల నొనరించి దేవతల సంతుష్టిఁగావించి వారియనుగ్రహముఁ బడయుదురు.

ఇయ్యది స్వాయంభువ వంశము.

---

## ఇంద్రలక్షణ స్వభావగుణధర్మములు.

ఇంద్రశబ్దము, ఆధికారికపదవికాని యతని నామధేయముకాదు. ప్రతిమన్వంతర మొక్కొకయింద్రుఁడు మారుచుండును. వారినామములు ముస్ముందుఁ జెప్పఁబడును. లోకపాలకులచేతను వసురుద్రాదిత్యాది దేవగణములచేతను సప్తర్షులచేతనుఁ బరివేష్టితుఁడై గంధర్వకిన్నర కింపురుషాదులచే గొనియాడబడుచు మహదైశ్వర్యసంపన్నుఁడై భగవద్దత్తమగు త్రైలోక్య రాజ్యలక్ష్మి ననుభవించుచుండును. భూలోకమునఁ గావింపఁబడు నధ్వరముల కాహ్వాతుఁడై, దేవగణములతోఁగూడి హవిర్భాగముల ననుభవించుచు సకలప్రాణుల కాధారమగు వర్షమును సమయమునఁ గురియించుచు నోషధీసస్యాదుల నభివృద్ధిఁజేసి ప్రజలఁబోషించు

ష్ణుఁడు, చంద్రకేతుఁడు, ఇషుఁడు, ఊర్జుఁడు, వసుఁడు, జయుఁడునను పుత్త్రులు గలిగిరి. అందుపుష్పార్ణునకు ప్రభయందు, ప్రాతః, మధ్యందిన, సాయంతన నామసుతులును, దోషయందు, ప్రదోష, నిశీథ, వ్యుష్టినామకపుత్త్రులును గలిగిరి. వ్యుష్టికి పుష్కరిణియందు సర్వతేజుఁడును, సర్వతేజునకు ఆకూతియందు చక్షువను మనువుజన్మించె (ఈమనువు ఆఱవవాఁడు) చక్షువుకు నడ్వలయందు. పురుఁడు, కుత్సుఁడు, త్రితుఁడు, ద్యుమ్నుఁడు, సత్యవంతుఁడు, ఋతుఁడు, వ్రతుఁడు, అగ్నిష్టోముఁడు, అతిరాత్రుఁడు, సుద్యుమ్నుఁడు, శిబి, ఉల్ముకుఁడు నను పన్నిద్దఱుపుత్త్రులు జనించిరి. ఉల్ముకునకు పుష్కరిణియందు, అంగుఁడు, సుమనసుఁడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుఁడు, గయుఁడు నను నాల్గుగురు పుత్త్రులుగలిగిరి. అంగుఁడు సునీథవలన వేనుఁడను మిగుల దుర్వృత్తుఁడగు పుత్త్రునిఁబడసెను వేనుఁడు, మహర్షులను, శ్రీహరిరూపములగు యజ్ఞకర్మలను దూషించి మిగుల దుర్వృత్తుఁడైనందున మహర్షులువానిని హుంకారముచే శపించి పరిమార్చిరి. మృతుఁడగు వేనునికళేబరము నతనితల్లియగు సునీథ కాపాడుచుండగ, నరాజకమగు రాజ్యమునం దుత్పాతములు, విపత్తులు వాటిల్లునని దయార్ద్రహృదయులగు మునీశ్వరులు, వేనుని యూరువును మథించగా, వికారరూపుఁడగు నిషాదుఁడు జన్మించెను. ఈతఁడు రాజ్యమునకనర్హుఁడని మఱల వేనుని బాహువుల మథించగా, నచట శ్రీహర్యంశమున సతీపతులు జన్మించి ప్రఖ్యాతిఁజెందినరాజర్షి యగుపృథుచక్రవర్తియు, అర్చిర్నామకయగు తత్పట్టమహిషయు ననవెలసిరి. పృథుచక్రవర్తి భగవదంశమువలన జనించినందున, భూమినిఁజక్కఁగఁ బరిపాలింపఁ గలఁడని దేవతలు, ఋషులు తలఁచిరి. పృథుచక్రవర్తికి అర్చిస్సువలన, విజితాశ్వుఁడు. ధూమ్రకేశుఁడు, హర్యశ్వుఁడు ద్రవిణుఁడు వృకుఁడను నేవురుపుత్త్రులు జనించిరి. హర్యశ్వునకు ప్రాగ్దిశయు ధూమ్రకేశునకుదక్షిణదిశయు. వృకునకు ప్రతీచియు. ద్రవిణునకు నుదీచియు నిట్లు నలువురకు నాలుగు దిశలొసంగెను విజితాశ్వునకు (అంతర్ధానునకు) శిఖండినియందు, పావకుఁడు, పవమానుఁడు, శుచియునను నగ్నినామక పుత్త్రులును, నభస్వతియందు హవిర్ధానుఁడను పుత్త్రుఁడను గలిగెను. హవిర్ధానునకు పత్నియందు, బర్హిష్మంతుఁడు, గయుఁడు, శుక్లుఁడు, కృష్ణుఁడు, సత్యుఁడు, జితవ్రతుఁడు, ననుపుత్త్రులు కలిగిరి. బర్హిష్మంతుఁడు ఎల్లెడల నధ్వరములు

కీకటులను వారాయా దేశాధిపతు లయిరి. తక్కిన ౮౧ ఉను గృహస్థాశ్రమనిరతులును కర్మిష్ఠులును నగు బ్రాహ్మణు లయిరి.

భరతునకు, విశ్వరూపపుత్రికయగు పంచజనివలన సుమతి, రాష్ట్రభృత్తు, సుదర్శన, ఆవరణ, ధూమ్రకేతువను నైదుగురుపుత్రులును వృద్ధసేనయందు, దేవతాజిత్తనుపుత్రుడునుగలిగిరి. దేవతాజిత్తునకు నాసురియందు దేవద్యుమ్నుడును, దేవద్యుమ్నునకు ధేనుమతియందు పరమేష్ఠియు, పరమేష్ఠికి సువర్చలయందు, ప్రతీహుడును, ప్రతిహర్తయు, ప్రస్తోతయు, ఉద్గాతయును అను పుత్రులుగలిగిరి అందు ప్రతీహుడు బ్రహ్మవేత్తయయ్యె. ప్రతిహర్తకు స్తుతియందు అజుడు, భూముడును, భూమునకు ఋషికుల్యయందు ఉద్గీథుడును, ఉద్గీథునకు దేవకుల్యయందు ప్రస్తావుడును, ప్రస్తావునకు వికుత్సయందు విభుడును, విభునకు భారతియందు పృథుషేణుడును, పృథుషేణునకు ఆకూతియందు నక్తుడును, నక్తునకు ధృతియందు గయుడు (మహాభాగవతోత్తముడు) గయునకు జయంతియందు చిత్రరథ, స్వాతి, అవరోధనులును, చిత్రరథునకు ఊర్ణయందు సమ్రాట్టును సమ్రాట్టునకు ఉత్కలయందు మరీచియు, మరీచికి బిందుమతియందు బిందుమంతుడు, బిందుమంతునకు సుషేణయందు మధువును, మధువునకు సుమనసియందు వీరవ్రతుడును, వీరవ్రతునకు ప్రబోధయందు మధుప్రమథులును, మధువునకు సత్యయందు భౌమనుడును, భౌమనునకు దూషణయందు త్వష్టయు, త్వష్టకు విరోచనయందు విరజుడును, విరజునకు విషూచియందు శతజిన్ముఖాది శతపుత్రులును, ఒక కన్యకయును గలిగిరి.

## ధ్రువవంశము.

స్వాయంభువమనువు ద్వితీయపుత్రుడగు ఉత్తానపాదునకు సురుచివలన ఉత్తముడును, సునీతివలన ధ్రువుడును గలిగిరి. ఉత్తముడు వివాహముకాకమునుపే యక్షులచే జంపబడెను. ధ్రువునకు శింశుమారపుత్రికయగు భ్రమివలన, కల్పవత్సరులను నిరువురుపుత్రులును, వాయుపుత్రికయగు ఇలవలన, ఉత్కలుడను కుమారుడును, ఒకకుమార్తెయు గలిగిరి. ఉత్కలుడు జడుడును యోగియు నున్మత్తుడు నైనందున రాజ్యమున కనర్హుడయ్యెను. భ్రమిసుతుడగు వత్సరునకు సర్వార్థివలన బహు

## స్వాయంభువ పుత్రుఁడగు ప్రియవ్రతుని వంశము.

ప్రియవ్రతుఁడు, విశ్వకర్మ పుత్రికయగు బర్హిష్మతివలన, ఆగ్నీధ్రి, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీర, హిరణ్యరేతస్, ఘృతపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవి, నామకులగు పదుగురుపుత్రులను, ఊర్జస్వతి యనుకన్యకనుఁ బడసెను (ఆపదుగురు పుత్రులు, అగ్నినామకులు) శుక్రుఁడుఊర్జస్వతివలన దేవయానినామకకన్యకనుగనెను అదియునుంగాక, ప్రియవ్రతుఁడు, తృతీయ చతుర్థ మన్వంతరాధిపతులగు, ఉత్తమ, తామసులను పుత్రులనుఁ గాంచెను.

ప్రియవ్రత పుత్రులు పదుగురులో, మహావీర, సవన, కవులను మువ్వురు ఊర్ధ్వరేతస్కులును, పరమహంసలు నయిరి. తక్కిన యేడుగురు, ఏడుదీవులకు, ద్వీపాధిపతులయిరి. అదెట్లనిన:— ఆగ్నీధ్రుఁడు జంబూద్వీపమునకును, ఇధ్మజిహ్వుఁడు ప్లక్షద్వీపమునకును, యజ్ఞబాహువు శాల్మలి ద్వీపమునకును, హిరణ్యరేతస్సు కుశద్వీపమునకును, ఘృతపృష్ఠుఁడు క్రౌంచ ద్వీపమునకును, మేధాతిథి శాకద్వీపమునకును, వీతిహోత్రుఁడు పుష్కరద్వీపమునకును అధిపతులయిరి. అందు జ్యేష్ఠుఁడగుఁ ఆగ్నీధ్రునకు, పూర్వచిత్తియను నప్సరసవలన, నాభి, కింపురుష హారివర్ష, ఇలావృత, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాలులు అను పుత్రులుగలిగి నవవర్షాధిపతులై, మేరుపుత్రికలగు, మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్రి, లతా, రమ్యా, శ్యామా, నారీ, భద్రా, దేవవీతి యనువారలను క్రమముగా, భార్యలుగ గ్రహించిరి. అందు అజనాభవర్షాధిపతియగు నాభికి మేరుదేవివలన, భగవదవతారమగు ఋషభదేవుఁడు జనించెను. ఋషభదేవునకు, ఇంద్రదత్తయగు జయంతివలన, నూర్గురుపుత్రులు గలిగిరి. అందు ప్రథమ దశకమందు జ్యేష్ఠుఁడగు భరతుఁడు మహాయోగియు, కర్మజ్ఞాననిష్ఠుఁడాయె. ఆయన పేరుచేతనే భరతఖండమనఁ బరఁగె. తక్కిన తొమ్మండ్రు, కవి హరి, అంతరిక్ష, ప్రబుద్ధ పిప్పలాయన, అవిర్హోత్ర, ద్రమిడ, చమస, కరభాజనులను. వీరలు, మహాభాగవతులును, జ్ఞాననిష్ఠులును, యోగులునైరి. వీరిచరిత్రము శ్రీభాగవతము ఏకాదశస్కంధమున విపులముగఁ గలదు తక్కిన తొంబదిమందిలో ద్వితీయాది దశకములలోఁ బ్రధానులగు, కుశావర్త, ఇలావర్త, బ్రహ్మావర్త, ఆర్యావర్త, మలయకేతు, భద్రసేన, ఇంద్రస్పృక్, విదర

పుత్త్రులను, ఆకూతి, దేవహూతి, ప్రసూతియను ముగ్గురు పుత్త్రికలనుబడ సెనట్లిదివఱలోఁ జెప్పఁబడెను. ఈప్రథమమనువు, ధర్మిష్ఠులలో శ్రేష్ఠుఁడు ను, మనువులలో గొప్పవాఁడును, వారలకు ప్రభువును, శంకరశిష్యుఁడును, విష్ణువ్రత పరాయణుఁడును, మహాజ్ఞానియునై, జీవన్ముక్తుఁడై, శ్రీకృష్ణ దాస్యముచే గోలోకమునుఁ బొందెనని బ్రహ్మవైవర్త పురాణప్రకృతి ఖండనమునఁ జెప్పఁబడెను.

స్వాయంభువ మన్వంతరమున,
షడ్విధ ప్రభుత్వాధి కారములు.

౧. మనువు—స్వాయంభువుఁడు (బ్రహ్మపుత్త్రుఁడు)
౨. ఇంద్రుఁడు—యజ్ఞుఁడు (విశ్వభుక్ నామాంతరము)
౩. దేవగణములు—యామాఖ్య తుషితనామక దేవతలు,పన్నిద్దఱు:— తోష,ప్రతోష, సంతోష, భద్ర, శాంతి, ఇడస్పతి ఇధ్మ, కవి, విభు,వహ్ని, సుదేవ, రోచనులు. (యజ్ఞ+దక్షిణలకుఁ గలిగినవారలు)
౪. ఋషులు—మరీచి, అత్రి,ఆంగిరస, పులస్త్య, పులహ, క్రతు,వసిష్ఠులు, వీరు సప్తర్షిగణము.
౫. అవతారము—శ్రీహరి యజ్ఞావతారము.
౬. మనుపుత్త్రులు—ప్రియవ్రత, ఉత్తానపాదులు,తద్వంశీయులుఈమన్వం తరమంతయు, రాజులై భూపరిపాలనముఁ గావింతురు. ఆగ్నీధ్ర, అగ్నిబాహు, రిష్వ, సబల, జ్యోతిష్మాన్, ద్యుతిమాన్, హవ్య, మేధా, మేధాతిథి, వసునామకులు, తద్వంశవర్ధకులు.

శ్రీహరి, ప్రథమమన్వంతర మగు నీస్వాయంభువ మన్వంతరమున యజ్ఞావతారమునువహించి, యజ్ఞనామకఇంద్రుఁడును తానేఅయ్యెను. పైనిఁ జెప్పఁబడిన వారలు, వారివారి నియమితకృత్యములను యథోక్త ముగనిర్వహింతురు. రాజర్షులు తపస్సు నొనరించునపు డింద్రుఁడు, తన పరివారములోఁ జేరిన యామాఖ్య దేవతలను,కూష్మాండనామకోప దేవత లను, అప్సరసలనుఁ బంపి తపోవిఘ్నముఁ గావించుచుండినటుల, ఆయా గాథలయందుఁ దెలియుచున్నది. ధ్రువుఁడు తపస్సునలుపుచుండగా నతని తపోఽగ్నికిభయంపడి ఇంద్రుడు యామాఖ్య దేవతలవలన విఘ్నముఁగా వించినటుల శ్రీవిష్ణుపురాణమునందుఁగలదు ఆధికారికధర్మము బట్టి ఆ యాయింద్రాదులొనరించినకృత్యములు ప్రత్యేకముగముందు జెప్పబడును.

తా. ద్వాపరాంశశేషమందుఁ గలియుగప్రవేశము. ఇందొకపాలు ధర్మము నడచును. కొంతకాలమయినతర్వాత నదియు నశించి కేవల మధర్మమే ప్రవర్తించును. భగవంతుఁడుకృష్ణవర్ణ ధారిగనుండును. ప్రజలు క్షుద్వ్యాధిపీడితులు అసంతుష్టులు, దారిద్ర్యోపహతులు అనాచారవంతులు, డాంభికులు, రాగద్వేషాసూయాగ్రస్తులు, అల్పాయుష్మంతులు, ప్రమాణరహితులు, అన్యోన్యకలహములచేఁ గార్యవిఘాతుకులు మిత్ర రూపమున శత్రువులు, నిర్దయులై ప్రబలు లల్పులను బాధింతురు. ప్రాయికముగ రజస్తమోగుణభూయిష్ఠులు. దేశములు విపర్యయముఁజెందును. వర్ణాశ్రమ ధర్మములు క్రమముగక్షీణించును. రాజులు ధనపరాయణులై ప్రజలఁ బీడింతురు. అనావృష్టి భయముచేతను, అతివృష్టి భయముచేతను, దేశములు గ్రామములు బాధజెందుచుండును. ఈతిబాధలు మెండుగనుండును. బ్రహ్మచారులు వ్రతాచారహీనులు తపస్వులు గ్రామవాసులు భిక్షువులు కుటుంబవంతులు అల్పభాగ్యము బహుసంతానము కఠినభాషణవంతులుగనుందురు. విశ్వాసముఁగల భృత్యుని యజమానులును, యజమానుని భృత్యులును విడనాడుదురు. దేశమందలి ధనాఢ్యులను దస్యువులుపీడింతురు. స్త్రీలు స్వాతంత్ర్యవతులును, స్వేచ్ఛాచారపరాయణలును, భర్త్రాజ్ఞోల్లంఘినులును, పతిత్యాగినులును, కేశాలంకార ప్రియులు గనుందురు. జనులు పాషండమార్గముల నవలంబించి మోసపుచ్చి ధనమును గ్రహించి శిశ్నోదరపరాయణులుగనుందురు. ధర్మము, సత్యము, ఆచారము, ప్రమాణము క్రమముగక్షీణించినందున, సకలానర్థములు కలుగుచుండును. ప్రజాక్షోభము, దేశక్షోభము, క్షామము, భూకంపము, ఉల్కాపాతము, తుపానులు, ఆర్థిక క్లేశములు, ప్లేగు, (మారి) స్ఫోటకము, విషూచి లోనగువ్యాధులును ప్రాయికముగఁ గలుగుచుండును. ద్వాపరాంశసంధి కలియుగాది సంధియందుఁ గొంతవఱకు ధర్మము వేదశాస్త్రోక్తాచారములు నడచును. పోను పోను పూర్వోక్త కలిధర్మములు ప్రవర్తిల్లును. ఇంకను కలిమధ్యమందు కల్యంతమునందు జరుగఁబోవుధర్మములు విప్లవములు చిత్రములు మున్నగు వానిని నీలకంఠదీక్షితులవారు రచియించినకలివిడంబమునందును; శ్రీవిష్ణుపురాణ, శ్రీభాగవత, పాద్మ, గారుడ పురాణములయం దధికముగ వివరించియున్నారు. కావున నిచట దిఙ్మాత్రముగ సూచించినాఁడను.

కాలసంచోదితా స్తేఽపి పరివర్తంత ఆత్మని॥
ప్రభూతంచ యదా సత్త్వం మనో బుద్ధీంద్రియాణిచ।
తదా కృతయుగం విద్యా ద్దానే తపసి యద్రతిః॥
యదా కర్మసుకామ్యేషు శక్తి ర్యశసి దేహినాం।
తదా త్రేతా రజోవృత్తి రితి జానీహి శౌనక॥
యదాలోభ స్త్వసంతోషో మానో దంభోఽథ మత్సరః।
కర్మణాంచాఽపి కామ్యానాం ద్వాపరాంతం రజ స్తమః॥
యదా సదాఽనృతం తంద్రీ నిద్రాహింసాదిసాధనమ్।
శోక మోహ భయం దైన్యం సకలిస్తు తదాస్మృతః॥
యస్మిన్ జనాః కామినోఽపి శశ్వత్కటుక భాషిణః।
దస్యుత్కృష్టా జనపదా వేదాః పాషండదూషితాః॥
రాజానశ్చ ప్రజాభక్షాః శిశ్నోదరపరాద్విజాః।
అవ్రతా వటవో ఽశౌచా భిక్షవశ్చ కుటుంబినః।
తపస్వినో గ్రామవాసా న్యాసినో నిత్యలోలుపాః।
హ్రస్వకాయా మహాహారా శ్చౌర్యమాయోరుసాహసాః॥
త్యక్ష్యంతి భృత్యాశ్చ పతిం భృత్యం భర్తార ఏవచ।
శూద్రాః ప్రతిగ్రహీష్యంతి తపో వేషోపజీవినః॥
ఉద్విగ్నా శ్చానలంకారాః పిశాచసదృశాః ప్రజాః॥
అస్నాతభోజనేనాగ్ని దేవతాతిథి పూజనమ్।
కరిష్యంతి కలౌ ప్రాప్తే నచ పిండోదకక్రియామ్॥
స్త్రీపరాశ్చ జనాస్సర్వే శూద్రప్రాయాశ్చ శౌనక।
బహుప్రజాఽల్పభాగ్యాశ్చ భవిష్యంతి కలౌస్త్రియః॥
శిరఃకండూయనపరా ఆజ్ఞాం భేత్స్యంతి సత్పతేః।
విష్ణుం న పూజయిష్యంతి పాషండోపహతా జనాః॥
కలే ర్దోషనిధే ర్విప్ర అస్తి హ్యేకో మహాన్గుణః।
కీర్తనా దేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్॥
కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతః ఫలమ్।
ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్॥
తస్మాత్ జ్ఞేయో హరి ర్నిత్యం ధ్యేయః పూజ్యశ్చ శౌనక॥

ఇతి గారుడే-యుగధర్మాః-౨౨౭ అధ్యాయే.

లును భిన్నభిన్నములుగా నుందురు. రాజులు ధనలోభముచేఁ బ్రజలను దండింతురు. త్రికరణముల చేతను, వార్త (జీవనవృత్తి) లభించుట కష్టముగనుండును. లాభము సేవ వాణిజ్యము యుద్ధము లోనగునవి వృత్తులుగా నుండును.

సామాన్యముగ నప్పటి మానవాయుర్దాయము ద్విసహస్రవర్ష పరిమితిగ నుండును. ఇట్లు ధర్మము నశించి, వర్ణసంకరము గలిగి, వేదశాస్త్రములయందు, సందేహబుద్ధి, ద్వైవిధ్యము, విశ్వాసాభావముబొడమినప్పుడు, భగవంతుఁడు వేదవ్యాసరూపియై ద్వాపర సంధియందు, వేదముల విభజించి, ధర్మశాస్త్రపురాణేతిహాసముల రచియించి, లుప్తమగు ధర్మమునుఁ బ్రవర్తింపఁ జేయును. ఈయుగము తామ్రయుగమనియు, సందేహముఁ గలుగుటచే ద్వాపరయుగమనియుఁ జెప్పుదురు. ఇందలి జనులు, రుధిరగత ప్రాణులనఁగా, శరీరమునందు రక్తముండువఱకు బ్రాణముల ధరింతురు. యాచించువానికి దాన మొసంగుదురు.

ర. కలియుగ ధర్మములు.

శ్లో. ద్వాపరస్యాంశ శేషేతు ప్రతిపత్తిః కలే రథ।
హింసా స్తేయాఽనృతం మాయా వధశ్చైవ తపస్వినాం॥
ఏతే స్వభావా స్తిష్యస్య సాధయంతిచ తాః ప్రజాః।
ఏషధర్మ స్సమృతః కృతోఽన్ధ ధర్మశ్చ పరిహీయతే॥
మనసా కర్మణా వాచా వార్తా సిద్ధ్యతి వా నవా।
కలిప్రమాణకో రోగ స్సతతం చాపి క్షుద్భయం॥
అనావృష్టిభయంచైవ దేశానాం చ విపర్యయః॥
నప్రమాణస్థితి ర్హ్యస్తి తిష్యే ఘోరే యుగే కలౌ।
గర్భస్థో మ్రియతే కశ్చి ద్యౌవనస్థ స్తథా ఉపరః॥
స్థావరే వాద్యకౌమారే మ్రియంతే చ కలౌ ప్రజాః॥
అల్పతేజోబలం పాపా మహాకోపా హ్యధార్మికాః।
అనృతవ్రతలుబ్ధాశ్చ తిష్యే చైవ ప్రజాః స్థితాః॥
మాత్స్యే ౧౪౩ అధ్యాయే.

శ్లో. ఏకపాదస్థితే ధర్మేకృష్ణతాం చాచ్యుతేగతే।
జనా స్తదా దురాచారా భవిష్యంతిచ నిర్దయాః॥
సత్త్వం రజ స్తమ ఇతి దృశ్యంతే పురుషేగుణాః।

కృతయుగము స్వర్ణయుగము త్రేతాయుగము రజతయుగమనియు, ఆహవనీయ, గార్హపత్య, దక్షిణములను త్రేతాగ్నుల బూజించిన కాలము గనుక త్రేతాయుగ మనఁబడెను.

3. ద్వాపరయుగ ధర్మములు.

శ్లో. స్మృతిశాస్త్ర ప్రభేదాశ్చ ప్రస్థానాని పృథక్ పృథక్।
ద్వాపరే వినివర్తంతే మతభేదా స్తథా నృణామ్॥
మనసా కర్మణా వాచా కృచ్ఛ్రా ద్వార్తా ప్రసిద్ధ్యతి।
ద్వాపర స్సర్వభూతానాం కాయక్లేశధురస్స్మృతః॥
లాభో భృతి ర్వణిగ్వృద్ధిం తత్త్వానా మవినిశ్చయః।
వేదశాస్త్రప్రణయనం ధర్మాణాం సంకర స్తథా॥
వర్ణాశ్రమపరిధ్వంసః కామద్వేషౌ తథైవచ।
పూర్ణే వర్షసహస్రే ద్వే పరమాయు స్తథా నృణామ్॥

మాత్స్యే ౧౪౨ అధ్యాయే.

శ్లో. త్రేతాయుగ స్యావసానే ద్వాపరే యుగ ఆగతే।
ద్విపాదో భూతవాన్ ధర్మ స్సుఖదుఃఖాన్వితా నరాః॥
కేచి త్కేచిత్పాపరతాః కేచి ద్ధర్మరతా స్తథా।
కేచి త్కేచిద్గుణై ర్హీనాః కేచి త్కేచి న్మహాగుణాః॥
అత్యంతదుఃఖినః కేచిత్ కేచిచ్చాతిధనా స్తథా।
ప్రతిగ్రహే బ్రాహ్మణాశ్చ కదాచిత్కు ర్వతేస్పృహాం॥
భూభుజా ధనలోభేన కదాచి ద్దణ్డ్యతే ప్రజాః।
విష్ణుపూజాపరా విప్రా శ్శూద్రాశ్చ ద్విజసేవినః॥
తదా విష్ణు ర్వ్యాసరూపీ వేదభాగం చకారహ॥

ఇతిపాద్మే-క్రియాయోగ సారే. ౨౫ అధ్యాయే.

త్రేతాయుగాంత మయినంతట ద్వాపరయుగము ప్రవేశించును. ఇందు రెండుపాళ్లు ధర్మము నడచును. భగవంతుఁడు పీతవర్ణధారిగా నుండును. రజ స్తమో గుణము లావరించుటంజేసి, శ్రుతిస్మృతి ధర్మములయందు సందేహమును, ద్వైవిధ్య బుద్ధియు, భిన్నదృష్టియుఁ గలిగి ధర్మముల యందును, శాస్త్రముల యందును విశ్వాసము తగ్గును. కొన్ని యెడల ధర్మసంకరము గలుగును. కొందఱు పాపకర్మాసక్తులును కొందఱు గుణవంతులును, కొంద ఱతిదుఃఖవంతులును, కొందఱు ధనాఢ్యు

ధన్సులు అల్పాయుష్మంతులు నగు నిక్కలికాలపుఁ బురుషులకుఁ గల్పితములుగను, మేధావులచే వర్ణితములుగను,నాశ్చర్యకరములుగ నుండును.

౨ త్రేతాయుగ ధర్మములు.

శ్లో. పాదేన గ్రసతే ధర్మో రక్తతాం యాతి చాచ్యుతః।
జ్ఞానప్రవృత్తాశ్చ నరాః క్రియా ధర్మపరాయణాః॥
తతో యజ్ఞాః ప్రవర్తంతే ధర్మాశ్చ వివిధాః క్రియాః।
స్వధర్మస్థాః క్రియావంతో జనాస్త్రేతాయుగేఽభవన్॥

భారత - అరణ్యపర్వణి.

శ్లో॥ ఇజ్యా దానం తప స్సత్యం త్రేతాధర్మాస్తు వైస్మృతాః।
తదా ప్రవర్తతే ధర్మో వర్ణాశ్రమ విభాగశః॥
...ర్యాదా స్థాపనార్థంచ దండనీతిః ప్రవర్తతే।
హృష్టపుష్టజనా స్సర్వే అరోగా పూర్ణమానసాః॥
ఏకో వేద శ్చతుష్పాద స్త్రేతాయాం త్రివిధః స్మృతః।
త్రీణివర్ష సహస్రాణి జీవంతే తత్ర తాః ప్రజాః॥
పుత్రపౌత్రసమాకీర్ణా మ్రియంతే చ క్రమేణ తాః॥

మాత్స్య-౧౪౨ అధ్యాయే.

కృతయుగానంతరము త్రేతాయుగము మూఁడుపాళ్ల ధర్మము గలది. ప్రజలు యజ్ఞక్రియా కలాపవంతులును, జ్ఞానపరులును, ధర్మపరాయణులును, ఆరోగ్యవంతులును, నిత్యసంతుష్టులును, సంపూర్ణమనస్కులును, పుత్రపౌత్రాభివృద్ధిమంతులుగ నుండును. సామాన్యముగ నప్పటి మానవాయుర్దాయము మూఁడువేల సంవత్సరములు,అంతకన్న నెక్కుడు కాలము జీవించినచో, తపోబలము వలనని తెలియఁదగును. వర్ణాశ్రమ ధర్మములు విభజింపబడి ప్రవర్తిల్లుచుండును.జనులుధర్మపరులుగాక నియతితో నుండుటకై దండనీతి శాస్త్రమును పాలకులాచరణములో నుంచెదరు. యజ్ఞకర్మ లాచరించు యుగము కావున, కర్మనిష్ఠపరులుగా నుందురు. యజనము,దానము, తపస్సు, సత్యము, త్రేతాయుగ ధర్మములని సామాన్యముగఁ జెప్పఁబడును. శరీరమున మాంసముండువఱకుఁ బ్రాణములు ధరించియుందురు. కాఁబట్టియే, మాంసగతప్రాణులని వ్యవహారము కలదు. ఈయుగంబునఁ బిలిచి దానము నొసంగుదురు. భగవంతుఁడు రక్తవర్ణధారిగ నుండును చక్రవర్తి స్వరూపమునువహించి దుష్టులసంహరించును,

యెల్లభూతముల నెల్లలోకముల సంచరించుట సప్తమసిద్ధి. వైరాగ్యబలముచే నెచ్చటనేని శయనించుట యష్టమసిద్ధి, ఈసిద్ధు లాకాలపువారలకుఁ గలిగినందున దక్కినయుగములలోని వారలకన్న నధికులని చెప్పవలయును.

శ్లో. కృతంనామయుగంశ్రేష్ఠం యత్రధర్మస్సనాతనః।
కృతమేవ చ కర్తవ్యం తస్మిన్కాలే యుగోత్తమే॥
నతత్రధర్మాస్సీదంతి న జీర్యంతే చ వై ప్రజాః।
తతఃకృతయుగం నామ కాలేన గుణతాం గతం॥
కృతే యుగే చతుష్పాద శ్చాతుర్వర్ణ్యంచశాశ్వతం।

లోహములలో సువర్ణము శ్రేష్ఠమయినట్లు, యుగములలోఁ గృతయుగము శ్రేష్ఠమయినది. ఎయ్యది మనస్సులో సంకల్పింతురో యద్దాని నొనరింతురు. ఈసువర్ణయుగమున ధర్మములుచెడవు. ప్రజలు జరాపీడితులుకారు. శాశ్వతమగు చాతుర్వర్ణ్యధర్మము వర్ధిల్లుచుండును. వృషస్వరూపియగు ధర్మము నాలుగుపాదములతో సంచరించుచుండును.అనగా నాలుగు భాగములు సంపూర్ణధర్మము గలయుగము, తపస్సుప్రధానము ప్రజ లస్థిగతప్రాణులనఁగా, నెముకలుండువఱకుఁ బ్రాణములు ధరించియుందురు. ఈసత్యయుగమున,దాత వెదకికొనిపోయి పాత్రుఁడగు ప్రతిగృహీతకు దానమొసఁగును. ఎచటఁబోయిన సువర్ణాదిభూషణములు ధనము నచటనేపడియుండును. తపఃప్రధానయుగమగుటచే శాపము వెంటనే తగులును. అనుగ్రహమునట్టిదియ. కలియుగంబున నిప్పుడుయంత్రసాధనంబున మానవశరీరములోని యాంత్రధమని జీర్ణాశయరక్తనాడీప్రసరణాదులు స్పష్టముగఁ గనఁబడినట్టుల కృతయుగంబున,నిర్మలాంతఃకరణవిశిష్టమగు దివ్యదృష్టికి మానవుల మనస్సంకల్పములు, కామక్రోధాదివృత్తులు, భూతభవిష్యత్ఫలములు స్పష్టముగ గోచరించును. భౌతికయంత్రసాధనములక్కఱలేదు. స్త్రీపురుషులు, సంపూర్ణవస్త్రధారణము లేని వారయ్యుఁ జిత్తవికారముఁ జెందఁజాలరు. పాపపుణ్యములు, ధర్మాధర్మములు, భావనామాత్రముచేతనే విదితమగును. తపఃప్రధాన సత్యయుగమగుటంజేసి, దేవతలతోడి మహర్షులతోడి, సంభాషణము, వారలతోడి లోకాంతరగమనము, చిరంజీవిత్వము, కామరూపత్వము లోనగునవి ప్రజలకుఁగలుగుచుండును.ఇట్టిది సత్యయుగ ప్రభావము.అద్భుతకార్యముల నొనరించుట, అనేకవేల సంవత్సరములు జీవించుట, లోనగునవి యల్పసత్త్వ లల్పమే

## యుగధర్మములు.

### ౧. కృతయుగధర్మము.

శ్లో. కృతేతు మిథునోత్పత్తి స్సిద్ధిశ్చాపి రసోల్లసా।
సకృద్వృష్టిమయీ చాన్యా గృహవృక్షాత్మికా పరా॥
పశ్చా త్సంకల్పసిద్ధిశ్చ కల్పవృక్షాత్మికా పరా।
ప్రకామవృష్టి శ్చాకృష్టపచ్యసిద్ధి స్తథాఽష్టమీ॥

కృతయుగమునందు, స్త్రీల యపేక్షలేకుండ మిథునోత్పత్తియు, యోగాభ్యాసమువలన సహజానందమును, సదాతృప్తియు, ఏదేనొకవృష్టిచే సస్యోత్పత్తియు, నిచ్ఛచే గృహవృక్షులతాదులు గలుగుట, సంకల్పముచే నభిమతార్థసిద్ధి, భరద్వాజాశ్రమమునందువలెఁ గల్పవృక్షాదులుద్భవించుట, సంపూర్ణవృష్టి, భూమిదున్నకుండ నోషధులు వ్రీహ్యాదులుఫలించుట యనునీయష్టసిద్ధులు, అప్పటి ప్రజలకుఁ గలుగుచుండును. వారలకుఁ గలుగు నష్టసిద్ధు లెవ్వియన?

శ్లో. రసస్య స్వత ఏవాంతరుల్లాస స్సాస్యత్కృతే యుగే।
రసోల్లసాఖ్యాకా సిద్ధి స్తయా హంతి క్షుధం నరః॥
స్త్ర్యాదీనాం నైరపేక్ష్యేణ సదా తృప్తాః ప్రజా స్తథా।
ద్వితీయా సిద్ధి రుద్దిష్టా సాతృప్తి ర్మునిసత్తమైః॥

శ్లో. ధర్మో త్తమంచ నాస్త్యాసాం సా తృతీయాఽభిధీయతే।
చతుర్థీ తుల్యతా తాసా మాయుష స్సుఖరూపయోః॥
ఐకాంతబలబాహుళ్యం విశోకానామ పంచమీ।
పరమాత్మపరత్వేన తపోధ్యానాదినిష్ఠితా॥
షష్ఠీచ కామచారిత్వం సప్తమీ సిద్ధి రుచ్యతే।
అష్టమీచ యథా ప్రోక్తా యత్ర క్వచన శాయితా॥

అంతరంగమునఁగలుగు రసోల్లాసమను సిద్ధి మొదటిది. దీనివలన క్షుత్పిపాసలు నశించును. స్త్రీచందనాది సాధనము లేక, సదాతృప్తులు, సదానందులుగ నుండుట ద్వితీయసిద్ధి. అంతకన్న నుత్తమ ధర్మము లేక ధర్మపరాయణులుగనుండుట తృతీయసిద్ధి. ఆయుస్సౌఖ్యరూపములయం సమానముగనుండుట చతుర్థసిద్ధి. ఏకాంతమగుబలము పుష్కలతిశయము గలిగి విశోకమను పేరుగలది పంచమసిద్ధి. తపోధ్యానసమాధియోగము చేఁబరమాత్మయందు, స్థితిఁగలిగియుండుట యాఱవసిద్ధి. నిర్బంధములే

లయింపఁజేయుచు, నామరూపాత్మకమగు నిజమాయచే నెల్లఱ మోహింపఁజేసి, యెల్లఱచే స్తుతింపఁబడుచు, నానారూపములచేఁ గృత్యములఁ గావించుచు నదృశ్యుఁడుగా నుండును. ప్రతిమన్వంతరమున నంశావతార మైత్రి స్వాశ్రితులగు నింద్రాదులకు నసురులవలనఁ గలిగిన యిక్కట్టులఁ బాపుచుఁ బ్రోచుచుండును. ప్రతిమన్వంతరమునఁ గలుగు, మను, మనుపుత్ర, దేవ, సప్తర్షులు, ఇంద్రులు అధికారివర్గము, వీరినామధేయములు వేఱువేఱుగ నుండును. శ్రీహరియొక్క యీషడ్విధరూపకృత్యములు, అధికారములు పైన క్రమముగ వివరింపఁబడెను.

ప్రతిమన్వంతరమున ౭౧ మహాయుగములుండును. మహాయుగమనఁ గృత, త్రేతా, ద్వాపర, కలియుగములను నాలుగుయుగములుండును. యుగాంతము, యుగసంధి, చతుర్యుగాంతము, చతుర్యుగసంధి; మన్వంతరము, మన్వంతరసంధి, కల్పము, కల్పసంధి యిట్లు భేదముగలిగి తత్తదనుగుణధర్మములతో నొప్పారుచుండును. యుగాంతములయందును యుగసంధులయందును, సప్తర్షులు, మనువులు, రహస్యప్రదేశములయందుండి, యుగాదులయందు లోకము చక్కఁబడినపుడు భూమిమీఁదికి వచ్చి ధర్మవ్యవస్థాపనమును, శ్రుతిగణప్రచార ప్రబోధములనుఁ గావింతురని యిది వఱలోఁ జెప్పఁబడెను. మనువు, మనుపుత్త్రులు క్షాత్రధర్మము నవలంబించి భూలోకమునఁ బ్రజాపాలనముఁగావించు రాజులుగ నుందురనియు, సప్తర్షులు, వేదసమూహమును, తదుక్తధర్మములనుఁ బ్రవర్తింపఁజేయుచు, లోకత్రయమునందు సంచరింతురనియు, దేవతలు, తదధీశ్వరుఁడగు నింద్రుఁడు భూలోకవాసులు గావించు యజ్ఞాదులయందు హవిర్భాగములఁ గొనుచు, వారలకుఁ గావలసిన వృష్ట్యాది సకలోపకారములనుఁ గావింతురనియుఁ,ద్రిలోకసంచారులనియు, ద్రిలోకములయం దధికారముఁ గలవారనియు, వీరలనెల్లఁ బ్రోచుటకు, ధర్మ, కర్మ, జ్ఞానయోగముల నుపదేశించుటకు, దుష్టశిక్షణ శిష్టరక్షణ గావించుటకును, శ్రీహరియవతార ప్రయోజనమనియుఁ దెలియఁదగినది. ముందుఁజెప్పఁబడిన షడ్విధరూపాకారము, శ్రీహరి సాత్త్వికాంశము, (స్థితి) లోకపాలన సంరక్షణాదుల యందుఁ గలుగుచుండును.

11 లో.

## దేవతలకృత్యము.

శ్లో॥ యజ్ఞభాగభుజో దేవా యే చాన్యేఽత్రాను కీర్తితాః॥

యజ్ఞమందలి హవిర్భాగముల భుజించుచు దేవేంద్రునకు సహాయభూతులై లోకోపకారముఁ గావించువారలు, పంచమహాయజ్ఞమందలి భాగములను, ద్యావాపృథివ్యగ్న్యభిమానిదేవతలును, పితృదేవతలును గలసి యనుభవింతురు. వసురుద్రాదిత్యగణదేవతలు, కూష్మాండదేవతలు, పితృదేవతలు, కర్మదేవతలు, ఆజానదేవతలు, లోనగు దేవతాభేదము లనేకములుగలవు వానివివర మాయాసందర్భములఁ గనఁదగును.

## ఇంద్రకృత్యము.

శ్లో. ఇంద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియ మూర్జితాం।
భుంజానః పాతి లోకాంస్త్రీన్ కామం లోకే ప్రవర్షతి॥

ఇంద్రుఁడు, పరమాత్మయగు శ్రీహరిచే నొసంగఁబడిన త్రైలోక్యరాజ్యసంపద నతివైభవమున ననుభవించుచు, మూఁడులోకములను బాలించుచుండును. పర్జన్యరూపియై వర్షించుచు వ్రీహియవాదిధాన్యముచే లోకమును రక్షించుచుండును. లోకపాలకులలో నధికుఁడయి, దేవతలకుఁ బ్రభునై, భగవత్సహాయంబున నసురలజయించుచు, యజ్ఞముల హవిర్భాగములఁగొనుచు, లోకమునుఁ బాలించుచుండును. సహస్రాక్షత్వ, శతక్రతుత్వ, వజ్రపాణిత్వ ధర్మములు ప్రతిఇంద్రునకునుండును.

## అవతారధర్మము.

శ్లో. జ్ఞానం చానుయుగం బ్రూతే హరిస్సిద్ధేశరూపధృత్।
ఋషిరూపధరః కర్మ యోగం యోగేశ రూపధృత్॥
సర్గం ప్రజేశరూపేణ దస్యూన్ హన్యాత్స్వరాడ్వపుః।
కాలరూపేణ సర్వేషామభవాయ పృథగ్గుణః॥

భగవంతుఁడగు నారాయణుండు, సనత్కుమార కపిలాదిసిద్ధరూపములనుఁదాల్చి జ్ఞానమును, యాజ్ఞవల్క్యాది ఋషీశ్వరరూపమున ధరించి, కర్మను, దత్తాత్రేయయాది యోగీశ్వరరూపమును వహించి, యోగమును, ఆయాయుగమునకుఁ దగునట్లు ఉపదేశించుచుండును. మఱియు మరీచి దక్షాది ప్రజాపతిరూపమునుధరించి లోకమును సృజించుచు, మను మనుపుత్రాది రాజరూపముల నావేశించి, దుష్టసత్త్వములను, చోరాదులను శిక్షించి, లోకమును బాలించుచు, రుద్రాంతకాదిరూపములబూని

కాఁబట్టి యుత్పన్నములగు వేదజాలమునుఁ బ్రతికృతాదియందుఁ బ్రవర్తింపఁజేసి తదుక్తములగు ధర్మములను, స్మృతులను నిర్మించుటయే ఋషులకృత్యమని విస్పష్టము.

మనుకృత్యము.

శ్లో. తత్ర ధర్మం చతుష్పాదం మనవో హారిణోదితాః।
యుక్తా స్సంచారయంత్యద్ధా స్వే స్వేకాలే మహీంనృప॥
కృతేకృతే స్మృతేర్విప్ర ప్రణేతా జాయతే మనుః॥

సప్తర్షులు వేదముల నుద్ధరించి తత్ప్రతిపాదితములగు సనాతనధర్మముల నిర్ణయింపఁగ మనువులు యజ్ఞాద్యవతారరూప భగవన్నియుక్తులై చతుష్పాదధర్మము నాయాయుగానుగుణ్యముగ మహీమండలమునఁ బ్రవర్తింపఁజేయుదురు. అదియునుంగాక ప్రతికృతయుగాదిని మనువు స్మృతిని నిర్మించుచున్నాఁడనియు, శ్రీవిష్ణుపురాణమునందుఁగలదు. ఋషినిర్ణీత వేదప్రతిపాదిత ధర్మములకు మనువులు ప్రవర్తకులని తాత్పర్యము. స్మృతికర్త మనువగుటంజేసి, స్మృతులలోనికెల్ల మనుస్మృతి పరమప్రామాణ్యము. శాసనసభలయందు నిర్ణయింపఁబడిన ధర్మములను, పాలకుఁడగు ప్రభువు లోకమునఁ బ్రవర్తింపఁజేసినటుల మంత్రద్రష్టలగు సప్తర్షి నిర్ణీత వేద ప్రతిపాదిత ధర్మములను, క్షాత్త్రధర్మము నవలంబించిన మనువులు ప్రవర్తింపఁజేయుదురనియు మనువులు రాజులనియు భావము.

మనుపుత్త్రుల కృత్యము.

శ్లో. పాలయంతి ప్రజాపాలా యావదంతం విభాగశః।
భవంతి యేమనోః పుత్రా యావన్మన్వంతరం హితైః।
తదన్వయోద్భవైశ్చైవ తావద్భూః పరిపాల్యతే॥

సప్తర్షుల చేతను, మనువుచేతను, నిర్ణయింపఁబడిన ధర్మముల నవలంబించి, మనుపుత్త్రులు, పౌత్త్రులు, వంశస్థులెల్లఱును ఆమన్వంతర పర్యంతము మహీమండలమునఁ బ్రజాపాలనముఁ గావింతురు. వీరుయజ్ఞాదులచే దేవతల నారాధింతురు గనుక, దేవతల సహాయము విశేషముగ బడయుచుందురు తపోయోగ మహిమలచే, స్వర్గాదిలోకముల సంచారముఁ గావించుచున్నట్లును, పురాణేతిహాసములఁ గన్పట్టుచున్నది.

పాలితులు, శాసనసభ, తన్నిర్వాహకులు, నియమములు లోనగునవి యుండును. అట్టుల, ప్రతిమన్వంతరమందును, మనువు, మనుపుత్త్రులు, ఇంద్రుఁడు, దేవగణములు, సప్తర్షులు, అంశావతారములని యాఱు విధములుగ నుండును.

శ్లో. మన్వంతరే మనుర్దేవా మనుపుత్రా స్సురేశ్వరః।
ఋషయో ఽంశావతారశ్చ హరే ష్షడ్విధ ముచ్యతే॥

మనువు, అనఁగ ప్రభువు, మన్వంతరమనఁగ ప్రభుత్వకాలము. ఇందు పరమేశ్వరుఁడు స్వమాయాశక్తిచేఁ షడ్విధరూపముల నొంది లోకములఁ బాలనరక్షణ పోషణములఁ గావించుచుండును. ఋషులు మనువు, మనుపుత్త్రులు, ఇంద్రుఁడు, దేవగణములు, అంశావతారము, వీరికృత్యములు, ధర్మముల, నియామకము చెప్పఁబడును:—

శ్లో. మనవో మనుపుత్రాశ్చ మునయశ్చ మహీపతే।
ఇంద్రా స్సురగణాశ్చైవ సర్వే పురుషశాసనాః॥
యజ్ఞాదయో యాః కథితాః పౌరుష్య స్తనవో నృప।
మన్వాదయో జగద్యాత్రాం నయంత్యాభిః ప్రచోదితాః॥

యజ్ఞాద్యవతారము లన్నియు భగవంతుని శరీరములు (అంశలు) అంశావతారములచే నియుక్తులయిన మన్వాదులు లోకయాత్రను నడుపుచుందురు. భగవదాజ్ఞా పాలకులై, శాసననియుక్తులై వారివారికి నియమింపఁబడిన కార్యముల నిర్వహింతురని భావము.

సప్తర్షులకృత్యము.

శ్లో. చతుర్యుగాంతే కాలేన గ్రస్తాన్ శ్రుతిగణాన్ యథా।
తపసా ఋషయోఽపశ్యన్ యతో ధర్మ స్సనాతనః॥

ప్రతిచతుర్యుగాంతకాలమున నష్టములగు శ్రుతిగణములను సప్తర్షులు తమ తపోమహిమచేఁ గనిపెట్టి శాశ్వతధర్మములను నిర్ణయింతురు. చతుర్యుగాంతప్రళయమున ద్యులోకమునందుండి కృతయుగాదిని భూమిమీఁద వేదములనుఁ బ్రవర్తింపఁ జేయుదురని యీక్రిందిశ్లోకము శ్రీవిష్ణుపురాణమునఁగలదు.

శ్లో. చతుర్యుగాంతే వేదానాం జాయతే కిల విప్లవః।
ప్రవర్తయంతి తానేత్య భువం సప్తర్షయో దివః॥

భవునిపత్ని—దాక్షాయణి సతీదేవి=తనపతినిఁ దిరస్కరించిన దక్షుని యజ్ఞ
శాలయందు యోగాగ్నిచే దగ్ధమయ్యెను.

ఇయ్యది దక్షపుత్రికలసంతతి.

అధర్మదేవత సంతతి.

ధర్మదేవతసంతతి తెలిసిన పిమ్మట నధర్మదేవతసంతతియుఁ దెలియఁదగియున్నది. ఏలయన, నిత్యప్రళయమునకు సంబంధించు నధర్మదేవతసంతతితోఁ బ్రవర్తింపఁగూడదనియు, దుఃఖనరక హేతువనియుఁ దెలియఁదగును. అధర్మదేవత, పద్మసంభవు పృష్ఠభాగమునుండి జనించె నని యిదివఱలోఁ జెప్పఁబడియె.

| శ్రీభాగవత ప్రకారము. (మిథునజననము) | శ్రీవిష్ణుపురాణ ప్రకారము. (దంపతులజననము.) |
| --- | --- |
| అధర్మునకు—మృషయందు=దంభమాయలు (దంపతులు) | అధర్మునకు—హింసయందు = అనృతము నికృతి, |
| దంభ—మాయలకు = లోభము = నికృతియు, | అనృతము—నికృతివలన=భయ-నరక పుత్రులు, |
| లోభనికృతులకు=క్రోధము=హింస కలి—దురుక్తి, | భయము—మాయవలన=మృత్యువు |
| కలి-దురుక్తులకు=నిరయ=యాతన | నరకము—వేదన వలన = దుఃఖము |
| | మృత్యువువలన—వ్యాధి జరా, శోక, తృష్ణాక్రోధములు జనించె, |

వీరలు, ఊర్ధ్వరేతస్కులయిరి.

పైనిఁ జెప్పఁబడినవి యధర్మవృక్షశాఖలు సంసార బంధకారణములు, శ్రేయస్కాముఁడు వీనిని సేవింపరాదు ఇవియన్నియు బుద్ధిస్థవృత్తులు, తదభిమాని దేవతలుగ నిర్వచింపఁబడినవి. స్త్రీపురుషాకారము లున్నట్లు భావింపరాదు. ఇట్లు స్వాయంభువ మను పుత్రికలసంతతి దెలిసిన పిమ్మట, తత్పుత్రులసంతతియు, వారి కర్మజ్ఞానతపశ్శక్తులును, యోగప్రభావంబును, భూమండల ప్రజాపరిపాలనంబును, అందు దేవతలకు, మానవులకుఁగల పరస్పర సంబంధములు, ఆయా యుగధర్మములును, దెలియఁదగియుండును.

స్వాయంభువ మన్వంతరము.

ఏ ప్రభుత్వమందేని, పాలనావిధానము, పాలనాధికారము పాలకే

3. దక్ష ప్రజాపతికి—స్వాయంభువమనువు, తృతీయపుత్రికయగు ప్రసూతి యందు షోడశకన్యకలుగలిగిరి. దక్షుఁడు ధర్మదేవతకు, పదుమూగ్గురు కన్యకలను, అగ్నిదేవున కొక కన్యకను, పితృదేవతల కొక కన్యకను శివున కొక కన్యక నొసంగెను.

ధర్మదేవత సంతతి.

| | శ్రీభాగవతప్రకారము | | శ్రీవిష్ణుపురాణప్రకారము. | |
|---|---|---|---|---|
| 1. | శ్రద్ధవలన | శ్రుతము | శ్రద్ధవలన | కామము |
| 2. | మైత్రివలన | ప్రసాదము | లక్ష్మివలన | దర్పము |
| 3. | దయవలన | అభయము | ధృతివలన | నియమము |
| 4. | శాంతివలన | సుఖము | తుష్టివలన | సంతోషము |
| 5. | తుష్టివలన | ముత్ (ముదము) | పుష్టివలన | లోభము |
| 6. | పుష్టివలన | గర్వము | మేధవలన | శ్రుతము |
| 7. | క్రియవలన | యోగము | క్రియవలన | దండనీతి నయ-వినయ |
| 8. | ఉన్నతివలన | దర్పము | బుద్ధివలన | బోధ |
| 9. | బుద్ధివలన | అర్థము | లజ్జవలన | వినయము |
| 10. | మేధవలన | స్మృతి | వపువువలన | వ్యవసాయము |
| 11. | తితిక్షవలన | క్షేమము | శాంతివలన | క్షేమము |
| 12 | హ్రీసంజ్ఞవలన | ప్రశ్రయము | సిద్ధివలన | సుఖము |
| 13. | మూర్తివలన | నరనారాయణఋషులు | కీర్తివలన | యశస్సు |

పైనిఁజెప్పఁబడిన ధర్మదేవతసంతతి బుద్ధివృత్త్యభిమాని దేవతలు.

అగ్నికి—స్వాహాదేవివలన=పావక (నిర్మంథ్యాగ్ని)
పవమాన (వైద్యుతాగ్ని)
శుచి (జలాశి) అగ్న్యభిమాన దేవతలు ముగ్గురున్ను వీరికిఁగలిగిన 45 రు సంతానమున్ను, మొత్తము 49 రు అగ్నిహోత్రస్థానాధికారులు.

అగ్నిష్వాత్తులు (అనగ్నులు) స్వధా దేవివలన=వయునయు, ధా త్రేతాగ్ని రహితులు. రిణియు నను నిద్దరుపుత్రికలు గలిగి,

బర్హిషదులు (సాగ్నులు) బ్రహ్మవాదినులైరి. విష్ణుపురాణమున,
సోమపులు } త్రేతాగ్నిసహితులు మేనా వైతరిణియను నిద్దరు కన్యక
ఆజ్యపులు పితృదేవతలకు ..ని యున్నది.

నవబ్రహ్మలసంతతి.

౧. మరీచికి —కలయందు=కశ్యపుఁడు, పూర్ణిముఁడు నను నిరువురు పుత్త్రులుగలిగిరి. పూర్ణిమునకు, విరజ, విశ్వగాఖ్యులగు నిరువురు పుత్త్రులును జన్మాంతరమున గంగానదియైన, దేవకుల్య యను పుత్త్రికయును గలిగెను.

౨. అత్త్రికి—అనసూయయందు=దత్తుఁడు, దుర్వాసుఁడు, సోముఁడు నను ముగ్వురుపుత్త్రులు హరిహర బ్రహ్మాంశలవలనఁ బుట్టిరి.

3. ఆంగీరసునకు—శ్రద్ధయందు=సినీవాలి, కుహువు, రాక, అనుమతియను ౪ పుత్త్రికలు ఉతథ్య, బృహస్పతులను నిరువురుపుత్త్రులును గలిగిరి.

౪. పులస్త్యునకు —హవిర్భుజియందు=అగస్త్యుఁడును, అతనికి విశ్రవసుఁడును బుత్త్రుండయ్యె. విశ్రవసునకు — ఇలబిలయను భార్యయందైలబిలుఁడు (కుబేరుఁడును), కైకసియందు, రావణ, కుంభకర్ణ, విభీషణులను పుత్త్రులును బుట్టిరి.

౫. పులహునకు—గతియందు=కర్మశ్రేష్ఠుఁడు, వరీయస్సు, సహిష్ణుఁడు నను ముగ్వురు పుత్త్రులు గలిగిరి.

౬. క్రతువునకు —క్రియయందు=బ్రహ్మ తేజోవిరాజితులగు వాలఖిల్యులు (అరువదివేవురు.) 60 వేలమంది జనించిరి.

౭. భృగువునకు—ఖ్యాతియందు=ధాత,విధాతయను నిర్వురుపుత్త్రులుగలిగిరి. అందు ధాతకు ఆయతియను భార్యవలన మృకండుఁడును, మృకండునకు మార్కండేయుండును;విధాతకు,నియతియను భార్యవలన, ప్రాణుండును, ప్రాణునకు, వేదశిరుండును జనించిరి. శ్రీదేవియంశమున భార్గవియనుపుత్త్రికయు, శుక్రుఁడు పుత్త్రుఁడునైయుండిరి.

౮. వసిష్ఠునకు—అరుంధతివలన= శక్తిప్రభృతులు పెక్కండ్రు పుత్త్రులు గలిగిరి. ఊర్జయను భార్యవలన, చిత్రకేతుఁడు, సురోచి, విరజుఁడు, మిత్త్రుఁడు, ఉల్బణుఁడు, వసుభృద్యానుఁడు, ద్యుమంతుండు నన నేడ్వురుపుట్టి సప్తర్షులైరి.(ఉత్తమమన్వంతరమందలిఋషులు)

౯. అథర్వునకు —శాంతియందు=అశ్వశీర్షుండైన దధ్యంచుఁడను పుత్త్రుఁడు ధృతవ్రతుఁడును గలిగిరి.

ఇది కర్దమప్రజాపతి సంతతి.

డును గాంత. సృష్టి అనాదియని సనాతనధర్మజ్ఞుల మతము ప్రతికల్పము, మన్వంతరము యుగప్రారంభము వీనియందుఁ బ్రాచీనసృష్టిధర్మము లే ప్రవర్తించుచుండునని యివిపటలోఁ జెప్పఁబడెను.

స్వాయంభువ మన్వంతరము

ఇప్పటికల్పము శ్వేతవరాహకల్పము అందుఁ బ్రథమమన్వంతరము స్వాయంభువ మన్వంతరము. స్వాయంభువు మనువుపకుఁ బూర్వము, చతుర్ముఖబ్రహ్మ మానససృష్టినిఁ బ్రజాపతులనుఁ గొందఱ దేవతలను, యక్షరక్షోగంధర్వకిన్నరకింపురుష సిద్ధసాధ్యఖేచరాప్సరసలను, లోనగువారిని సృజించెను. స్వాయంభువ మనువును శతరూపా దేవిని సృజించి యిది మొదలు మిథునధర్మముచేఁ బ్రజాభివృద్ధిఁ గలుగుఁగాంత యని సంకల్పించెను. నాటంగోలె మిథునధర్మముచేఁ బ్రాయికముగఁ బ్రజాభివృద్ధి కలుగుచున్నది.

స్వాయంభువమనువును, శతరూపా దేవి యందు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి యను ముప్పురు పుత్రికలును, ప్రియవ్రత, ఉత్తానపాదులు నను నిరువురు పుత్రులునుఁ గలిగిరి. అందు ఆకూతిని రుచిప్రజాపతికిని, దేవహూతిని కర్దమప్రజాపతికిని, ప్రసూతిని దక్షప్రజాపతికిని నొసంగెను. వీరి సంతానములచే జగత్తు సంపూరితమయ్యెను.

౧. రుచిప్రజాపతికి—ఆకూతియందు: శ్రీ మహావిష్ణువు యజ్ఞపురుషుఁడుగను, శ్రీ మహాలక్ష్మి దక్షిణా దేవిగను దంపతులుగా నవతరించిరి. ఇది యజ్ఞపురుషావతారము.

౨. యజ్ఞపురుషునకు—దక్షిణయందు: తోష, ప్రతోష, సంతోష, భద్ర, శాంతి, ఇడస్పతి, ఇధ్మ, కవి, విభు, వహ్ని, సుదేవ, రోచమాన నామధేయములుగల ద్వాదశపుత్రు లుదయించిరి. వీరు పన్నిద్దఱు తుషితనామక దేవతలు (యామాభిధానులు) స్వాయంభువమన్వంతర మందలి దేవతలయిరి.

౩. కర్దమప్రజాపతికి—దేవహూతియందు కల, అనసూయ, శ్రద్ధ, హవిర్భువు, గతి, క్రియ, ఖ్యాతి, అరుంధతి, శాంతి యను నభిఖ్యగల నవపుత్రికలును, శ్రీహరి యంశమున కపిలుండును నుదయించిరి. ఇయ్యది కపిలావతారము.

పూర్వోక్త నవపుత్రికలు నవబ్రహ్మలకు నొసంగబడిరెను.

ఆదేవతలు వృష్ట్యాదులచే మిమ్ముల రక్షింతురని, యన్యోన్యాశ్రయభావము గలిగించినట్లు,

శ్లో. దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ॥

అను శ్రీగీతా ప్రమాణమును బట్టియుఁ దెలియుచున్నది

ఇట్లు దేవతలకు విగ్రహవత్త్వము, ఫలప్రదాతృత్వము, స్వేచ్ఛారూపత్వము శాస్త్రలోక సిద్ధమయినందున నిఁకముందు ఇంద్ర, అగ్ని, వసు, రుద్ర, ఆదిత్యుల స్వరూపంబు నధికారంబు కాలపరిమితి లోనగునవి యాయాసందర్భముల వివరింపఁబడును.

స్వాయంభువ మన్వంతరము

భగవదవతారము, మహనీయ రాజపుంగవుల భూపరిపాలనము, పరిపాలనమునందలి చరిత్రాంశములు, ధర్మజ్ఞానోపదేశము, లోనగునవి యేకాలమందు జరిగెను? ఏమన్వంతరమున నేయుగమున జరిగెనని చరిత్రకారులు విమర్శింతురు. దానింబట్టియే, కల్ప. మన్వంతరములను నిర్ణయించిరి. ఇప్పటి యుగమువారు, యుధిష్ఠిరశకమున, విక్రమార్క శకమున, శాలివాహన శకమున, క్రీస్తుపుట్టుటకుఁ బూర్వ మిన్నివత్సరముల నాఁడనియుఁ, బుట్టిన తర్వాత నిన్నిసంవత్సరముల కనియు, దేశచరిత్రములను, మహాపీఠుల చరిత్రములను, పరిపాలనాపటిమత్వము, వాఙ్మయము లోనగువానినిఁ గాలబద్ధములఁ జేసి గ్రంథములు రచియింతురు. ఆధునిక చరిత్రకారుల దృష్టియందు, సృష్టి రమారమి ౫౦౦౦ అయిదు వేల సంవత్సరముల నాఁడును, మఱికొందఱు 3000 సంవత్సరముల నాఁడును, జరిగియుండునని తలఁచుచున్నారు. వీరు తలఁచినది కలియుగాదిగ నుండవచ్చునుగాని, అది సృష్ట్యాది కాఁజాలదు. పాశ్చాత్యప్రకృతిశాస్త్రవేత్తలలో నిపుణులగు, భూగర్భశోధన శాస్త్రజ్ఞులు (Geologists) కొందఱు భూమిలోని గనులను బహుకాలమునాఁడు దగ్ధమయిన పాషాణాదులను, పర్వతములను శోధించి, రమారమి రెండుకోట్ల సంవత్సరములనాఁడు సృష్టి జరిగియుండుననియు, నంతకుఁ దక్కువ యుండదనియు సిద్ధాంతముఁ గావించిరి ఇప్పటి వైవస్వత మన్వంతరము ప్రారంభించి, రమారమి వారు సిద్ధాంతీకరించిన కాలమగును ఇట్టి మన్వంతరములు ౬ జరిగినవి. కల్పము ప్రారంభించి యెంతకాలమయినదో విజ్ఞులరయు

చున్నది. దేవతలు తైజసశరీరధారులు గనుక, మర్త్యులును దమలో
నున్న తేజస్తత్త్వాంతఃకరణము నభివృద్ధిఁజేసి సామానాధికరణ్యమున
సాక్షాత్కరింపఁదగును. ఉపాసనాపరులగు తపస్సంపన్నులకు సూక్ష్మ
శరీరమందు గాని విగళితమలమగు చక్షుస్సునకుఁ గాని గోచర మగుదురు.
సామాన్యముగ పిడుగుపడుచున్నప్పుడును, అత్యధిక తేజస్వంతమగు విద్యు
ద్దీప్తినిఁజూచునపుడే, నేత్రదృష్టి పోవుచుండగ, సూర్యాగ్నివిద్యుద్దీప్తి
కన్న నధిక తేజస్సులగు దేవతఁగాంచి నపుడిఁక దృష్టివిషయ మేమిచెప
వలయును? కాఁబట్టియే.

శ్లో. దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్.

అను గీతా ప్రమాణమును బట్టి, శ్రీకృష్ణభగవానుఁడును, తన
దివ్యస్వరూపము జూపునపుడు, అర్జునునకు దివ్యదృష్టి యొసంగెనని విదిత
మగుచున్నది. కాఁబట్టి స్థూలమగు మాంసచక్షుస్సునకు గోచరింపనం
మాత్రముననే దేవలు విగ్రహవంతులుకారనిచెప్పుట సాహసమాత్రము:
ఇంద్రాదిదేవతలు విగ్రహవంతులనియు, నశ్వమేధాది యాగములు చే
నట్లును, బ్రహ్మవిద్య నుపదేశమునుబొంది యితరుల కుపదేశించిన
ననేక శ్రుతిస్మృతీతిహాస పురాణములయందు గన్పట్టుచున్నది. వేదము
లోని విధివచనములలో దేవతలకు విగ్రహాదులు చెప్పఁబడకున్నను,
వాక్యములకు బలకరములగుమంత్రార్థవాదవాదములలో నవి చెప్పఁబ
నందున గ్రాహ్యములు కావున వారికి శరీరాదులును నుత్తమఫలాభిలాష
యుఁ గలవు. శరీరేంద్రియములకు హేతువగు ప్రకృతిని స్వాధీనపఱచు
కొనుటచే నొకదేహమునుండి మఱియొక దేహమునకు, నొకగదినుం
మఱియొకగదికిఁ బోయినట్లు, స్వేచ్ఛతో బోవుదురు. అనేకశరీరములు
క్రమముగనైనను లేక యేకకాలముననైనను సృజించి, వానియంద
దమ జీవచైతన్యమునుఁ బ్రవేశపెట్టుదురు. ఉపాసనాపరులగు తపస్సం
న్నుల మనస్థైర్యమును శోధించుటకు ననేకరూపముల బొడగట్టుచున్న
పురాణేతిహాసములయందు స్పష్టమగుచుండెడిని. కాఁబట్టి దేవతలకు
చ్ఛాగృహీతములగు, కామరూపములును గలుగును. తొల్లి బ్రహ్మదే
డు దేవతలను సృజించి తృప్తిఁజెందక సాధకవర్గమగు మానవులసృజిం
యజ్ఞాదుల హవిర్భాగంబుల నొసంగి దేవతలఁ దృప్తిఁ బొందింపుఁ

యగు భారతవర్షముతోడ సమానమయినది స్వర్గముగూడ కాదనియు, స్వర్గవాసులుకూడ తపోభూములనుండు మహాత్ములసన్నిధిని బ్రహ్మవిద్యావిచారమును గావించి, నిర్దగ్ధభవపాశులై యపునరావృత్తియగు పరబ్రహ్మపదవిని బడసిరనియు నితిహాసపురాణములయందుఁ గన్పించెడిని. స్వర్లోకము భోగభూమియని, భూలోకము యోగభూమి, తపోభూమి యని యిదివఱలో లోకవిచార ప్రస్తావనయందు విశదీకరింపఁబడెను.

## దేవతలసామాన్య లక్షణము.

దివు క్రీడావిజిగీషా వ్యవహార ద్యుతిస్తుతి మోదమద స్వప్నకాన్తిగతిషు=దీవ్యతి+ఆనందేన క్రీడతీతి = దేవః. ఆనందముచే విహరించుట, దేవం, ద్యుతింవా, క్రీడాంవా, తనోతివా=దేవతా అనినామ, నిర్వచనము, బాహ్యాభ్యంతరములఁ బ్రకాశించువారును, తైజస శరీరధారులును, భూమిని స్పృశింపకుండువారును, జరామరణరహితులును, స్వేదక్లమాదిశూన్యులు స్వేచ్ఛాగృహీత వివిధరూపవంతులు, వైమానికులు నగువారు దేవత లనఁబడుదురు. ద్యుతిఁగలవారెల్లను దైవీసంపద గలవారని భావము. వేదమంత్రము మాత్రమే దేవతయనియు, దేవతలకు విగ్రహవత్త్వము లేదనియు, అమానుషశక్తిగల వ్యక్తులకును, జ్యోతిర్మయ ప్రాకృతిక సూర్యచంద్రగ్రహాది మండలములకును, వర్షపర్జన్య విద్యుచ్ఛక్తులకును దేవత్వముఁ గల్పించు చున్నారనియు, నవి యన్నియు, సహజశక్తులు, వానివాని నియతిప్రకారము ప్రవర్తించుననియుఁ గొందఱుచెప్పుదురు. కేవల ప్రత్యక్షప్రమాణవాదులగు హేతుకులు, దేవతలు విగ్రహవంతులు కారని, వారికి ఫలదాతృత్వశక్తి లేదని చెప్పినను, నమ్మకము లేకున్నను, దేవతలు ఉపాసనాపరులకు సాక్షాత్కరించుచుఁ, జేయఁదగిన లోకోపకార కృత్యములను, భగవన్నియమితులై యొనరించుచునే యున్నవారలు. అర్వాక్స్రోతంబగు పార్థివతత్త్వభూయిష్ఠులగు మర్త్యులు; ఊర్ధ్వస్రోతంబగు తైజస తత్త్వభూయిష్ఠులగు దేవతలను, సాక్షాత్కరింపఁ దలఁచిన కర్మోపాసనలఁ బరిపక్వమగు సూక్ష్మశరీరమగు తైజసాంతఃకరణవిశిష్టమగు దృష్టిచేఁ జూడఁదగునుగాని, మాంసమయమగు స్థూలచక్షున్సులతోఁ జూడ శక్యము కాదని యోగశాస్త్రములవలనను, ప్రకృతిశాస్త్రములవలనను స్పష్టమగు

యుగాంతమున ధర్మము క్షీణించినపుడు, సప్తర్షులు ద్యులోకము నందుండి, మఱల సృష్టికి ప్రారంభమగు యుగాదియందు భూలోకమునకు వచ్చి ధర్మమార్గములు గల శిష్టాచారములను బ్రవర్తింపఁజేయుదురని శ్రీవిష్ణుపురాణమునందును గలదు. మహాసృష్టిప్రళయములలో నేనియమములుండునో, మన్వంతరములయందును నుండును. ప్రళయములోఁ బ్రపంచము సర్వనాశమై శూన్యముగాక, దానిబీజములగు వాసనలు, (సంస్కారములు) నిల్చియుండి, మిగిలిన సృష్టిలోఁదిరిగి వృద్ధినొందును. మహాప్రళయములోను, ప్రళయములోను లయించిన, ఋషులు, దేవతలు, సంస్కారయుక్తు లయినందున, వృక్షమునందు లీనమైయుండిన, పల్లవపుష్పఫలాదు లాయాఋతుధర్మము ననుసరించి, మఱల యావిర్భవించిన చందమున, సృష్ట్యాది (యుగాది) యందు, బూర్వకల్పమునం దొనరించిన కర్మోపాసనా తపఃప్రభావంబులంబట్టి, యాయానామరూపములను, ఆధికారికపదవులనుఁ బొంది ప్రకాశించుచున్నారనియుఁ జెప్పఁబడిన పురాణమునందుగలదు. పూర్వకల్పమున నేనామరూపములు వేదమందుఁ గలవో యానామరూపములనే పొందుచున్నారనిభావము.

## దేవతల భేదములు.

దేవతలు తైజసశరీరధారులు. వారు కర్మదేవతలు, ఆజానజానదేవతలు నని రెండు తెఱంగులు. కర్మదేవతలనగా భూలోకమున మానవులై యుండి,యజ్ఞదానాదిసత్కర్మముల ఫలాభిలాషతో నాచరించుటచే స్వర్గలోకమునకుఁ బోయి, యచ్చటనున్న యితరదేవతలతో సమానమయిన దేహములను బొంది, వారికంటెఁ గొంచెము తక్కువభోగము ననుభవించువారు. ఆజానజానదేవతలనగా (స్వాభావికదేవతలు) ఈకల్పమున జన్మప్రభృతి దేవతలుగఁ బుట్టినవారు: పూర్వకల్ప సృష్టి మందు మానవులుగనుండి యాకల్పముననుండు దేవతలఁగూర్చి సత్కర్మోపాసనలనుఁ జేసి, వారియనుగ్రహముచే నీకల్పమందు, వారిసమాననామరూపములతో దేవతలుగఁ బుట్టి లోకపాలనము జేయువారు. వీరు స్థాయికులు. యాయికులగు వారు పుణ్యావిశేషముచే దేవత్వమునుఁ జెంది యాపుణ్యము క్షీణించినంతట, మర్త్యలోకమును బొందెదరు. స్వర్గమునుగాని, కైవల్యమునుగాని చెందుటకు, మానవజన్మ ముత్తమమనియు, తపోభూమి

ల్పమునందలి దేవతలు; పూర్వకల్పమునందునున్న యాయాపేరులాయా యాకారములు గల దేవతలయధికారములను గోరి, వారివలెఁ దాము ను లోకోపకారమునుఁ గావింపవలయును నను, దృఢ సంకల్పములతో నాయగ్న్యాదిదేవతలను గూర్చి, యుత్కృష్ట కర్మోపాసనములనుఁ జేయఁగా, నీకల్పములో నాయాదేవతల నామములును, రూపములును గల ఆధికారికపదవులు వారికిఁగలిగెనని "అగ్నిర్వా అకామయత" యిత్యాది శ్రుతి చెప్పుచున్నది.

వీరందఱు, ఆధికారిక దేవతలయి, జగద్వ్యాపారమునందుఁ బర మేశ్వరునకు సాహాయ్యముచేసినట్లే, పూర్వకల్పములలోఁ జేసిన కర్మజ్ఞా నాదులచే, ఋషులు వేదకాండములను గనిపెట్టి, శిష్యులకు బోధచేసి, ధర్మాధర్మములనుఁ బ్రవర్తింపఁ జేయుచున్నారు. వీరిని కాండఋషు లందురు. పూర్వకల్పపుఁ గర్మమును,విద్యను,ననుభవమును నుత్తరకల్పము నందలి ప్రజలకుఁ గలుపుటకుఁ గొందఱు మహాపురుషులను బరమేశ్వ రుఁడు నియమించుననియు, వీరిపేర్లు శిష్టులనియు, వారే మనువులుగను, మహర్షులుగను, దేవతలుగను, పితృదేవతలుగను ననేక పర్యాయములు పుట్టి, తమ కర్మవిద్యానుభవములనుఁ బ్రవర్తింపఁ జేయుచు లోకరక్ష ణముఁ గావించుచున్నారని, శ్రీమత్స్యపురాణమున నీక్రింది నిర్వచన ముచేఁ దెలియఁబడుచున్నది.

శిష్టులు, వారిధర్మములు.

శ్లో. శిష్టే ర్ధాతోశ్చ నిష్ఠాంతా చ్ఛిష్టశబ్దః ప్రవక్ష్యతే,
మన్వంతరేషు యే శిష్టా ఇహ తిష్ఠంతి ధార్మికాః.
మను స్సప్తర్షయ శ్చైవ లోకసంతానకారిణః,
తిష్ఠంతీహ చ ధర్మార్థా స్తాం ఛిష్టాన్ సంప్రచక్షతే.
తై శ్శిష్టై శ్చరితో ధర్మ స్సమ్యతే నై యుగే త్రయీ,
వార్తావై దండనీతిశ్చ ప్రజా వర్ణాశ్రమేషు యా,
శిష్టై రాచర్యతే యస్మా త్పునశ్చైవ మనుక్షయే,
పూర్వైః పూర్వైర్గతత్వాచ్చ శిష్టాచార స్స శాశ్వతః.

శనైశ్చరో విశత్స్థాన మేవం శానైశ్చరం తథా.
బుధోఽపి వై బుధస్థానం స్వర్భాను ర్భానుమేవచ;
నక్షత్రాణితు సర్వాణి నక్షత్రాణ్యావిశంతివై.
జ్యోతీంషి సుకృతా మేతే జ్ఞేయా దేవగృహాస్తు వై,
స్థానాన్యేతాని తిష్ఠంతి యావదాభూతసంప్లవం.
మన్వంతరేషు సర్వేషు దేవస్థానాని యాని వై,
అభిమానినో ఽనుతిష్ఠంతి తాని దేవా పునఃపునః.
అతీతాంశ్చ సహాతీతై ర్భావ్యా భావ్యై స్సురై స్సహా,
వర్తంతే వర్తమానైస్తు సురై స్సార్ధంతు స్థానినః.

తీవ్రతపస్సుఁ జేసినవారికిఁ జెప్పఁబడిన జ్యోతిర్మండలములే దేవతాస్థానము లగును. ప్రతిమన్వంతరమందును, అభిమానిదేవత దేవస్థానములగు జ్యోతిర్మండలముల నాశ్రయింతురు. భూతభవిష్యద్వర్తమానకాలిక దేవతలతోడి, స్థానికదేవతలు కలిసియుందురు.

శ్లో. సూర్యో దేవో వివస్వాంశ్చ అష్టమస్త్వదితేస్సుతః,
ద్యుతిమాన్ ధర్మయుక్తస్తు సోమో దేవో వసుస్స్మృతః.

ప్రకృతము సూర్యమండలము నధిష్ఠించిన యభిమానిదేవత,అదితిపుత్త్రులలో నష్టముఁడగు వివస్వంతుండు, చంద్రమండలము నధిష్ఠించి యభిమానిదేవత, అష్టవసువులలోఁ దృతీయుండగు సోముడు ననియిట్లు దేవతాస్థానము లాశ్రయించిన యభిమానిదేవతల నామములు చెప్పబడినవి. వానివివర మాయాసందర్భముల యందు విశదీకృతమగును.

ఆధునికాధికారిక దేవతలు,

నక్షత్రేష్టిలోఁ దైత్తిరీయ శ్రుతియందువర్ణించిన అగ్ని, ప్రజాపతి సోముఁడు, రుద్రుఁడు, ఋక్ష, బృహస్పతి, దేవాసురులు, పితరులు, అర్యముఁడు, భగుఁడు, సవిత, త్వష్ట, వాయువు, ఇంద్రాగ్ని, పౌర్ణమాసి మిత్రుఁడు, ఇంద్రుఁడు, ప్రజాపతి, వరుణుఁడు, బ్రహ్మ, విష్ణువు, వసువు ఇంద్రుఁడు, అజుఁడు, అహిర్బుధ్న్యుఁడు, పూషుఁడు, అశ్వినులు యముఁడు, అమావాస్య, చంద్రుఁడు, అహోరాత్రులు, ఉషా, నక్షత్రము, సూర్యుడు, అదితి, విష్ణు, నను నామరూపములుగల యాక

కారణ్య నదీనద భేదములచే భూమండలమునువిభజించి, స్వాంశసంభూతులగు మనువును, తద్వంశీయులనుం బ్రజాపాలనాధికారమునందు నియుక్తులంగావించి, ధర్మమునశించి, యధర్మ మభివృద్ధిం గాంచినపుడు ధర్మసంస్థాపనకై యప్పుడప్పు డవతారమెత్తి భక్తులం బ్రోచుచుండును. ముస్నందు ప్రతిమన్వంతరమున నింద్రాది దేవతలు, ఋషులు, భగవదవతారము, ధర్మప్రవర్తనమును వివరింపంబడును. మనువులు, దేవతలు, ఋషులు ప్రతికల్పమునందు సమాననామరూపములతోం బుట్టి, పూర్వకల్పమునందలి మను, చంద్ర, వ్యాసాది, నామరూపధారులై జగద్వ్యాపారము నొనరింతురు. వీరందఱు జీవన్ముక్తులైన యాధికారికపురుషులు. పూర్వకల్పములో లోకసంరక్షణకొఱకు నుత్కృష్టజీవులు. విశేషముగం గర్మోపాసనములు తపస్సుం గావించినవో నీశ్వరానుగ్రహమున సృష్టిస్థితిలయముల నొనరింప, బ్రహ్మేంద్రమను రుద్రాంతకాది ఆధికారిక పదవులం బొందెదరు. ఇంద్ర, చంద్ర, సూర్య, మను, వ్యాసాదినామములు ఆధికారికస్థానములు గాని, యందధిష్ఠించిన మహాపురుష నామధేయములు వేఱుగనుండును. ఆయాధికారికస్థానముల నాశ్రయించిన వారా యాధికారికనామములచేతనే పిలువంబడుచుందురు అనేకసహస్రసంవత్సరములు దుస్సహమగు తీవ్రతపస్సు నొనరించుటంజేసి, పరమేశ్వరు ననుగ్రహమ్మున నాయాధికారికపదవులం బొందెదరని యిదివఱలోం జెప్పంబడెను. ఈవిషయము శ్రీమత్స్యపురాణ ౧౨౮ అధ్యాయమునందు సవిస్తరముగం జెప్పంబడినది.

## దేవతాస్థానములు

సూర్యచంద్రాంగారకాది గ్రహమండలములును, ఇతర జ్యోతిర్మండలములును, సప్తర్షిమండలమును, ధ్రువమండలమును లోనగునవి యన్నియు, దేవతల స్థానములని యీక్రిందిశ్లోకములచే స్పష్టమగును.

శ్లో॥ మన్వంతరేషు సర్వేషు ఋక్షా స్సూర్యగ్రహాశ్రయాః,
తాని దేవగృహాణి స్యు స్థానాఖ్యాని భవంతి హి.
సౌరం సూర్యో విశత్స్థానం సౌమ్యం సోమ స్తథైవచ,
శౌక్రం శుక్రో విశత్స్థానం షోడశారప్రభాస్వరమ్.
బృహస్పతి ర్బృహంతంచ లోహితం చాపిలోహితః,

తరకల్పమున మన్వంతరకాలము. అంతరాంతరకల్ప మన చతుర్యుగాత్మక మగు మహాయుగకాలము. ఇట్టి కల్పములందు లోకముల సృజించునెడ, చతుర్ముఖబ్రహ్మ మరీచ్యత్రిదక్షాదిప్రజాపతులు కాలము, భూతములు, వీనిలో రజోగుణాంశమునను; పాలించునెడ విష్ణుండు మనువు, ఇంద్రాదిదేవగణంబులు మహీపతులు, వీనిలో సత్త్వగుణాంశమునను; నాశము గావించునెడ శ్రీరుద్రుండును, అన్యాంతకాదులును, కాలమును, భూతములును, వీనిలో తమోగుణాంశమునను ప్రవేశించి; పరమేశ్వరుం డగు శ్రీహరి నానాశక్తి విలసితుండై లోకములకు సృష్టిస్థితిలయములు గావించుచుండును. బ్రహ్మేంద్రాదిదేవతలును, ప్రజాపతులును, మన్వాదులును, అన్యాంతకాదులును, కాలము, భూతములును, భగవంతుని మాయా విభూతులేగాని వేఱొండుగాదు. ఈవిషయమునే శ్రీవిష్ణుపురాణమునందు ఇట్లు వివరించిరి:—

శ్లో. సృజత్యేష జగత్సృష్టౌ స్థితౌ పాతి సనాతనః,
హంతి చైవాంతకత్వేన రజస్సత్త్వాదిసంశ్రయః
చతుర్విభాగస్సంసృష్టౌ చతుర్ధా సంస్థితస్స్థితౌ,
ప్రళయంచ కరోత్యంతే చతుర్భేదో జనార్దనః.
బ్రహ్మదక్షాదయః కాల స్తథైవాఖిలజంతవః,
విభూతయో హరే రేతా జగత స్సృష్టిహేతవః.
విష్ణు ర్మన్వాదయః కాల స్సర్వభూతాని చ ద్విజ,
స్థితే ర్నిమిత్తభూతస్య విష్ణో రేతా విభూతయః.
రుద్రః కాలాంతకాద్యాశ్చ సమస్తాశ్చైవ జంతవః,
చతుర్ధా ప్రళయాయైతా జనార్దనవిభూతయః.

మొదట బ్రహ్మయు, పిమ్మట మరీచ్యాది ప్రజాపతులును, కాలమును, భూతములును, భగవత్ప్రేరితములై జగత్తును సృష్టింపఁగ, నందలి ప్రజలకు చోరాదులవలన బాధకలుగకుండ రక్షించుటకు మనువు, మహర్షులు, ధర్మములనెఱిఁగిన మనుసంతతివారలు మహీపతులై పాలింతురు. వీరలందఱును భగవద్విభూతు లనియే చెప్పఁబడెను.

ఆధికారిక దేవతలు పూర్వకల్పతపస్సు.

అచింత్యశక్తి విలసితుఁడగు భగవంతుఁడు, ద్వీపవర్ష సముద్రపర్వ

## సృష్టి విస్తరించిన విధము.

శ్లో. సంకల్పా ద్దర్శనా త్స్పర్శా త్పూర్వేషాం సృష్టి రుచ్యతే,
దక్షా త్ప్రాచేతసా దూర్ధ్వం సృష్టి ర్మైథునసంభవా.

పూర్వకాలంబున సంకల్పమువలనను, దర్శనమువలనను, స్పర్శనము వలనను సృష్టి కలుగుచుండెడినియు, దక్షునకుఁ దర్వాత మైథునక్రియవలనఁ సృష్టిగలుఁగుచున్నట్లుల శ్రీమత్స్యపురాణమునఁ దెలియుచున్నది. బ్రహ్మ మానసపుత్త్రులగు ప్రజాపతులు కొందఱు సంకల్పము వలనను, మహర్షులు దర్శనస్పర్శనములవలనను సృష్టి నొనరించిరి. ఇంకను సృష్టి విస్తరింపవలెనని చింతించు బ్రహ్మదేవుని దేహమున ద్వేధాదృశ్యమానమగు కాయం బొకటి యుద్భవిల్లె. ఆరెంటిలో నొకటి పురుషరూపంబును, వేఱొకటి స్త్రీరూపంబునై మిథునం బయ్యె. అందుఁ బురుషుండు స్వాయంభువగు మనువును, స్త్రీయతని భార్యయగు శతరూపయు నైరి. స్వయంభువువలన నుత్పత్తి యగుటంజేసి, స్వాయంభు వనఁబడునని యిదివఱలోఁ జెప్పఁబడెను. ఈయాదిమనువు, స్వరాట్ (చక్రవర్తి) పదము నధిష్ఠించి యెల్ల ధర్మములను స్థాపించి భూలోకప్రజాపాలనము గావించెను. నాటంగోలె భువిజులు మానవు లనఁబడుదురు. ఈస్వాయంభువ మన్వంతరమే సృష్టికల్పమునకుఁ బ్రారంభము గనుక, యిందు దేవపితృమనుష్య తిర్యగాది స్థావరజంగమాత్మకనానావిధసృష్టిఁగావింపఁబడును మహాపురుషుల జీవితమునకును, వారిచరిత్రాంశములకునుఁ గాల మత్యావశ్యకము గనుకను కాలమునుబట్టి చరిత్రాంశములను విమర్శించుటయే ఆధునిక చరిత్రకారుల మతము కాబట్టియు, మొదటకాలమును, పిమ్మట నందు జరిగిన చరిత్రాంశములు లోనగునవి తెలుపునదియే మన్వంతర మని ప్రాచీనులు వ్యవస్థ నేర్పఱిచిరి. మన్వంతరమునకన్న గొప్పదికల్పము. కల్పాది (సృష్ట్యాది) యందు ప్రళయార్ణవమున మునిఁగియున్న భూమి కన్పించకయుండ, బ్రహ్మాది దేవతలు శ్రీ మహావిష్ణువును బ్రార్థింప, హరి శ్వేతవరాహావతార మెత్తి, రసాతలమునుండి భూమినిఁ బైకెత్తి పర్వతారణ్య ఖగమృగాదుల తోడ ప్రకాశింపఁజేసినందున, శ్వేతవరాహకల్పమని యీకల్పమునకు వ్యవహారముకలదు మహాకల్పమన హిరణ్మయాండమునుండి చతుర్ముఖ బ్రహ్మ జనించిన కాలము. కల్పమన బ్రహ్మకుఁ బగటికాలము. అహం

విరించి ర్భగవా న్యత్ర తత్ర దేవీ సరస్వతీ.
భారతీ యత్ర యత్రైవ తత్ర తత్ర ప్రజాపతిః,
యథా రవే శ్చ రహితా ఛాయా నో దృశ్యతే క్వచిత్.
గాయత్రీ బ్రహ్మణః పార్శ్వం తథైవ న విముంచతి,
వేదరాశి స్స్మృతో బ్రహ్మా సావిత్రీ తమధిష్ఠితా.
తస్మా న్న కశ్చి ద్దోషస్స్యా త్సావిత్రీ గమనా ద్విభోః,
తయా వినా ఽజ్ఞానయుతః ప్రజాపతి రభూ త్పురా.

మాత్స్యే ౪-అధ్యాయే.

అర్థమును, వాక్కనుసరించినట్లు, సూర్యుని ఛాయ యాశ్రయించినట్లు, పురుషుని ప్రకృతి విడనాడనట్లు, వేదమయుఁడగు బ్రహ్మను, వేదమయియగు సరస్వతి (సావిత్రి, గాయత్రి) యాశ్రయించి యుండుననియు, నెచ్చట స్త్రీవాచకము లుండునో యవి లక్ష్మీస్వరూపములనియు, నెచ్చట పురుషవాచకము లుండునో అవి నారాయణస్వరూపములనియు, శ్రీవిష్ణుపురాణమందును, మత్స్యపురాణమందునుఁ జెప్పఁబడియున్నది. సూర్యునివలనఁ బుట్టిన కాంతి సూర్యుని, చంద్రునివలనఁగలిగిన జ్యోత్స్న చంద్రుని, పుష్పమువలనఁ బొడమిన సౌరభము పుష్పము నాశ్రయించినందున నెట్లుదోషములేదో, అట్లే వేదమయుఁడగు బ్రహ్మవక్త్రమునుండి జనించిన వాగ్దేవి (సరస్వతి-సావిత్రి-గాయత్రి), బ్రహ్మ నాశ్రయించుట దోషముకాదని, పైఁజెప్పఁబడిన శ్లోకములవలన స్పష్ట మగుచున్నది. ఇట్లు వేదమయి యగు (వాగ్దేవి) గాయత్రితోడ ననురక్తుఁడై శతదివ్యాబ్దము లుండగఁ దనతోడ సమానతపః ప్రభావశక్తులుగల మనువు జనించెను. స్వాయంభువువలన జనించుటంజేసి స్వాయంభువమనువని చెప్పఁబడును. ఇంకను నెట్లుసృజింతునని చింతించుచున్న నాపద్మసంభవుని చతుర్ముఖముల నుండి, చతుర్వేదములును, ఉపవేదములును, చాతుర్హోత్రంబగు యజ్ఞవిస్తారంబును, వర్ణాశ్రమచతుష్టయంబును గలిగెను. తపః ప్రభావంబునఁ గలిగిన బుద్ధివిశేషమునకు వేదములు స్ఫురించినందునఁ బూర్వాకల్పము నందువలె నామరూపములతో నీ చరాచరప్రపంచమును సృజింతునని శ్రీమన్నారాయణు ననుగ్రహమ్మున నుత్సాహశక్తి యతనికిపొడమెను.

వశిష్ఠః పరమేష్ఠీచ వివస్వా న్సోమ ఏవచ,
కర్దమ శ్చాపి యఃప్రోక్తః క్రోధో ఽర్వాక్క్రీత ఏవచ.
ఏకవింశతి రుత్పన్నా స్తే ప్రజాపతయ స్స్మృతాః,

ఇట్లు సృజించుచుండిన, బ్రహ్మ తన వక్త్రమునుండి పుట్టిన వాగ్దేవినిఁ జూచి, యేమి సౌభాగ్య మేమి యందమని తలఁచుచు నధర్మ మని యెంచక కామించగ, మరీచిముఖ్యులగు పుత్త్రులు చని మహాత్మా కామమును నిగ్రహింపక, నీబోటి ధర్మాత్మునకుఁ గూతుఁ గామింపఁదగునా? ఇట్టిది పూర్వు లనుష్ఠించినది కాదు. ఇది తేజస్వివరులకుఁ గీర్తికరము గాదు. మీయట్టివారి యాచారము ననుసరించియే కదా లోకము క్షేమము నందవలయును. ఆత్మప్రకాశంబున నాత్మనిష్ఠ మగు నీజగంబు నెవఁడు వ్యక్తీకరించెనో యాభగవంతునకు నమస్కరింతుము. ఆపరమేశుఁడే ధర్మముఁ బాలించుఁగాక యని పలుకుచున్న తనపుత్త్రులనుఁ జూచి ప్రజాపతి సిగ్గుపడి యామేనును త్యజించె. దానిని దిక్కులు గ్రహించె. నదియే నీహారతమస్సయ్యె నని శ్రీభాగవతమునందుఁ గలదు. పరమార్థమునుఁ బరిశీలింప నిర్దోష మని శ్రీమత్స్యపురాణమందుఁ గలదు. సరస్వతి, సావిత్రి, గాయత్రి యను నీమువ్వురను వేదమయీశక్తి స్వరూపము. బ్రహ్మ వేదమయుఁడు, పుష్పమున పరిమళము, సూర్యుని ప్రభయు, చంద్రునిచంద్రికయు నవి నాభావసంబంధముగ నాశ్రయించి యున్నట్లు వేదమయుఁడగు బ్రహ్మను, వేదమయి యగు వాగ్దేవి యాశ్రయించి యున్నటుల చెప్పినందున దోషమేమియుఁ గన్పింపదు. చతుర్ముఖముఖాంభోజవనవీథివిహరించు, వాగ్దేవిని, రాజహంసిగ వర్ణింతురు.

శ్లో. దివ్యతేజోమయీ రూపదివ్యజ్ఞానసముద్భవా,
న మర్త్యై రత్ర శక్యా వేదితుం మాంసచక్షుషా.

దివ్యజ్ఞాన దివ్యరూపదివ్యతేజోమయతత్త్వమును, మాంసచక్షుష్కులగు, మర్త్యులచేఁ దెలిసికొన నశక్యము. మర్త్యస్వభావమువలె దివ్యతత్త్వ మున్నట్లు తలంపఁగూడదు.

శ్లో. అయంచ సర్వవిద్యానా మధిష్ఠాతా చతుర్ముఖః,
గాయత్రీ బ్రహ్మణ స్తత్ర హ్యంగజాతా నిగద్యతే
అమూర్తి మూర్తిమ ద్వాఽఽది మిథునం తత్ప్రచక్షతే,

దేవుఁడు శంకించి అయ్యా! అతితీవ్రదృష్టులచే లోకమెల్లఁ గాల్చుచున్న యీప్రజల నింక సృజియింపవలదు. దీనిం జాలించి సర్వభూతములకు సుఖముఁ గలిగించు తప మాచరింపుము. దానఁ బూర్వకల్పమున నున్నరీతి ప్రజల సృజియింపఁగలవు. తపంబన సామాన్యము కాదు. తపస్సుచేతనే పురుషుండు, సర్వభూత హృదయాంతర్గతుండుచు, పరంజ్యోతీరూపుఁడు నగు నధోక్షజుం బ్రాపించునని చెప్పిన, నీలలోహితుండు, వల్లెయని ప్రదక్షిణము చేసి పీడ్కొని తపముసేయ వనమున కరిగెను. ఇది నీలలోహితరుద్ర సృష్టివిధానము పిమ్మట, బ్రహ్మసంభవుఁడు మఱల సృష్టింప నాలోచింపుచుండ, భగవచ్ఛక్తియుక్తిం జేసి, నవబ్రహ్మలు మానస పుత్త్రులుగ నుదయించిరి. నాఁడునిత్తోఁడఁ బదుగురు లోకసంతానహేతువులై, యాస్వయంభువు నవయవముల నుండి జనించిరి.

శ్లో. మరీచి రత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః,
భృగు ర్వశిష్ఠో దక్షశ్చ దశమ స్తత్ర నారదః.

1 మరీచి, 2 అత్రి, 3 ఆంగిరసుఁడు, 4 పులస్త్యుఁడు, 5 పులహుఁడు, 6 క్రతువు 7 భృగువు, 8 వసిష్ఠుఁడు, 9 దక్షుఁడు, 10 నారదుఁడు, అందు స్వయంభువుని యుత్సంగంబున నారదుఁడు అంగుష్ఠమున దక్షుఁడు, ప్రాణమున వసిష్ఠుఁడు; త్వక్కున భృగువు; హస్తమునఁ గ్రతువు, నాభినుండి పులహుఁడు, కర్ణములఁ బులస్త్యుఁడు, ముఖమునననంగిరసుఁడు, నేత్రముల నత్రియు, మనస్సున మరీచియుఁ బ్రభవించిరి వీరలు ప్రజాపతులనియు, బ్రహ్మలనియు చెప్పఁబడియెదరు. మఱియు బ్రహ్మదక్షిణభాగంబున నారాయణమూర్తి యగు ధర్మంబును, పృష్ఠభాగంబున లోకభీకరమృత్యు వగు నధర్మమును, హృదయమున గామంబును, భ్రూయుగ్మంబున క్రోధంబును; అధరోష్ఠమున లోభంబును, వక్త్రంబునవాక్కును, సముద్రములును, మేఢ్రమున నిరృతియు, పాయువునలనఁ బాపాశ్రయంబును, ఛాయవలన దేవహూతి పతియగు కర్దముండును దేహావయవములనుండి జనించిరి. హిరణ్యగర్భుని దేహావయవములనుండి జనించినను, మనస్సంకల్పము ముఖ్యము గనుక, మానసపుత్త్రులనియే చెప్పఁబడుదురు మహాభారత మోక్షధర్మపర్వమునందు, ఏకవింశతి (21) ప్రజాపతులుకలరని యున్నది.

శ్లో. బ్రహ్మా స్థాణు ర్మను ర్దక్షో భృగు ర్ధర్మ స్తథాయమః,
మరీచి రంగిరాఽత్రిశ్చ పులస్త్యః పులహః క్రతుః,

సనందన, సనత్కుమార సనత్సుజాతీయులను నలువురు మానసపుత్త్రులు గలిగిరి. వారినిఁజూచి, పుత్త్రులారా? ప్రజలసృజియింపుఁడని నియోగింపగ, వారలు మోక్షధర్మనిరతులును,వాసుదేవపరాయణులు నైనందున నివృత్తిమార్గప్రవర్తకులై సృష్టిఁ గావింపరయిరి. వారట్లు తనయాజ్ఞను నిరాకరించినందునఁ గలిగిన క్రోధము నెంతయణఁచుకొనినను నణఁగక, యాయన భ్రూమధ్యమునుండి నీలలోహితుఁ డను కుమారుఁ డుద్భవించి యేడ్చుచు, నోజగద్గురూ! నాకు నామంబులను, స్థానంబులను నిరూపింపు మని యడుగ నాపద్మసంభవుం డాకుమారుని వాక్యములనాలించి, మృదుభాషణంబుల నూఱడించుచు నయ్యా విలపింపవలదు. భయభ్రాంతుఁడగు బాలునిచందమునఁ దొలుత రోదనము సేయుటంజేసి, ప్రజలు నిన్ను రుద్రుఁడని పలుకుదురు.

| స్థానములు. | నామములు. | స్త్రీలు. |
|---|---|---|
| 1 హృదయము, | 1 మన్యు | 1 ధీవృత్తి |
| 2 ఇంద్రియములు, | 2 మను | 2 అశనా |
| 3 ప్రాణము, | 3 మహాకాల | 3 ఉమా |
| 4 ఆకాశము, | 4 మహత్ | 4 నియుత్ |
| 5 వాయువు, | 5 శివ | 5 సర్పి |
| 6 అగ్ని, | 6 ఋతధ్వజ | 6 ఇళా |
| 7 జలము, | 7 ఉరురేత | 7 అంబికా |
| 8 భూమి, | 8 భవ | 8 ఇరావతీ |
| 9 సూర్యుఁడు, | 9 కాల | 9 సుధా |
| 10 చంద్రుఁడు, | 10 వామదేవత | 10 దీక్షా |
| 11 తపస్సు, | 11 ధృతవ్రత | 11 రుద్రాణీ |

ఈపదునొకండు స్థానములను, నామములను; స్త్రీలను గ్రహించి ప్రజాపతివి గనుక; బహుప్రజల సృజియింపుమని నియమించె. తదాజ్ఞాప్రకారము నీలలోహితుఁడు ప్రజాసర్గమున కుద్యమించి, తనబలమునకు నాకృతికి స్వభావమునకుఁ దగినట్లు సృజియింపగ రుద్రగణము లసంఖ్యాకములై జగమంతటను నావరించి మ్రింగుటఁ జూచి, బ్రహ్మ

ధరసర్గము, 7 కిన్నరకింపురుషాదిసర్గము, 8 భూత ప్రేత పిశాచసర్గము ననీ యెనిమిదివిధములు.

గణ దేవతా భేదములు.

శ్లో. ఆదిత్యా స్తుషితా విశ్వాస్సాధ్యాభాస్వర మారుతాః,
మహారాజికరుద్రాశ్చ వసవో గణ దేవతాః.
ఆదిత్యా ద్వాదశ ప్రోక్తా స్తుషితా స్త్రింశదేవ హి,
విశ్వేదేవా దశ ప్రోక్తా స్సాధ్యా ద్వాదశ కీర్తితాః.
ఆభాస్వరా శ్చతుష్షష్టి ర్వాతాః పంచాశదూనకాః,
మహారాజికనామానో ద్వేశతే వింశతి స్తథా.
రుద్రా ఏకాదశ ప్రోక్తా వసవో ఒష్టౌ సమీరితాః.

ఇతి శబ్దరత్నావళ్యాం.

సదారా విబుధా స్సర్వే స్వానాం స్వానాం గణై స్సహా,
త్రైలోక్యే తత్త్రయస్త్రింశ త్కోటిసంఖ్యా యథాభవ.

ఇది పాద్మోత్తరఖండే.

ఆదిత్యులు, తుషితులు, విశ్వులు, సాధ్యులు, ఆభాస్వరులు, మరుత్తులు, మహారాజికులు, రుద్రులు, వసువులని గణదేవతలు నవవిధములు. అందాదిత్యులు పన్నిద్దఱు, (12) తుషితులు, ముప్పదుగురు. (30) విశ్వేదేవతలు పదుగురు, (10) సాధ్యులుపన్నిద్దఱు, (12) ఆభాస్వరులు, అఱువదినలుగురు, (64)మరుద్దేవతలు, నలువదితొమ్మండ్రు, (49) మహారాజికులు, ఇన్నూటయిరువది, (220)రుద్రులు, పదునొకండుగురు,(11)వసుదేవతులు, ఎనమండ్రు, (8) దేవతలందఱు, వారివారిభార్యలతోడను, గణములతోడను గూడి, ముప్పదిమూడుకోట్లసంఖ్యాకులు, ముల్లోకముల యందును సంచరింతురు.

చతుర్ముఖబ్రహ్మ మొట్టమొదట తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్ర మను నవిద్యావృత్తుల నైదింటిని సృజించి, పాపాత్మకమైన యాసృష్టికి మనంబునమెచ్చక, భగవద్ధ్యానపూరితంబగు మనస్సునందంతకన్న నుత్తమోత్తమంబగు సృష్టికుద్యమింప, నిష్క్రియులును, ఊర్ధ్వరేతస్కులును, జ్ఞాననిష్ఠులునగు సనక,

స్వాయంభువు సృజించెనని శ్రుతియు నుడువుచున్నది. భూమి నాధారముఁ జేసికొని సంచరించుచు నందుత్పత్తియగు నాహారముచే జీవించువారలు నరులని భావము.

శ్లో. తేచ ప్రకాశబహులా స్తమోద్రిక్తా రజోఽధికాః,
తస్మాత్తే దుఃఖబహులా భూయోభూయశ్చ కారిణః
ప్రకాశా బహిరంతశ్చ మనుష్యా స్సాధకా స్తు తే,

తమోగుణాధికు లగుటవలన దుఃఖవంతులును, రజోగుణాధికు లగుటవలన కర్మపరులును, బాహ్యాభ్యంతరములయందు ప్రకాశబాహుళ్యము గలవారగుటచేఁ బ్రకృష్ట జ్ఞానవంతులును, కర్మాధికారులునై సాధకులుగ నెన్నఁబడుదురని శ్రీవిష్ణుపురాణమునందుఁ గలదు. ఇంతకు మున్నుఁ జెప్పఁబడిన మూఁడును, వైకృతసర్గము లనఁబడు.

౧౦. ప్రాకృత వైకృతోభయాత్మక కుమారసృష్టి దశమసర్గము.

శ్లో. వైకృతా స్త్రయ ఏవైతే దేవసర్గశ్చ సత్తమ,
వైకారిక స్తు యః ప్రోక్త కౌమార స్తూభయాత్మకః

దేవసర్గము వైకారికనామధేయం బనియుఁ, బ్రాకృతసర్గములలోఁ బంచమంబనియు నిదివఱలోఁ జెప్పఁబడెను. సనత్కుమారాదులు, దేవభావమునను, మనుష్యభావమునను దనరి, పూజనీయు లవుటం జేసి వారిసృష్టి కేవలప్రాకృతంబును, కేవలవైకృతంబును గాక, యుభయాత్మకంబై దశమసర్గ మనంబరగు. ప్రాకృతప్రళయావసరంబున సృష్టింపఁ బడుటవలన సనత్కుమారాదులు ప్రాకృతసర్గములోని వారనియు, నీలలోహితకుమారసృష్టి వైకృతసర్గములోనిదనియు, ప్రతికల్పమున గావింపఁ బడుననియు, సనత్కుమారాదు లటుగాక ప్రాకృతప్రళయము వఱకునుండి బ్రహ్మతోడఁ బరమాత్మయందు లయింతురనియుఁ గొందఱు నుడువుదురు. సనత్కుమారాదులసృష్టి, వైకృతసర్గములోఁ జేరినదయినను, ప్రతికల్పమునఁ గావింపఁబడదని తెలియనగును. ఈప్రాకృతసర్గములు జగత్సృష్టికి మూలహేతువులు.

వైకృత దేవసృష్టి భేదములు

వైకృతమగు దేవసృష్టి, 1 దేవసర్గము, 2 పితృసర్గము, 3 అసురసర్గము, 4 గంధర్వాప్సరస్సర్గము, 5 యక్షరాక్షససిద్ధసర్గము, 6 చారణవిద్యా

ఉత్పథగ్రాహిణ శ్చైవ తేఽజ్ఞానే జ్ఞానమానినః.
అహంకృతా అహంమానా అష్టావింశద్విధాత్మకాః,
అంతఃప్రకాశా స్తే సర్వే హ్యావృతాశ్చ పరస్పరమ్.

భక్ష్యాభక్ష్యాగమ్యాగమ్యాది వివేకరహితము లయినవి. అజ్ఞాన మధికముగఁ గలవి, అజ్ఞానమందు జ్ఞానాభిమానము గలవి, అహంకారాభిమానము లధికముగఁ గలవి, అంతఃప్రకాశము లనఁగా: సుఖాదుల యందు ప్రకాశమే కాని ప్రకృష్టజ్ఞానశూన్యము లయినవియు నగు, పశ్వాదులు అష్టావింశతి విధాత్మకములని శ్రీవిష్ణుపురాణమందుఁ జెప్పఁబడియె. ఈయిరువదియెనిమిది రూపములగు బుద్ధివిధములు సాంఖ్యశాస్త్రమునందు విశదీకృతము.

ఇరువదియెనిమిదివిధము లగు తిర్యగ్జంతువు లెవ్వియనిన? గోవు, అజము, మహిషము, కృష్ణసారము, సూకరము, గవయము, రురువు, గొఱియ, యుష్ట్రమను ద్విశఫంబులు తొమ్మిదియు; గర్దభము, అశ్వము, అశ్వతరము, గౌరము, శరభము, చమరియను నేకశఫంబులాఱును, కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ఏదు, సింహము, ఏనుగు, కోఁతి, తాఁబేలు, ఉడుము, అను పంచనఖంబులు పండ్రెండును. మకరాదు లగుజలచరజంతు సముదాయం బంతయునొకటిఁగ జేర్చి లెక్కింపఁగ, తిర్యగ్జంతువు లిరువదియెనిమిదివిధముల నొప్పెడు. ఖచరంబులగు కంక, గృధ్ర, బక శ్యేన హంస సారసాదులగు పక్షిజాతులనుకూడ తిర్యగ్జంతుగణంబులోనే గణింపవలయును. శ్రీవిష్ణుపురాణప్రకారము తిర్యగ్యోనిసృష్టి పంచమసర్గముగ నెన్నఁబడియె

౯. అర్వాక్స్రోతంబగు నరులసృష్టి-నవమసర్గము.

శ్లో. అర్వాక్స్రోతస్తు నవమ స్సర్గ ఏకవిధో నృణామ్,
రజోఽధికాః కర్మపరాః దుఃఖేచ సుఖమానినః.

రజోగుణప్రధానులై కర్మపరులై దుఃఖమును సుఖముగఁ దలఁచు నరుల యర్వాక్స్రోతం బగు సృష్టి నవమసర్గము. ఇది యేకవిధము. అర్వాక్స్రోతస్సనఁగ అధము (క్రింది) అధోగమనముగాని, అధస్సంబంధమగు నాహారము గలవారలసృష్టి యని వ్యుత్పత్త్యర్థము. (స్రు). పరాంచి ఖాని వ్యతృణత్స్వయంభూః; అధోముఖప్రసరణము గలుగున ట్లింద్రియముల

## ౭. స్థావరసృష్టి సప్తమసర్గము.

శ్లో. సప్తమో ముఖ్యసర్గస్తు షడ్విధ స్తస్థుషాంచయః,
వనస్పత్యోషధిలతా త్వక్సారా వీరుధో ద్రుమాః.
ఉత్స్రోతస స్తమఃప్రాయా అన్తస్స్పర్శా విశేషిణః.

మీఁదికి వ్యాపించుట, యవ్యక్తచైతన్యము నొందుట, యంతస్స్పర్శమాత్రంబు నెఱుంగుట, (స్పర్శమనఁగా శీతోష్ణాదిసుఖదుఃఖములు) అవ్యవస్థిత పరిణామంబుఁ మున్నగు నానాభేదంబు లొందుటయు ననునవి సాధారణలక్షణంబులుగాఁగల స్థావరములసృష్టి సప్తమసర్గమనఁబడు. ఈ స్థావరములు, వనస్పతి, ఓషధి, లతా, త్వక్సార, వీరుత్తు ద్రుమంబులనఁ బరగు నాఱువిధంబుల దమలో భేదముగలిగి వర్తిల్లు. పువ్వులు లేక ఫలించు నశ్వత్థోదుంబర పనస వటాదులు వనస్పతు లనఁబడు. పూచి ఫలపాకము తుదిగాఁగల వ్రీహియవముద్గాదు లోషధులు, పూవులు గాని పండ్లు గానిగలిగియారోహణానపేక్షంబులైన మల్లికా కారవల్ల్యాదులు లతలు, త్వక్కునందు బలముగల వెదురు మొదలగునవి త్వక్సారములు. లతలే కఠినంబులై యారోహణంబు సహించు నేని యట్టివి వీరుత్తులు. పూవులు పూచి కాయలుగాచునట్టి చూతప్రభృతులు ద్రుమము లనంబడు. వీనికిఁ బ్రకృష్టజ్ఞానము లేక తమోగుణావృతము లైనందున నంతస్సంజ్ఞ గలవి యనంబడు. "అంతస్సంజ్ఞా భవం త్యేతే సుఖదుఃఖసమన్వితాః" అని మనుస్మృతియందును గలదు:—

## ౮. తిర్యక్సృష్టి అష్టమసర్గము.

శ్లో. తిరశ్చా మష్టమ స్సర్గ అష్టావింశద్విధో మతః,
అవిదో భూరితమసో ఘ్రాణజ్ఞా హృద్య వేదినః.

ఉత్తరకాలవిచారంబుఁ గానక యాహారనిద్రాభయ మైథునజ్ఞాన మాత్రంబు గలిగి, ఘ్రాణేంద్రియమున నర్థములం గనుచు, దీర్ఘానుసంధానశూన్యంబులయిన యిరువదియెనిమిది తెఱంగుల నొప్పు తిర్యగ్జంతువుల యష్టావింశతివిధంబయిన సృష్టి యష్టమసర్గము. తిర్యగ్రూపముగ నాహారసంచారప్రవృత్తిగలవి పశ్వాదులు.

శ్లో. పశ్వాదయ స్తే విఖ్యాతా స్తమఃప్రాయా హ్యవేదినః,

వారు, బుద్ధికృత సృష్టిలోనివారనియుఁ దెలియఁదగును. మున్ముందు దేవతాసృష్టి విశదీకరింపఁబడును.

శ్రీవిష్ణుపురాణప్రకారము ఊర్ధ్వస్రోతోద్భవమగు దేవసృష్టి యారవదిగ గణింపఁబడియె.

౬. అవిద్యాసృష్టి (తామసము) షష్ఠసర్గము.

శ్లో. షష్ఠస్తు తమస స్సర్గో య స్త్వబుద్ధికృతః ప్రభోః,
షడిమే ప్రాకృతా స్సర్గాః వైకృతానపి మే శృణు.

జీవులకావరణ విక్షేపములఁ గావించు, పంచపర్వా విద్యాసృష్టి షష్ఠ సర్గమనఁబడు.

శ్లో. తమో మోహో మహామోహ స్తామిస్రో హ్యంధసంజ్ఞితః,
అవిద్యాపంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః.

తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము నని, యవిద్య పంచపర్వములు గలది. తమస్సనఁగా స్వరూపాప్రకాశము, అవివేకము. (అనాత్మయగు దేహాదులయం దభిమానము) మోహమనఁగా, దేహమునకు సంబంధించిన దారాపుత్రగృహక్షేత్రాదులయందు నాదియను నభిమానము. మహామోహ మనఁగా విషయభోగేచ్ఛ, తామిస్రమనఁగా భోగేచ్ఛకు విఘాతముఁ గలిగినం గలుగుక్రోధము, అంధతామిస్రమనఁగా దేహమునశించినం దానునశించునట్లు తలఁచుట ఈపంచపర్వావిద్యవలన (తామససృష్టి) జీవుల కావరణ విక్షేపములు కలుగుననియుఁ బ్రాయికముగ తమోగుణ భూయిష్ఠులుగ నుందురనియు, శ్రీభాగవతమునఁ జెప్పఁబడియె. ఈయవిద్యాపంచకమువలన వృక్షగుల్మలతా వీరు తృణజాతులన్నియుఁ గలిగెననియు, వీనికి బాహ్యమగు శబ్దాదివిషయమందును. ఆభ్యంతరమగు సుఖాదులయందునుఁ బ్రకృష్టజ్ఞానము లేనందునను, అజ్ఞానముచే నావృతము లగుటంబట్టియు, స్థావరరూపమగు ముఖ్యసర్గముగ శ్రీవిష్ణుపురాణమునందు వక్కాణింపఁబడెను. పూర్వోక్తములగు నాఱుసర్గములు, ప్రాకృతసర్గములని చెప్పఁబడును. చతుర్ముఖబ్రహ్మ బుద్ధిపూర్వకముగ సృజింపలేదనియు, నంతర్యామియగు పరమాత్మసంకల్ప మనఁదగు ప్రకృతివలన నుద్భవించెననియుఁ దెలియనగును. ఇఁకముందుఁ జెప్పఁబడునవి వైకృత సర్గము లని వ్యవహరింతురు.

ద్వితీయసర్గముగఁ బరిగణింపఁబడెను. అహంకారతత్త్వసృష్టి, ప్రథమసర్గమగు మహత్తత్త్వ సృష్టిలోఁ బరిగణింపఁబడినందున ప్రత్యేకముగఁ జెప్పలేదు

## ౪ ఇంద్రియసృష్టి-చతుర్థసర్గము.

శ్లో. చతుర్థ ఐంద్రియ స్సర్గో యస్తు జ్ఞానక్రియాత్మకః।

శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములను జ్ఞానేంద్రియపంచకము. వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకము. వీనిసృష్టి చతుర్థసర్గము. తైజసాహంకారతత్త్వమువలనఁ బొడమెనని యిదివఱలోఁ జెప్పఁబడియెను. శ్రీవిష్ణుపురాణమున "శ్లో. వైకారిక స్తృతీయస్తు సర్గ ఐంద్రియకస్స్మృతః" అని చెప్పఁబడినందున ఇంద్రియసృష్టి తృతీయమగు వైకారికసర్గముగఁ బరిగణింపఁబడినది. ఇంద్రియాధిష్ఠిత దేవతలు వైకారికసృష్టిలోఁ జేరినందున తత్సాహచర్యమున ఇంద్రియసృష్టి వైకారికముగఁ జెప్పఁబడియెను.

## ౫. దేవసృష్టి-పంచమసర్గము.

శ్లో. వైకారికో దేవసర్గః పంచమో యన్మయం మనః।

వైకారికనామధేయం బగు దేవసృష్టి పంచమసర్గము వైకారికనామ సాత్త్వికాహంకారమువలన మనస్సును, ఇంద్రియాభిమాని దేవతలగు అగ్నివరుణాశ్వినీ సూర్యవాయుప్రజాపతి మిత్రేంద్రాది దేవతలు నుద్భవించిరి. వైకారికమగు నీదేవతాసృష్టికి ఊర్ధ్వస్రోతస్సనియుఁ బేరుకలదు. "శ్లో. ఊర్ధ్వస్రోతా స్తృతీయస్తు సాత్త్వికోర్ధ్వ మవర్తత, తేసుఖప్రీతిబహుళా బహిరంతశ్చ నావృతాః॥ ప్రకాశా బహిరంతశ్చ ఊర్ధ్వస్రోతోద్భవా స్స్మృతాః" అను శ్రీవిష్ణుపురాణ వాక్యప్రమాణంబున, దేహమున కూర్ధ్వభాగంబున నుండు సాత్త్వికాంశ మనఁగా నమృతమాహారముగాఁ గలవారు కాఁబట్టి ఊర్ధ్వస్రోతోద్భవులని నామధేయము కలిగెను. సాత్త్వికఫలమగు సుఖమును, దానివలనఁబుట్టిన ప్రీతియు నధికముగఁ గలవారును; బాహ్యాభ్యంతరములయందు నావరణములేక ప్రకాశించువారును, సంతుష్టాంతఃకరణులు నగు దేవతలు, శ్రీభాగవతప్రకారము ప్రాకృతసర్గములోను, శ్రీవిష్ణుపురాణప్రకారము వైకృతసర్గములోనుఁ జేర్చినందున, హిరణ్మయాండోత్పత్తికిఁ బూర్వజనితులు. ప్రాకృతసర్గములోని వారు; అబుద్ధికృతసృష్టిలోని వారనియు, వైకృతసర్గములోని

శ్రీహరినుండి ప్రకృతిలోఁ గలిగినగుణములకు వైషమ్యమూ పాదించు మహత్తత్త్వంబు సృజించుట ప్రథమసర్గము.

సూ. “సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతేర్మహాన్” అను సాంఖ్యసూత్రప్రకారము, సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ; ప్రకృతి, ప్రధానము; అవ్యక్తము, అవ్యాకృతము. అని వ్యవహరింపఁబడు. ప్రకృతిపురుషాత్మకమగు నాత్మతత్త్వమునుండి గుణములు వైషమ్యముఁ జెందుటయనఁగా వికారముఁజెందుట మహత్తత్త్వమనఁబడు. ఇయ్యది బుద్ధితత్త్వము. వాగీశుం డధిష్ఠాన దేవత. అహంకారాదులకుఁ బ్రకృతియు, మూలప్రకృతికి వికృతియునగు. మూల ప్రకృతి దేనిచేతను వికృతినిఁజెందదు.

## ౨. అహంకారసృష్టి-ద్వితీయసర్గము.

శ్లో. ద్వితీయస్త్వహమో యత్ర ద్రవ్యజ్ఞానక్రియాదయః।

ద్రవ్యజ్ఞానక్రియాత్మకం బైన యహంకారసృష్టి ద్వితీయసర్గము. ద్రవ్యమనఁగా భూతపంచకము, జ్ఞానమనఁగా జ్ఞానేంద్రియపంచకము, క్రియ యనఁగాఁ గర్మేంద్రియపంచకము, వీనికి గారణమైనది యహంకారతత్త్వము. ఈ యహంకారతత్త్వము వైకారిక, తైజస, తామసములని త్రివిధమనియు నందు వైకారికము సాత్త్విక ప్రకృతి యగుటవలన మనస్సును, ఇంద్రియాధిష్ఠిత దేవతలును, తైజసము రాజసప్రకృతియగుట వలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియములును, తామసము భూతాది యగుట వలన పంచభూతములును, తన్మాత్రలును గలిగెనని యిదివఱలోఁ జెప్పఁ బడెను. పైనిజెప్పఁబడినవన్నియు నుత్పత్తియగుటకుఁ గారణమైన యహంకారతత్త్వము, కర్తృత్వాభిమానముగల చేతన రుద్రుఁ డధిష్ఠాన దేవత.

## 3. భూతసూక్ష్మసృష్టి-తృతీయసర్గము.

శ్లో. భూతసర్గ స్తృతీయస్తు తన్మాత్ర ద్రవ్యశక్తిమాన్।

భూతసూక్ష్మసృష్టితోడ మహాభూతములఁ బుట్టించుశక్తి సహాన్వితంబైన భూతసృష్టి తృతీయసర్గము. తన్మాత్రయనఁగా శబ్ద స్పర్శ రూప రస గంధములు ఇవియే భూతసూక్ష్మములు. ద్రవ్యమనఁగా పంచమహాభూతములు వీనినిఁబుట్టించు శక్తిగలది తామసాహంకారతత్త్వమువలన నివిపుట్టునని యిదివఱలోఁ జెప్పఁబడెను, శ్రీవిష్ణుపురాణమున “శ్లో. తన్మాత్రాణాం ద్వితీయశ్చ భూతసర్గస్తు సంస్మృతః” అని చెప్పఁబడుటవలన

నిర్విశేషం బ్రహ్మంతత్వాంబునై యొప్పు. దానిని నిమిత్తముగాఁ గొని పురుషుఁడు తన్నే ప్రపంచాకారమున లీలతో సృజించె. విష్ణుమాయాంశ సంభృతంబైన బ్రహ్మాత్మనాత్మతం జే యీవిశ్వంబు అవ్యక్తస్వరూపమగు కాలమున నిత్యాది పరిచ్ఛిన్నంబై వేఱువేఱుగఁ దోఁచుచుండు. ఈవిశ్వ మిప్పుడెట్లుగ గన్పించుచుండునట్లే పూర్వకల్పమునందు నుండె ఇఁక భవిష్యత్కల్పంబునందుఁ నుండఁగలదు. కాలము, సామాన్యలక్షణము విశేషలక్షణములతో నొప్పు. అందు లోకపరిచ్ఛేదకత్వము కాలసామాన్యలక్షణము-పరమాణు, త్రసరేణు ఘటికాది సంవత్సరాంత కాలభేదము విశేషలక్షణము కాలవిశేషలక్షణమును దెలియవలయుననిన దానికి నిమిత్తమగు సర్గభేదమునుఁ దెలియవలసియుండును.

బ్రహ్మకృతసర్గము (సృష్టి) దశవిధములు. వానిలోఁ బ్రాకృతసర్గములారు. వైకృతసర్గములు మూఁడు. ప్రాకృతవైకృతోభయాత్మకసర్గమొక్కటి సర్గమునకుఁ గాలద్రవ్యగుణములం జేసి ప్రళయము త్రివిధంబు. కాలప్రళయ మనఁగా, నీకాలమం దిట్లులయించవలె ననుట కాలనియామము. నిత్యప్రళయ మనఁబడు. ద్రవ్యప్రళయ మనఁగా. సంకర్షణముఖాగ్నిచే లయించుట నైమిత్తికమగు ద్వితీయప్రళయము. గుణప్రళయమనఁగ సత్త్వాదిగుణసామ్యముఁ జెందుట తృతీయమగు ప్రాకృతప్రళయము.

భూతభౌతిక సృష్టి భేదములు.

౧ మహత్తత్త్వసృష్టి ప్రథమము, ౨ అహంకారసృష్టి ద్వితీయము, ౩ భూతసూక్ష్మసృష్టి తృతీయము, ౪ ఇంద్రియసృష్టి చతుర్థము, ౫ దేవసృష్టి పంచమము, ౬ అవిద్యాసృష్టి షష్ఠము, ఈయాఱును ప్రాకృతసృష్టులు.

౭ స్థావరసృష్టి సప్తమము, ౮ తిర్యక్సృష్టి అష్టమము, ౯ మనుష్యసృష్టి నవమము ఈమూఁడును వైకృతసృష్టులు.

౧౦ ప్రాకృతవైకృతాత్మకమగు కౌమారసృష్టి దశమము. ఇట్లు సర్గములు దశవిధములుగఁ బరిగణింపఁబడియె. అందలి వివరము లీక్రింది విధమునఁ దెలియఁదగు—

౧ మహత్తత్త్వసృష్టి-ప్రథమసర్గము.

శ్లో. ఆద్యస్తు మహతస్సర్గో గుణవైషమ్యమాత్మనః.

చెను. ఆపరమపురుషుని ముఖబాహూరుపాదములనుండి, వేదాధ్యాపన, ప్రజాపాలన, కృషిగోరక్షణ, మహచ్ఛుశ్రూషాదివృత్తులతోడ బ్రహ్మక్షత్రవైశ్యశూద్రవర్ణంబు లుద్భవించె. కాలకర్మస్వభావశక్తియుక్తుండగు భగవంతుని యోగమాయాబలంబున నుజ్జృంభిత మగు నీవిరాట్స్వరూపంబున నిట్లు చరాచరంబులగు లోకంబు లుత్పన్నంబు లయ్యె. ఈపురుషుఁడు హిరణ్మయాండంబునుండి యుదయించినందున హిరణ్యగర్భుఁడనియు, సమష్టిచేతనుఁడయినందున సూత్రాత్మయనియు, స్వాయంభువనియు వ్యవహరింపఁ బడుచున్నాఁడు.

అవ్యక్తుఁడును, సనాతనుఁడును, సర్వభూతమయుఁడు నగు పరమేశ్వరుఁడు, తనయం దిమిడియున్న నిఖిలవిశ్వమును, మఱల సృష్టింపవలెనని సంకల్పము పొడమినపుడు, నప్పరమేశ్వరు నంతర్గతార్థము. కాలానుగతంబగు రజోగుణమున క్షోభమొంది విశ్వసృష్టిఁ గావింప నాభిదేశమునుండి వెడలె. జీవకర్మప్రతిబోధనంబయిన కాలమున నావెడలిన సూక్ష్మార్థంబు సూర్యుని రీతి నిజకాంతిపుంజముచే నెల్లెడల వెలిగించుచుఁ బద్మకోశంబై చూపట్టెను. జీవుల కుపభోగ్యము లగు సర్వార్థములఁ దోఁపఁ జేయు నాత్రిలోకాత్మకపద్మమును శ్రీమహావిష్ణు వంతర్యామియై ప్రవేశింప నందు వేదమయుండైన బ్రహ్మదేవుఁడు తనంత తా నుద్భవించుటం జేసి స్వాయంభు వనంబరఁగె. ఈవిషయమే మనుస్మృతియం దీక్రింది విధమునఁ జెప్పఁబడియె:—

శ్లో. యో౽సా వతీంద్రియగ్రాహ్యః సూక్ష్మో౽వ్యక్తః సనాతనః,
సర్వభూతమయో౽చింత్యః స ఏవ స్వయ ముద్బభౌ.
సో౽భిధ్యాయ శరీరాత్స్వా త్సిసృక్షు ర్వివిధాః ప్రజాః,
అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్.
తదండ మభవ ద్ధైమం సహస్రాంశుసమప్రభమ్,
తస్మిన్ జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోకపితామహః.

పరమాత్మ తనశరీరమునుండి వివిధ ప్రపంచమును సృష్టింపఁదలఁచి, జలములయందు తనవీర్యమును విడువగ నది సూర్యప్రకాశతుల్యమగు హిరణ్మయాండ మయ్యె. దానినుండి సర్వలోకపితామహుఁడగు బ్రహ్మదేవుఁ డుదయించి, యాపద్మకర్ణికపయిం గూర్చుండి లోకములం

నను, క్రియాశక్తియోగమునఁ బ్రాణాపానవ్యానోదాన సమానములు, నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయములను క్రమమున దశవిధముల నొప్పె. ఇయ్యదియే పరమాత్ముని యాధ్యాత్మరూపము. వ్యష్టిరూపము లగు ప్రాణుల కాత్మరూపంబై తదంశమనంబరగు. జగత్కారణములగు మహాదాదుల విజ్ఞానముఁదలంచి యీశ్వరుఁడా తత్త్వములకు వివిధవృత్తిలాభార్థము ఆత్మతేజ మగు చిచ్ఛక్తిచే నిట్లు సృష్టిచేయుదునని తలంచి తపస్సు చేయగ నతనికి గొన్ని దేవతాస్థానము లుదయించె. అవి యెట్లనిన—

| స్థానము. | సాధనము నింద్రియము. | అధిష్ఠానదేవత. |
|---|---|---|
| ౧ వక్త్రము | శబ్దోచ్చారణసాధనము-వాగింద్రియము | అగ్నిదేవుఁడు |
| ౨ తాలువు | రసజ్ఞానసాధనము-జిహ్వేంద్రియము | వరుణుఁడు |
| ౩ నాసికములు | గంధప్రతిపత్తిసాధనము-ఘ్రాణేంద్రియము | అశ్వినులు |
| ౪ నేత్రములు | రూపజ్ఞానసాధనము-చక్షురింద్రియము | సూర్యుఁడు |
| ౫ చర్మము | స్పర్శజ్ఞానసాధనము-త్వగింద్రియము | వాయువు |
| ౬ కర్ణములు | శబ్దగ్రహణసాధనము-శ్రోత్రేంద్రియము | దిక్కులు |
| ౭ మేఢ్రము | ఆనందప్రతిపత్తిసాధనము-రేతస్సు | ప్రజాపతి |
| ౮ గుదము | మలవిసర్గాదిసాధనము-పాయ్వింద్రియము | మిత్రుఁడు |
| ౯ హస్తములు | జీవికకుసాధనము-క్రయవిక్రయాదిశక్తి | ఇంద్రుఁడు |
| ౧౦ పాదములు | గంతవ్యదేశప్రాప్తిసాధనము-గతిశక్తి | విష్ణువు |
| ౧౧ హృదయము | సంకల్పవికల్పాది వికార ప్రతిపత్తిసాధనము } మనస్సు | చంద్రుఁడు |
| ౧౧ బుద్ధి | బోద్ధవ్యప్రతిపత్తిసాధనము-బోధము | వాగీశుఁడు |
| ౧౨ అహంకారము | కర్తవ్యప్రతిపత్తిసాధనము-చేతన | రుద్రుఁడు |

ఇట్లుత్పన్నము లగు స్థానములందు నాయాసాధనములు గల యింద్రియములతోడఁ బయినిఁ జెప్పఁబడిన యధిష్ఠాన దేవతలు ప్రవేశించిరి. మఱియు నా విరాట్పురుషుని శిరస్సులనుండి యుత్పన్నమయిన దివంబు నందు, సత్త్వగుణప్రాబల్యమునం జేసి దేవతలు చేరిరి. పాదములనుండి పుట్టిన భూమియందు, రజోగుణస్వభావు లగు మనుష్యులును, వారినాశ్రయించిన పశ్వాదులును నెలకొనిరి. నాభివలనఁ బుట్టిన యంతరిక్షమునను, తమోగుణస్వభావమునం జేసి రుద్రపారిషద భూతగణంబు లాశ్రయిం

శ్రీరామచంద్ర ప్రసీద.

# భూత, భౌతిక వివిధసృష్టి విచారములు.



ఇంతకుమున్ను చతుర్ముఖసృష్టికల్పమానమును, మన్వంతరకాల పరిమితియుఁ జెప్పఁబడియె. పిమ్మట, దేవతలు తదధికారములు, కాలపరిమితిఁ దెలిసికొనుటకు మున్ను సృష్టిస్వరూపము, అందలి భేదములు కనుఁగొనవలయును.

చిదేకరూపుం డగు పరమేశ్వరుఁడు సృష్టిసంకల్పమునొంద నవ్యక్త (అవ్యాకృత)మువలన, మహత్తత్త్వము; దానివలన నహంకారతత్త్వమునుఁ గలిగెను. ఈయహంకారతత్త్వము, వైకారిక, తైజస, తామసములని మూఁడువిధములు. అందు వైకారికాహంకారము సాత్త్విక ప్రకృతి యగుటవలన దానివలన మనస్సును, ఇంద్రియాధిష్ఠిత దేవతలును గలిగిరి. తైజసాహంకారము రాజసప్రకృతి యగుటవలన దానివలన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములును బొడమెను. తామసాహంకారమువలన, పృథివ్యప్తేజోవాయ్వాకాశంబులను పంచమహాభూతములును, శబ్ద స్పర్శ రూప రసగంధములను, పంచతన్మాత్రలును గలిగె. కాలలింగ మగు వికృతియు; మాయాలింగమగు విక్షేపంబును, అంశలింగమగు చేతనతయుం గల యీ మహదాద్యభిమాని దేవతలు, పరస్పర న్యూనాధికత్వములు లేమిం జేసి, యితరేతర సంబంధరహితులై బ్రహ్మాండము నిర్మింపఁజాలక పరమేశ్వరునిఁ జేరి ప్రార్థింపఁగ నాపరమేశ్వరుఁడు క్రియాశక్తితోడ నంతర్యామిరూపంబున నాయిరువదిమూఁడుతత్త్వములలోఁ బ్రవేశించి, నానారూపంబు లగు నాతత్త్వగణంబునకుఁ బరస్పరసంయోగముఁ గావించె. ఈశ్వరుఁడు తమలోఁ బ్రవేశించుటవలన నన్యోన్యాంశముచేఁ బరిణతిఁ జెంది క్రియాశక్తిప్రబోధంబుఁ బడసి, యంశముల నధిపూరుష పదవాచ్య మగు విరాడ్దేహమును సృజించె. దాన నీచరాచరంబు లగు లోకములు పుట్టె.

మహదాదులగు జగత్కారణములకుఁ గార్యరూపుఁడగు నా విరాట్పురుషుఁడు జ్ఞానశక్తి, క్రియాశక్తి, భోక్తృశక్తుల నొప్పి, తనంతట తానే జ్ఞానశక్తి యోగమున హృదయావచ్ఛిన్నచైతన్యరూపము ననేకవిధము

వనపుష్పమాలికా వ్రాతకంఠమువాని
నలినకోమల చరణములవాని,
తే. అరుణ గడలుకొనిన కడగంటివాని
గోపాలబాలుభంగి బరఁగువాని,
నగుమొగంబువాని నసుగన్నతండ్రిని
నినుభజింతు మ్రొక్కి నీరజాక్ష.

అదియుసుంగాక రావణవధానంతరము బ్రహ్మదేవుఁడు ఇంద్రాదిదేవతలతోడవచ్చి యాకసమునందుండి శ్రీరామచంద్రుని పరమాత్మస్వరూపిగను, సృష్టిస్థితిలయములకుఁ గారణభూతునిగను, అవ్యయునిగను, అనంతునిగను స్తుతించినట్లు శ్రీమద్రామాయణమందుఁ గలదు. రావణ కుంభకర్ణ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల బాధలు దేవతలకును, లోకములకును గలిగినపుడు దేవతలతోఁగూడ ఇంద్రుడు బ్రహ్మదేవునిదగ్గరకువెళ్లి విన్నవించుకొనును. బ్రహ్మదేవుఁడు వీరిని వెంటనిడుకొని శ్రీమహావిష్ణువునొద్దకువెళ్ళి దేవతాకార్యముల నివేదింపగఁ బరమకారుణికుఁడగు శ్రీమన్నారాయణమూర్తి యవతరించుచుండును. సృష్టిలోనుండు వారిలోను, దేవతలలోను జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడును గనుక శ్రీమహావిష్ణువు నొద్దకుఁ జనుటకు బ్రహ్మదేవునకు శక్తిసామర్థ్యములు కలవుగాని, ఇంద్రాదులకు లేవు. సృష్టికర్తగనుక పరమాత్మకు సామీప్యమందుండు నుత్తమాధికారి. ఎల్లప్పుడు వేదముల నధ్యయనముఁ జేయుచుఁ వేదరహస్యములను మహర్షులకు బోధించుచు, ఆశ్రితులకు, తపస్వులకు వరంబులొసంగుచు, చిత్రవిచిత్రసృష్టిఁ గావించుచుండును.

"ఓపరమేశ్వర! మొదట నీమనస్సువలన జనించుటంజేసి మానస బ్రహ్మ నైతిని. ద్వితీయకల్పమందు నీ చక్షుస్సువలన నుత్పత్తి యగుటం జేసి చాక్షుష బ్రహ్మ నయితి. తృతీయకల్పమున మీవాక్కునుండి పొడముటవలన వాచికబ్రహ్మ నయితి. చతుర్థకల్పమున మీశ్రవణము వలన నుత్పత్తి యగుటంజేసి శ్రావణబ్రహ్మనై పరగితి. పంచమకల్పమున మీ నాసాపుటమువలన జనించుటం జేసి నాసత్య బ్రహ్మనై వెలసితి. షష్ఠకల్పమున అండమువలన నుత్పత్తి యగుటవలన అండజబ్రహ్మనైతి. సప్తమ కల్పమున అనఁగా నిప్పుడు మీ నాభిపద్మమునుండి జనించుటవలన నాభి పద్మజబ్రహ్మయనియు, పద్మసంభవుఁడనియు, పాద్మకల్పీయ బ్రహ్మయని యుఁ బిలువఁబడుచుంటిని. మీయనుగ్రహమువలన నిది సప్తమజన్మము. ప్రతికల్పమందును (సృష్టియందును) త్రిగుణరహితుఁడవగు తమకు నేను పుత్త్రుండను. తాము తండ్రిగనుంటిరి"అని మహాభారత శాంతిపర్వ మోక్ష ధర్మపర్వమునందు పాద్మకల్పీయబ్రహ్మ స్తుతించినట్లు కలదు.

శ్లో. షడ్గుణేన తపోలోకా త్సత్యలోకో విరాజతే,
అపునర్మారకా యత్ర బ్రహ్మలోకో హి సన్మృతః.

బ్రహ్మ నివసించునది సత్యలోకము (బ్రహ్మలోకము) ఇయ్యదితపో లోకమున కూర్ధ్వభాగమం దుండును. ఇందుండువారలు, పునరావృత్తి రహితులు బ్రహ్మవేత్తలు తపోలోకస్థులును పునరావృత్తిరహితులగు తపస్సంపన్నులు తపస్సత్యలోకస్థులు బ్రహ్మాయుష్యముగలవారలై ప్రాకృతికప్రళయమందు బ్రహ్మతోడఁ బరమాత్మ యందు లీనముఁజెందుదు రని యిదివఱలో జెప్పఁబడెను. అయితే జనలోకస్థులు పదికల్పముల పర్యంతమును, మహర్లోకస్థులు కల్పాంతపర్యంతము వసించి పిమ్మట నావృత్తిఁజెందెదరు. చతుర్వేదములు, చతుర్ముఖములయందు వహించుటం జేసి చతుర్ముఖుఁడని చెప్పఁబడు. వాగ్దేవతయగు సరస్వతి ముఖములందు వసించుటంజేసి యితని కళత్రమనియెదరు.

శ్లో. చతుర్ముఖ ముఖాంభోజవన హంస వధూర్మమ,
మానసే రమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ.

నిర్గుణుఁడును, నిరంజనుఁడును, అనంతుఁడును, సాంఖ్యప్రకృతియుఁ గల పరమేశ్వరునకుఁ గాలసంఖ్యానియమితి లేనందున పతనము లేదు. అచ్యుతుఁడనఁబడును. నిత్యశాశ్వతవిభూతియు, సర్వజ్ఞ సర్వశక్త సచ్చిదానంద స్వరూపియు నగు పరమేశ్వరు విలాసముచే త్రిగుణాత్మక మగు సృష్టి కలుగుచుండునని భావము. కాలము, అనంతము, అపరిచ్ఛిన్నము, పరమాత్మ స్వరూపము. పరిచ్ఛిన్నమైనచో నియమితిచేఁ బతనము కలుగుచుండును.

శ్లో. ద్విపరార్థాత్మకః కాలః కథితో యో మయా తవ,
తదహ స్తస్య మైత్రేయ విష్ణో రీశస్య కథ్యతే.

విష్ణుపురాణే ౧ అ. ౫ ౪ అధ్యాయే శ్లో ౪౭

ద్విపరార్థకాల పరిమితిగల బ్రహ్మపతనము శ్రీమహావిష్ణువు కొక దినమనియు విష్ణుపురాణమందుఁ జెప్పఁబడియె.

మహాసంకల్పమునందు "శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః" అని చెప్పుటవలన నింతకుమున్న కొందఱు బ్రహ్మలుండి లయించినట్లును ప్రకృతపు బ్రహ్మయొక్క కల్పము జరుగుచున్నట్లును స్పష్ట మగుచున్నది. అంధకారబంధురిత మగు మహాప్రళయార్ణవమందు అనంతభోగిశయ్యాగతుఁ డగు శ్రీమన్నారాయణమూర్తి నాభికమలము నుండి జనించిన చతుర్ముఖబ్రహ్మ అనిరుద్ధరూపవిష్ణువునుఁ గూర్చి స్తుతించిన సందర్భములోఁ బైవిషయము స్పష్టమగుచున్నది.

శ్లో. త్వత్తో మే మానసం జన్మ ప్రథమం ద్విజపూజితమ్,
చాక్షుషం వై ద్వితీయం మే జన్మ చాసీత్ పురాతనమ్.
త్వత్ప్రసాదా త్తు మే జన్మ తృతీయం వాచికం మహత్,
త్వత్త శ్శ్రవణజం చాపి చతుర్థం జన్మ మే విభో.
నాసత్యం చాపి మే జన్మ త్వత్తః పంచమ ముచ్యతే,
అండజం చాపి మే జన్మ త్వత్తః షష్ఠం వినిర్మితమ్.
ఇదంచ సప్తమం జన్మ పద్మజన్మేతి మే విభో,
సర్గే సర్గే హ్యహం పుత్ర స్తవ త్రిగుణవర్జిత.

ఇది మహాభారతే, శాంతిపర్వణి.

జగ్ధస్థై ర్యోగిభి ర్దేవై శ్చింత్యమానో ఒబ్జసంభవః,
తృతీతాయాం తు శర్వర్యాం స బుద్ధ్వా సృజతే పునః.
ఏవంతు బ్రహ్మణో వర్షం తథా వర్షశతం భవేత్,
గతే వర్షే శతే బ్రహ్మా పరమాత్మని లీయతే.

కల్పప్రళయమందు త్రైలోక్యము దహింపఁబడి యేకార్ణవమై యుండ నారాయణస్వరూపి యగు బ్రహ్మ శేషశయ్యాగతుఁడై యోగనిద్రనుఁ జెందును. ఇట్లు రాత్రి కడవగ జలము మీదనుండు యోగులచేతను, దేవతలచేతనుఁ బ్రార్థింపఁబడిన బ్రహ్మ వ్యుత్థానదశనొంది యనఁగా మేల్కొని మఱల సృష్టింపఁ బ్రారంభించును.

ప్రాకృతికప్రళయమందు శతాయుఃపూర్తిఁజెందిన బ్రహ్మ అకృతకలోకస్థులతోడఁ బరమాత్మయందు లీనముఁజెందగ సమస్తలోకములు, పంచభూతములు, తద్గుణములు నన్నింటిని గ్రసించి శ్రీమన్నారాయణమూర్తి మహాప్రళయార్ణవమందు వటపత్రశాయియై కొంతకాలముండి విలాసముచే మఱల చతుర్ముఖబ్రహ్మను, సమస్తలోకములను పంచభూతములు గలుగునట్లు సంకల్పించును.

శ్లో. ద్వాత్రింశదబ్దకోట్యస్తు తథా బృందాష్టకం భవేత్,
ఖర్వద్వయం నిఖర్వంచ శంకుత్రయ యుతంతథా.
పద్మమేకం సముద్రాశ్చ త్రయో బ్రహ్మసమాగతే,
బ్రహ్మా విష్ణుదినే చైకః పతత్యేవం వదంతి తే.
మనీషిణ స్తథావిష్ణు రహన్యుగ్రస్య శంకరః,
ఈశ్వరస్య తథాచాసౌ నసాంఖ్యప్రకృతే స్తథా.
అతఃపరం పరే ధామ్ని కాలసంఖ్యా న విద్యతే,
బ్రహ్మణో ఒతఃపరం సంఖ్యా నాస్తి చైతన్మతం హి నః.

ఇత్యగ్నిపురాణమ్.

మానవమానముచే ద్విపదార్థసంఖ్యగల బ్రహ్మాయు విదివఱలోఁ జెప్పఁబడెను. బ్రహ్మపతనము విష్ణువున కొకదినమును, విష్ణుపతనము శివున కొకదినమును, శివునిపతనము పరమేశ్వరున కొకదినము నగును.

యమందు దహింపఁబడి, మఱల కల్పాదియందు సృజింపఁబడును. జన స్తప సత్యలోకములు మూఁడును, అకృతకములనఁబడు. అనఁగా ప్రతికల్పాంతమందు నశింపక, కల్పాదియందు సృజింపఁబడక, బ్రహ్మదేవు నాయుః పరిమితివఱకునుండి, బ్రహ్మ పరమాత్మయందు లీనమైనంతట ప్రాకృతికప్రళయము గలిగి నశించును. కృతక, అకృతకలోకములమధ్యమందు మహర్లోకముండును. నైమిత్తికప్రళయమందు త్రైలోక్యముదహింపఁబడఁగ ఆధికారిక దేవతలు, మనువులు, పితరులు, ఋషులు లోనగువారలు మహర్లోకముఁ బ్రవేశింతురు. మహర్లోకమందు నివసించువారు కల్పాంతవాసులు. ప్రళయాగ్నిజ్వాలాసంతప్తులై మహర్లోకవాసు లెల్ల అతోఁడ జనలోకమును, అచ్చటనుండి, తపోలోకమునుఁ బ్రవేశింతురు. మహర్లోకము కల్పాంత మందు శూన్యముగ నుండునుగాని, ఆత్యంతికముగ నశింపదు ప్రళయాగ్ని చల్లారి, కల్పాదియందు సృష్టి ప్రారంభింపఁగనే, ఆధికారిక పదవులును, పుణ్యకర్మఫలానుభవమునుగల దేవతలు, పితరులు, మనువులు లోనగువారలు ఊర్ధ్వలోకములనుండి మహర్లోకములోనికిఁ బ్రవేశించి యచ్చటనుండి సర్వర్గలోకముఁ జేరుదురు. మహర్లోకము కృతాకృతకలోకములకు సంధిస్థానము. దేవతలందఱు జనలోకమునుండి పదికల్పములపర్యంతము వచ్చుచుపోవుచునుండి పిమ్మట నివృత్తిమార్గము నవలంబించి పరమాత్మయం దైక్యమునుఁజెందుదురు. వారివారి కర్మఫలములచుబట్టి కొందఱు యుగప్రళయమందును, మఱికొందఱు మన్వంతర ప్రళయమందును, కొందఱు నైమిత్తికకల్పప్రళయమందును, కొందఱు ప్రాకృతికప్రళయమందును లయింతురు. ఆత్యంతికప్రళయమనఁగ పునరావృత్తిరహితమగు మోక్షము. ఇట్లు ప్రళయభేదములు గలవు. బ్రహ్మదేవుని దినాదియందు సృష్టికల్పమును, దినాంతమందు ప్రళయకల్పమునుఁ గలుగుచు ౩౬౦ దినములు సంవత్సరమును, ౧౦౦ సంవత్సరము లైనంతట సత్యలోకస్థులతోఁడఁ బరమాత్మయందు లీనమగుచుండునని యిదివఱలోఁ జెప్పఁబడెను.

శ్లో. ఏకార్ణవే తు త్రైలోక్యే బ్రహ్మా నారాయణాత్మకః,
భోగిశయ్యాగత శ్శేతే త్రైలోక్యగ్రాసబృంహితః.

సశరీరాశ్చ యాంత్యన్యే జనలోకం సహానుగైః,
ఏవం దేవా స్సపితర ఋషయో మానవా శ్చ యే.
మిత్రై స్సహోర్ధ్వం గచ్ఛంతి వ్యావర్తంతే చ తై స్సహ,
జనలోకా త్సురా స్సర్వే దశకల్పాన్ పునఃపునః.
పర్యాయకాలే సంప్రాప్తే సంభూతా నిధనేష్విహ,
అవశ్యం భావినాఽర్థేన సంబంధ్యంతే తథా తు తే.
నివర్తంతే తథా వృత్తౌ తేషాం సర్గో న నిస్తరః,
మహర్జనం చాపి జనా స్తపంచ ఏకాంతత స్తాని భవంతిసత్యే,
మన్వంతరాణాం పరివర్తనాని ముంచంతి సత్యేన తపోవరాణి,
తపోఽభియోగా ద్విషయప్రహాణా ద్విశంతి తేఽపీశ్వర మేవదేవం.

పుణ్యకర్మఫలానుభవార్థము జనలోకమునుండి మహర్లోకమునకు, మహర్లోకమునుండి స్వర్గలోకమునకు ఆధికారికపదవులుగల దేవతలు లోనగువారలు ప్రతికల్పాంతమందు వచ్చుచుఁ బోవుచుందురుకాని, తపస్సంపన్నులును, జితేంద్రియులును, ద్వంద్వరహితులును, నిష్కాములు నగు మహర్షులు, సనకాదిమునీశ్వరులు, ఉత్తమదేవతలు, బ్రహ్మదేవుని తోడ సత్యలోకమున నుండి మన్వంతరములయందును, కల్పప్రళయమందును, రాకపోకలుఁ జెందక బ్రహ్మతోడఁ బ్రాకృతికమహాప్రళయమందుఁ బరమాత్మయందు లీన మగుదురు.

శ్లో. చతుర్ముఖదినస్యాంతే జగదేతచ్చరాచరమ్,
తదా హి దహ్యతే సర్వం త్రైలోక్యం భూర్భువాదికమ్
త్రైలోక్య మేత త్కృతకం మైత్రేయ పరిపఠ్యతే,
జన స్తప స్తథా సత్య మితి చాకృతకం త్రయమ్.
కృతాకృతకయో ర్మధ్యే మహర్లోక ఇతి స్మృతః,
శూన్యో భవతి కల్పాంతే యోఽత్యంతం న వినశ్యతి.

విష్ణుపురాణే —

భూలోక, భువర్లోక, స్వర్లోకములు మూఁడును, త్రైలోక్యము, ఇది కృతకమని జెప్పఁబడు. కృతకమనఁగా, బ్రహ్మదేవుని దినాంతమగు ప్రళ

రెండవ 50 సంవత్సరములకు, ద్వితీయపరార్థమనిపేరు. ప్రకృతము మొదటి 50 సంవత్సరములు గతించి, రెండవ 50 సంవత్సరములుగల ద్వితీయ పరార్థములో ప్రథమసంవత్సర, ప్రథమమాస, శుక్లపక్షప్రతిప త్తిథి జరుగుచున్నది. ఉదయాది 13 ఘటికలు, 42 విఘటికలు, 21 కలలు 16 నిమేషము 22 లవలు 98 తృటికాలము జరుగుచున్నది. ఇంకను మధ్యాహ్నము కాలేదు పైకాలమునకు సరిగా స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుషసంజ్ఞిక 6 మన్వంతరములు గతించి 7వదియగు వైవస్వత మన్వంతరములో, 27 మహాయుగములుకడచి, 28 వ మహాయుగస్థ కలియుగములో 5030 సంవత్సరములు గతించినవి. 84 వ ప్రమోదనామసంవత్సరము జరుగుచున్నది ప్రతికల్పమునందు 14 మనువులు 41 ఇంద్రులు, దేవగణములు, సప్తర్షులు, అవతారమూర్తులు పాలకులు నుందురు. పదునాలుగు మన్వంతరములు పూర్తియైనంతట కల్పప్రళయ ముగలిగి రాత్రిప్రవేశించును.

నైమిత్తికము, ప్రాకృతికము, ఆత్యంతికము నని ప్రళయములు మూఁడువిధములు. నైమిత్తికమనఁగ, త్రైలోక్యప్రళయము ఇది మహాభయంకరముగ శ్రీవిష్ణుపురాణ షష్ఠాంశ తృతీయాధ్యాయమందు వర్ణింపఁబడినది. శ్రీమహావిష్ణువు సూర్యుని సప్తరశ్ములయందుఁ ప్రవేశించి, సమస్తజలములనుఁ బీల్చివేసి, కాలాగ్నిరుద్రుఁడై పర్వతారణ్యస్థావర జంగమాత్మక మగు త్రిలోకిని దహింపఁజేసి, మహాజ్వాలలతోఁ బ్రజ్వలించుచుండగ, దుస్సహతాపమును సహింపఁజాలక ఇంద్ర, మను, పితృ, దేవతలును, సిద్ధసాధ్యయజ్వాదులును, స్వర్గలోకమును విడిచి మహర్లోకమునుఁ బ్రవేశింతురనియు, నచ్చటను తాపముఁగలిగెనేని జనర్లోకమును, అచ్చటినుండి తపోలోకమున కేగుదురనియు, మఱల ప్రళయము నివర్తించి, సృష్టి మొదలిడఁగనే, అచ్చటనుండి యాయాలోకములకు వత్తురనియు నీదిగువశ్లోకములచే వాయుపురాణమందుః జెప్పఁబడెను

శ్లో. పితృభి ర్మనుభి శ్చైవ సాధ్యై స్సప్తర్షిభి స్తథా.
యజ్వాన శ్చైవ యేప్యన్యే తద్భక్తా శ్చైవ తై స్సహ.
మహర్లోకం గమిష్యంతి త్యక్త్వా త్రైలోక్య మీశ్వరాః,
మహర్లోకం పరిత్యజ్య గణా స్తే వై చతుర్దశ.

| | |
|---|---|
| 13 ఉదాన | 22 వైకుంఠ |
| 14 గారుడ | 23 లక్ష్మి |
| 15 కౌర్మ (పౌర్ణమాసీ) | 24 సావిత్రీ |
| 16 నారసింహ | 25 ఘోర |
| 17 సమాన | 26 వరాహ |
| 18 ఆగ్నేయ | 27 వైరాజ |
| 19 సోమ | 28 గౌరి |
| 20 మానవ | 29 మహేశ్వర |
| 21 తత్పురుష | 30 పితృకల్పము (అమావాస్య) |

బ్రహ్మణయుః ప్రమాణము.

శ్లో. నిజేన తస్య మానేన చాయు ర్వర్ష శతం స్మృతమ్,
తత్పరాఖ్యం తదర్థంచ పరార్థ మభిధీయతే.

కౌర్మే ౫ అధ్యాయః.

శ్లో. శతంహి తస్య వర్షాణాం పర మిత్యభిధీయతే,
పంచాశద్భి స్తథా వర్షైః పరార్థ మితి కీర్త్యతే.
ఏవ మస్య పరార్థంతు వ్యతీతం ద్విజసత్తమ,
యస్యాంతే ఒభూ న్మహాకల్పః పాద్మ ఇత్యభివిశ్రుతః.

మార్కండేయే 46 అధ్యాయే 42, 43 శ్లోకాః.

సర్వలోక సృష్టికర్తయుఁ బితామహుఁడును, దేవతలలో జ్యేష్ఠుఁడు నగు బ్రహ్మదేవు నాయుఃప్రమాణము మార్కండేయ, కూర్మ విష్ణుపురాణములయందు వివరింపబడియున్నది. 14 మన్వంతరములు గల 1000 మహాయుగములు, బ్రహ్మదేవుఁడు సృజించునది పగటికాలమని యు 1000 మహాయుగములు లయించియుండునది రాత్రికాలమనియు 2000 మహాయుగములు, అహోరాత్ర మగు కల్పమనియు నిట్లు బ్రహ్మ మానము చెప్పఁబడెను. అట్టి 360 దినములు, సంవత్సరము 100 (శత)సంవత్సరములుగల, పరమాయువుకు, "పరము." అని సంజ్ఞ. (పరార్థమనఁగ 50 సంవత్సరములు, మొదటి 50 సంవత్సరములకు, ప్రథమపరార్థమని,

బృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖపద్మౌ చ సాగరః,
అంత్యం మధ్యం పరార్ధశ్చ దశవృద్ధ్యా యథాక్రమమ్.

| | |
|---|---|
| 1 | 1 ఏకం |
| 10 | 2 దశం |
| 100 | 3 శతం |
| 1000 | 4 సహస్రం |
| 10000 | 5 అయుతం. (దశసహస్రం |
| 100000 | 6 లక్ష |
| 1000000 | 7 నియుతం (పదిలక్షలు) |
| 10000000 | 8 కోటి |
| 100000000 | 9 అర్బుదమ్ |
| 1000000000 | 10 బృందః |
| 10000000000 | 11 ఖర్వః |
| 100000000000 | 12 నిఖర్వః |
| 1000000000000 | 13 శంఖః |
| 10 00000000000 | 14 పద్మం |
| 100000000000000 | 15 సముద్రః |
| 1000000000000000 | 16 అంత్యః |
| 10000000000000000 | 17 మధ్యం |
| 100000000000000000 | 18 పరార్ధం |

త్రింశత్కల్పాస్తేషాం నామాని యథా
బ్రహ్మదేవునిమాసములోని ౩౦ తిథులు, కల్పములనిపేరు.

| | |
|---|---|
| 1 శ్వేతవరాహ కల్పము. | 7 బృహత్ |
| 2 నీలలోహిత | ౮ కందర్ప |
| 3 వామదేవ | 9 సత్య |
| 4 రాథంతర | 10 ఈశాన |
| 5 రౌరవ | 11 తమః |
| 6 దేవ | 12 సారస్వత |

### యుగప్రమాణము.

| | | |
|---|---|---|
| 432000 | మానవసంవత్సరములు | కలియుగప్రమాణము |
| 864000 | ,, | ద్వాపరయుగప్రమాణము |
| 1296000 | ,, | త్రేతాయుగప్రమాణము |
| 1728000 | ,, | కృతయుగప్రమాణము |
| 4320000 | సంవత్సరములు | మహాయుగప్రమాణము 1 దేవయుగము |
| 71 | మహాయుగములు | 1 మన్వంతరకాలము |
| 306720000 | ,, | మన్వంతరసంవత్సరములు |
| 14 | మన్వంతరములు | బ్రహ్మదేవుని సృష్టికల్పము-పగటికాలము |
| 4294080000 | సంవత్సరములు | |

### బ్రహ్మమానము.

| | |
|---|---|
| 14 మన్వంతరములు లేక 1000 మహాయుగములు | బ్రహ్మదేవుని పగటికాలము సృష్టికల్పము |
| 1000 మహాయుగములు | రాత్రికాలము, ప్రళయకల్పము |
| 2000 మహాయుగములు | అహోరాత్రము (దినము) కల్పమనఁబడును. |

| | |
|---|---|
| 14 మన్వంతరములు లేక 1000 మహాయుగములకాలము మానవసౌరాబ్దములు | 429408000 |
| 6 మహాయుగముల సంధికాలము | 25920000 |
| బ్రహ్మదేవుని పగటికాలము సృష్టికల్పము | 4320000000 |
| ,, రాత్రికాలము ప్రళయకల్పము | 4320000000 |
| అహోరాత్రమగుదినము లేక కల్పము | 8640000000 |
| 30 కల్పములగు మాసప్రమాణము | 259200000000 |
| 12 మాసములుగల సంవత్సరప్రమాణము | 3110400000000 |
| 100 శతవత్సరముల పరమాయుఃప్రమాణము | 311040000000000 |

### సంఖ్యామానము.

శ్లో. ఏకం దశం శతం చైవ సహస్ర మయుతం తథా,
లక్షశ్చ నియుత శ్చైవ కోటి రర్బుద మేవచ.

## మానవలోక కాలమానము.

| | |
|---|---|
| వాడియైన సూదిమొనచే తామరపుష్పపుదళమును గ్రుచ్చినంత కాలము | త్రుటి |
| 100 త్రుటులు | 1 లవము |
| 30 లవములు | 1 నిమేషము (ఱెప్పపాటుకాలము) |
| 18 నిమేషములు | 1 కాష్ఠ |
| 30 కాష్ఠలు | 1 కల (గుర్వక్షరోచ్చారణకాలము) ప్రాణమనఁబడు. |
| 30 కలలు | 1 ఘటిక |
| గుర్వక్షరోచ్చారణకాలములు 10 | 1 ప్రాణమనఁబడు |
| 6 ప్రాణములు | 1 వినాడి (విఘటిక) |
| 60 విఘటికలు | 1 ఘటిక |
| 60 ఘటికలు | 1 దినము (అహోరాత్రము) |
| 15 దినములు | 1 పక్షము |
| 2 పక్షములు | 1 మాసము |
| 2 మాసములు | 1 ఋతువు |
| 3 ఋతువులు (6 మాసములు) | 1 అయనము |
| 2 అయనములు (12 మాసములు) | 1 సంవత్సరము (సౌరాబ్దము) |

## పితృమానము.

| | |
|---|---|
| శుక్లపక్షము | పితృదేవతలకు పగటికాలము |
| కృష్ణపక్షము | ,, రాత్రికాలము |

## దేవమానము.

| | |
|---|---|
| 6 మాసములుగల ఉత్తరాయణము | దేవతలకు పగటికాలము |
| ,, దక్షిణాయనము | ,, రాత్రికాలము |
| 1 సంవత్సరము | అహోరాత్రమగు దినము |
| 360 మానవసంవత్సరములు | దేవతలకు ఒకసంవత్సరము |
| 12000 దైవికసంవత్సరములు | దేవయుగము :— మనుష్యమాసముచే 4320000 మహాయుగము |

